# భారతి

సాహిత్య మాసపత్రి
డిసెంబరు 198



## స్నేహ సంగీతం — చెఱబండరాజు

రామసూరి — కాంతారావు

## ఇది పద్యం — నాయని కవితాయాత్ర

మండేశ్వరరావు — నరసింహారెడ్డి

## రెక్కలు విప్పుకొన్న మనసు — హరిజన సమస్య

అబ్దుల్ ఖాదర్ — మురళీధరరావు

ఇంకా గోదావరిశర్మ, పార్థసారథి, రమేష్‌బాబు, చంద్రశేఖర్, రాధాకృష్ణశర్మ, కిశోరుబాబు – అశోకుబాబు, ప్రభాకరరావు, తిరునగరి, శివకుమారశర్మ, గోపాలకృష్ణ, సత్యవతీదేవి, సుదర్శనరాజు, శోభ, రాధాక్రిష్ణ, భగ్వాన్, రంగారావు ఇతరుల రచనలు



వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతు

# విషయానుక్రమణిక

## డిసెంబరు 1982





# సందేశ సరసం

## శ్రీ కె. గోదావరి శర్మ

1. సిక్కూ తియ్యను, కొప్పూ ముడవను.
ఆడొచ్చేదాకా నేను
సింగారంలోనే ఉంటే
ఎదురు సూపుల సుకం ఎప్పుడు ?

2. నులక మంచం మీదకి
మంచి దుప్పటయినా లేదు.
ఆడికివన్నీ కావాలా ?
పట్టు పరుపులు ఉన్నోళ్లకయినా
నువ్వు పక్కనుండే సుకం ఎక్కడిదంటాడు !

3. బియ్యం దంచీ పిడకలు సరిసీ
సేతులు మొద్దుబారి పోనాయి.
అయితే ఏటి ?
రాత్తిరి నారాజు ఆటినే
వొద్దన్నా ముద్దెట్టుకుంటాడు !

4. సేలో పాట కోస్తంటె
కొడవలి సప్పుడులో
ఆడిపేరే ఇనిపిస్తాది.
ఫేక్టరీ మిషన్ సప్పుళ్ళలో
ఆడికీ నాపేరే ఇనిపిస్తాదేటో !

5. ఆడొచ్చి ఏన్నీళ్ళు స్తానం ఆడి
నేను ఉతికి ఉంచిన తెల్లపంచె కట్టుకుంటె
ఎన్నెల కట్టుకున్న సెంద్రుడిలాగ
ఎలిగి పోడూ ?

6. ఆణ్ణి బయటకెల్లమని
నేను సీర సింగారిస్తంటె
'అబ్బ ఎంత బాగున్నాదే
ఎన్నెల' అని సెప్పడానికట
తడిక కన్నంలోంచి నన్ను సూస్తాడు !

7. సేతిలో సెయ్యేసి ఇద్దరం
సెరువు గట్టంట నడుస్తా ఉంటె
సెరువుకి మా గాలి తగిలి
నోరంతా గలగలా నవ్వులే !
బూదేవివి ఒల్లంతా జల్లుమని
బూవంతా పువ్వులే !

8. మొకంమీద మొకం ఎట్టి
ముద్దు ముచ్చట్లాడతా ఉంటె
ఆడు ఇడిసీ గాలి
నన్ను ఎచ్చగా ఏడెక్కిస్తా ఉంటె
పురుగూ పుట్రా బుస్సుమన్నా
పక్కకి తిరిగి సూడను నేను.

9. ఇంటికెల్లొద్దే,
ఇక్కడే ఉండి పోదావఁంటాడు.
ఇసిత్రం సూస్తా సెంద్రుడున్నా
ఇంటి ఊసు మరిసిపోతాడు.

10. సగం రేత్తిరికి సల్లగా తిరిగొచ్చి
కూడు తిన్నా మావాఁ అంటే
కూడా నువ్వుంటే
కూడెందుకే మరంటాడు
నీ అందవేఁ కొరుక్కు తింటానంటాడు.

11. నులక మంచం మీద
నలిగిన దుప్పట్టే సరిజేసి
ఒకల్ల మీద ఒకల్లు పడి
నవ్వుకుంటా నిదరోతే
గుడిసెలోని సొర్గవేఁ
గుండె పట్టదు మాకు.

# ప గ లు

శ్రీ ఎస్. కె. పార్థసారథి

ఈ నిప్పుల దుప్పటి
ఈ అంగారపు అంగరఖా
ఈ మంటల పేంటలూన్
ఈ ఎఱ్ఱటి కఫన్
ఈ పగటి సెగలు
ఓహ్ .... కనిన పునసు పొగులు.

నీరవమై, శీతలమై
తమిరావృత భూనభమై
హాయిగొలుపు చల్లని
నలనల్లని నడిరాతిరి వేళౌటకు-అబ్బో ఇపుడెక్కడ
చాల పొద్దు ఉన్నదిలే, పోనీ-

నిశీధినీ సంకేతము
ఖద్యోతున కుద్వాసన
ఆశలు చిగురింపజేయు మునిమాపటి వేళ-దానికి
సైతం-ఇపుడెక్కడ చాల పొద్దు
ఉన్నదిలే, కానీ -

ఈ నలసల .... ఈ భగభగ
కొకయించుక ఉపశమనముగా
ఒక్క క్షణం -
ఏ తెలిమబ్బుల పలుచని నీడైనా నాపై పడరాదో ?

~~~~

# చె ట్టై న యం

శ్రీ కోపుటం చంద్రశేఖర్

చలికాలం వస్తే ఈదరుగాలులనీ
ఎండకాలం వస్తే నిప్పులు చెరిగే గాడ్పులనీ
వానకాలం వస్తే వరదనీళ్ళనీ
భయపడుతున్న ఓ మధ్యతరగతి మానవుడా
నీకన్న చెట్టైనయం.
కనీసం ఓ కాలమైన నవ్వుతూ బతుకుతుంది.

[ మేకా సుధాకర్ గార్కి- ప్రేమతో - అంకితం ]


~~~~

శ్రీ నాళేశ్వరం శంకరం

# చలంపై ప్రభావం

ప్రతివ్యక్తి యొక్క మానసిక, శారీరక విలువల్లో తప్పని సరిగా కొందరి ప్రభావం వుంటుంది. ఇది ప్రకృతి ద్వారానో, సమాజం ద్వారానో తర తరాల నుంచి వస్తున్న సంప్రదాయాల ద్వారానో అనేక విధాలైన సిద్ధాంతాల ద్వారానో, మరేవిధంగానైనా కాని వ్యక్తి యొక్క మనస్సుపై ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కొంత ప్రభావం పడుతుందనేది వాస్తవం.

చలంగారు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను ఎన్నో ప్రభావాలకు లోనైనారు. అనాటి సమాజంలోని వ్యక్తుల ప్రవర్తనలు, నీతులు, నియమాలు చలాన్ని ఎంతో ప్రభావ పూరితున్ని చేసినాయి. ఇంతేగాక కందుకూరి వీరేశలింగం పంతులుగారు చేపట్టిన స్త్రీ సమస్యల ప్రభావం కూడా చలంగారిపై కొంత ఉన్నదనే చెప్పాలి. కందుకూరి స్త్రీ ఉద్యమంతో పాటు గురజాడ, రఘుపతి వెంకటరత్నం మొదలగువారు స్త్రీ సమస్యల గూర్చి పోరాడిన విషయాలు కూడా చలంపై కొంత ప్రభావాన్ని చేకూర్చాయి. చిన్నతనంలో చలం చదివిన చిలకమర్తిగారి సాహిత్య ప్రభావం చలం సాహిత్యంపై కొంత ఉందనే అనుకోవాలి. ఇవేకాక అనాటి సమాజంలోని స్త్రీల బానిస జీవన విధానం ప్రత్యక్షంగా చూశాడు కూడ. ఈ విషయాలే కాక పురుషుల వలన తన స్వంత కుటుంబములోని స్త్రీలకు జరిగిన పరాభవాలు కూడా అతని రచనపై ప్రభావం చేసింది.

నండూరి సుబ్బారావుగారి యెంకి పాటల ప్రభావం చలంగారిపై చాలావుంది. చలంగారికి నచ్చిన యెంకి పాటలలో కొన్నింటిని ఎంతో గొప్పగా చక్కగా వ్యాఖ్యానించాడు. ఈ వ్యాఖ్యానాలు చలం రచనలైన మ్యూజింగ్స్, ప్రేమలేఖలు, కొన్ని కథలలో ఎక్కువగా చూడవచ్చును.

"యెంకెవ్వరని లోక మెపుడైన కదిపితే
యెలుగు నీడలకేసి యేలు చూపింతు"2

అన్న నండూరి సుబ్బారావుగారి పాటకు చలంగారి వ్యాఖ్యానమిది. "ఆ రెండు పాదాలకీ యీడైన కవిత్వం ఈ ప్రపంచ వాఙ్మయంలో ఎక్కడా కనిపించదు. నా ముందు ఆరాటపడే ఈ సముద్రపు అగాధత్వమూ, నిరంతర అశాంతి, నా హృదయంలోని అర్థంలేని ఆరాటమూ, నిర్నిద్ర, ఆదర్శవాంఛా, సఫలంలేని, కాని, నా ఘోష జీవితంలోని మాధుర్యమూ, విషమూ, నిష్ఫలత్వమూ అన్నీ గోచరిస్తాయినాకు ఆ పాదాలలో"3 అని యెంకి పాటలకు తనలో హృదయ సింహాసనం వేశాడు. మరికొన్ని చోట్ల యెంకిపాటలకు ఈ విధంగా ప్రభావం చెందినట్లు తెలుస్తుంది.

"ఏటి కడుపున దాగి
తోట నిదురోయింది"4

"ఈరేయి నన్నొల్ల నేరవా రాజా
యెన్నెల సొగసంత ఏటిపాటలే నటరా"5

"కలవరపు నా బ్రతుకు
కలత నిదరయ్యింది"6

(ఇలాంటి పాదాలతో సుబ్బారు పాడుతూ ఉంటే) "అంటో వుంచే మధురమైన బాధతో - కృంగదీసే నిద్రవిరహంతో - ఈ మామిడి పూల మత్తు పరిమళం వలె ఆ చంద్రుడి నిద్ర ప్రతి ఫలితంవలె - వినబడుతుంది నాకు. ఎంకిపాటల్ని అప్పుడే ఆంధ్రదేశం మరిచి పోయింది. గ్రామఫోనులో చవక చేశారు. కాని ఉర్దూలోని ప్రేమగీతాలవలె - బరన్సు, స్కాచ్ పద్యాలవలె - పూర్వ కాలపు పర్షియన్ కవుల ధీరమయిన కవిత్వంవలె - వైష్ణవ గోపికా గానంవలె ప్రత్యేకమైన విలువ గలిగిన ఆంధ్ర ఐశ్వర్యం యీ పాటలు"7. ఇలా యెంకి పాటలలోని ప్రధానమైన భావచిత్రాలు చలాన్ని ప్రేరేపించాయి. చలం రచనా వ్యాసంగం, భావ కవిత్వం ముమ్మరంగా ఉన్న సమయంలో ప్రారంభ మయింది. ఒకరకంగా చలం యెంకి పాటల మాధుర్యంలో పడినపుడే కాల్పనిక కవుల ఛాయలు అతనిలో ప్రవేశించాయని అనిపిస్తుంది. కాని చలం పూర్తి కాల్పనికుడు కాడు.8

విశ్వనాథ, శ్రీశ్రీలు భావకవిత్వ మార్గంనుండి తప్పుకొని భావ, భౌతిక వాద సాహిత్య ప్రస్తావకులైనా చలం రొమాంటిస్ట్ గానే మిగిలిపోయాడు అని మొగలి నాగభూషణశర్మ లాంటివారు పేర్కొన్నారు. ఇది పూర్తి సమంజసమైన వాదము కాదనిపిస్తుంది.9

గల్పనిక కవుల భావగీతాలు మాత్రం అతనికి బాగా నచ్చేవి. అయితే భావకవులకు భావగీతాల విలువ తెలియదని తన రచనలలో ఎత్తి చూపాడు.10

నండూరి సుబ్బారావుగారి వ్యక్తిగత ప్రభావం కన్న అతని సాహిత్య ప్రభావం చలంపై ఎక్కువగా ఉంది. అలాగే చలంపై రవీంద్రనాథ టాగూర్ ప్రభావంకూడ ఉంది. టాగూర్ సాహిత్యం ద్వారా చలం యేరకమైన ప్రేరణ పొందాడనే విషయంలో చలమే స్వయంగా చెప్పుకున్నాడు. టాగూర్ పుస్తకాలైన ఉత్తరణ, గీతాంజలి, కాన్క, ఫలసేకరణ, వనమాలి మొదలగు పుస్తకాలను తెలుగులోకి అనువదించాడు. "తృప్తి అమార్, అతృప్తి అమార్"11 అనే టాగూర్ గీతం చలానికి జ్ఞాపకమొచ్చేది. రవీంద్రనాథ టాగూర్ సరస్సు మీద ఒక పాట వ్రాశాడు12 అని చలం తన ప్రేమ లేఖలలో వివరించాడు. టాగూర్ గారి సరస్సుపై వ్రాసిన పాటనే చలంగారు తోటమీద వ్రాసిన దానికి ప్రేరణ అయింది. ఆ పాట ఇది:

ఓః కమ్ టు మై గార్డెన్
ఇఫ్ యూ విష్ టు హియర్ ఎ సాంగ్ ఎట్ నూన్‌డే ఇన్ యువర్ ఐడిల్
అవర్ దేర్ ఈస్ సాఫ్ట్ గ్రాస్ టు బి డౌన్ కమ్ టు మై గార్డెన్
ఇఫ్ యూ విష్ టు బాస్ యువర్‌సెల్ఫ్ ఇన్ ఎ లాఫ్ ఎండ్ ఎ క్వాఫ్
దేర్ ఆర్ తౌసండ్ ఫ్లవర్స్ స్వేయింగ్ విత్ డిలైట్
కమ్ టు మై గార్డెన్
ఇఫ్ యూ విష్ టు రియలైస్ లవ్ ఇన్ ఎ కిస్ ఎండ్ ఎ టియర్ దేర్ ఆర్ లీవ్స్ ఎరౌండ్ టు హైడ్
కమ్ టు మై గార్డెన్.13

భారతీయ రచయితలలో టాగూర్ ప్రకృతిని తన సాహిత్యం నిండా గొప్పగా చిత్రీకరించాడు. ఇతని ప్రకృతి వర్ణన చలంపై కొంత ప్రభావం చేసింది. టాగూర్‌లో ఉన్న సౌందర్య తృష్ణ చలంగారికి చాలా నచ్చింది. సముద్రాన్ని వర్ణించడంలోను, ప్రకృతిని సౌందర్యరాశిగా చేసి ఆరాధించడంలోను చలంపై టాగూర్ ప్రభావం కొంత ఉందనవచ్చు.

టాగూర్ లేకపోతే, ఎండలో ఆకుల్లో నీడలు నిద్రపోవడం, మబ్బుల్లో కన్నీళ్ళు కరిగిపోవడం, సూర్యోదయంలో ప్రేమని భరించలేని దయగల నవ్వు, అర్ధరాత్రి నక్షత్రాల 'మిస్టరీ' నాకెవరు చెప్పగలిగే వారు? అనేవాడు చలం, టాగూర్ రచనలలోని సౌందర్యాన్ని ఆస్వాదించాడు. ఇంతెందుకు చలంగారే ఒకరడిగిన ప్రశ్నకు టాగూర్ ప్రభావం తనపై ఉన్నదని తెలుపుకున్నాడు.14 టాగూర్ గ్రంథాలన్నింటికన్న అతని 'గీతాంజలి' చలంగారిపై ఎక్కువ ప్రభావం చేసిందని చెప్పాలి. చలం తన ఆత్మకథలో ఈవిధంగా తెలిపాడు. "టాగూర్‌గారి 'గీతాంజలి' నా జీవితంలోకి వొచ్చింది. ఆనాటినుండి ఈ రోజువరకు టాగూర్‌గారి భక్తిగీతాలు నా జీవితపు లోతుల్ని 'ఇన్‌ఫ్లుయెన్స్' చేస్తూనే ఉన్నాయి."15 అని తెలిపాడు. చలం ఆత్మకథలోను, మ్యూజింగ్స్‌లోను, ప్రేమలేఖలోను టాగూర్‌పై చలంకు గల దృక్పథాన్ని వివరంగా తెలుసుకోవడానికి ఎన్నో ఆధారాలు ఉన్నాయి. టాగూర్ రచనలోని కొన్ని భావాలు చలంకు నచ్చక పోయినా అతని రచనా విధానం, అతని వర్ణనను చూసి, చలం చాలా ఆనందించేవాడు. టాగూర్‌ని చలం ఇష్టపడడానికి ప్రధాన కారణం ఇది "వ్యూస్ నచ్చక పోయినా ఎక్స్‌ప్రెషన్‌కి కట్టుబడిపోయా. మిస్టిసిజం నాకు పట్టకపోయినా ఎక్స్‌ప్రెషన్‌లోవున్న సింప్లిసిటీ నన్ను ఆకట్టేసింది."16 అని నిర్మొహమాటంగా, దాపెట్టుకోకుండా తనకు నచ్చిన విషయాలు చెప్పాడు.

టాగూర్ తరువాత చలంగారిపై ఎక్కువ ప్రభావం చేసిన వ్యక్తి రమణమహర్షి. చలాన్ని రమణమహర్షి ఆలోచనా విధానం వైపు లాక్కుపోయిన వారు చింతా దీక్షితులు. మహర్షి ప్రభావమే కాక దీక్షితుల ప్రభావం కూడా చలంపై ఉంది. దీక్షితులను గురువుగాను, స్నేహితుడిగాను భావించాడు. చలం సాహిత్య రంగంలో ప్రవేశించడానికి దీక్షితులే కారకుడు. చలాన్ని రచనా రంగంనుండి నిష్క్రమింపజేసి ఆధ్యాత్మిక రంగమునకు మరల్చిన వాడు దీక్షితులే. దీక్షితుల ప్రభావం ప్రత్యక్షంగా, పరోక్షంగా చలం గారిపై ఉంది. రమణమహర్షి విషయంలో చలం, దీక్షితులు ఇద్దరు కలిసి ఎన్నో ఉత్తరాలు వ్రాసుకున్నారు. 1936లో దీక్షితులు చలాన్ని రమణ మహర్షి దర్శనానికి తీసుకు పోయిన తరువాత పెద్ద మార్పు అతనిలో రాలేదు. కాని 1950 తరువాత చలంలో అనేక మార్పులు వచ్చాయి. అంతేకాక రమణమహర్షి విషయంలో చలానికి అనేక సంశయాలు కూడా ఏర్పడ్డాయి. "భగవాన్‌కే వొదులుతున్నాను. వారైతే నన్ను లీడ్ చేయమనండి"17 అని వాదించిన చలం తరువాత రమణ మహర్షిలో ఐక్యమవడానికి ప్రయత్నించాడు. అంతకు ముందున్న చలంలోని అశాంతి రమణ మహర్షి దగ్గర కొంత తొలగిపోతున్నట్లు భావించాడు. చివరి దశలో తన జీవితాన్ని మహర్షిపై వదిలేసాడనిపిస్తుంది. "ఈశ్వరుడే ఉంటే, ఈశ్వరుని చూడడానికి నీవు మార్గమే నాకు, నీద్వారా తప్ప ఓ ఔన్నత్యమూ, నన్ను చేరడానికి వీలులేదు. నా నివాసం

నీలోనే కనుక ఈశ్వరుడు ప్రత్యక్షమైతే నాకు నీరూపాన్నే రావాలి. ఇంకా ప్రజ్వలితంగా, ఆనందంగా, అనంతంగా కావాలి అంతే"[18] అని తనలోని సర్వశక్తులను రమణమహర్షికే వొదిలాదనిపిస్తుంది. 1950 తరువాత రమణమహర్షి ప్రభావం పడినంతగా ఎవరి ప్రభావం చలంపై ఎక్కువగా పడలేదనే చెప్పాలి.

చలంలోని అనేక అంశాలను ఆధారం చేసుకుని ప్రాచీన కవులకు చలానికి మధ్యకొంత తారతమ్యం ఉందని అభిజ్ఞులు తెలిపారు.[19] తెలుగు సాహిత్యంలో శ్రీనాథుని రచనాశైలికి ఎంతటి ప్రాముఖ్యమున్నదో చలం శైలికి అంతటి ప్రాముఖ్యం కలదని గొర్రెపాటి వెంకట సుబ్బయ్య చలం జీవితం - సాహిత్యం అనే గ్రంథంలో వివరించాడు. చలంను వేమనతో శ్రీశ్రీ ఈ విధంగా వివరించారు: "ఎందువల్లనో చలంగారిని ఇరవయ్యో శతాబ్దపు వేమన యోగిగా అభివర్ణించడం మానలేక పోతున్నాను. ఇద్దరికీ ఈ ప్రపంచపు చెడుపోకడల మీద ఒకేరకం ఒళ్ళుమంట ఉంది. అయితే ఎవరికంటె ఎవరు ఎక్కువ తీవ్రంగా విరుచుకు పడ్డారనేది తేల్చుకోలేకుండా ఉన్నాను. ఒక ముఖ్యమైన భేదం మాత్రం స్పష్టమే. వేమన విమర్శలు ఇంట్యూయిటివ్‌గా ఉంటే చలం విమర్శలు ఇంటలెక్చువలుగా ఉంటాయి"[20] అని చలంలోని తీవ్రతను, భేదాన్ని వివరించారు.

చలంగారిపై భారతీయరచయితల ప్రభావమేకాక పాశ్చాత్య రచయితల ప్రభావం కూడా ఉంది. పాశ్చాత్య రచయితలైన మొపాసా, మాఘం, బెర్నార్డుషా ప్రభావం తనపై ఉన్నట్లు చలంగారే నవీన్ అనేక రచయితకు ఇచ్చిన ఇంటర్వ్యూలో తెలిపాడు.[21] చలంపై వీరి ప్రభావమే కాక ఇబ్సన్, లారెన్సుల ప్రభావంకూడా ఉన్నట్లు కొందరు వివరించారు.[22] లారెన్సు ప్రభావం చలంపై చాలా ఉందనే వారు చాలావున్నారు. లారెన్సు, చలం శృంగార సంబంధమైన విషయాలను ఎక్కువగా చర్చించడమే దీనికి కారణం కావచ్చు. లారెన్సు చెప్పినదానికి, చలం చెప్పిన దానికి స్త్రీ పురుషులు అనుభవించే శృంగార వాంఛలో భిన్నత్వం వుంది[23] అని ఓ పరిశోధకురాలు వివరించారు. నార్ల లాంటి అభిజ్ఞులు "ఒక్కొక్క మాట చలం డి. హెచ్. లారెన్స్‌ని మక్కీకి మక్కీ అనుసరించాడు"[24] అని తర్కంలోకి లాగటానికి ప్రయత్నిస్తున్నారు. చలం లారెన్సును బాగా చదివే నాటికే అతని మంచి సాహిత్యమంతా వచ్చిందనిపిస్తుంది. లారెన్సు ప్రభావం చలంపై లేదని కాదు కాని మక్కీకి మక్కీ మాత్రం చలం సాహిత్యం కాదేమో. లారెన్సు పుస్తకాలు మొట్టమొదట 1933లో చదివానని చలం స్వయంగా చెప్పాడు.[26] అంతేగాక లారెన్స్ ప్రభావం మీమీదుందా అని ఒకరు అడిగిన ప్రశ్నకు చలం యిచ్చిన సమాధానం చూస్తే అసలు విషయం తెలిసిపోతుంది. "అంతా అలాగే అనుకుంటారు. కాని, నేను వ్రాశాక చదివా అయన్ని. ఇటీవల వజీర్ రహ్మాన్ మాయిద్దరి వాక్యాలుఎత్తుపడి, ముగింపుకూడా ఒక్కటేనని కొన్ని పేజీలు వినిపించాడు. అవి అనుకోకుండా దొర్లినసామ్యాలు. నిజమైన సౌందర్యం, కళాత్మక రచనలు అనుకరణవల్లరావు; హృదయంలోంచే రావాలి.[27] అని చలం తెలియజేశాడు. "టాగూర్ పుస్తకాలు లాటరెన్స్ హోప్ మొగలు కవిత్వం, జెబునిసా దివాన్ ఇవన్నీ చెట్లకిందా కూచుని చదువుకునే వారం"[28] అనే విషయంలో చలం లారెన్సు పుస్తకాలు చదివినట్లు తెలుస్తుంది. "కీట్సు, షెల్లీ, బైరన్, వర్డ్సువర్తు, బ్రౌనింగ్, డి. హెచ్. లారెన్సు మొదలైన వాళ్ళని వొదిలి పోతన్న కన్న శ్రీనాథుడు నూరురెట్లు ఎక్కువ చక్కగా వ్రాశాడు"[29] అనే విషయంలో కూడ లారెన్సును చలం తారతమ్య చర్చ చేసుకుంటూ చదివినట్లు రూఢి అవుతుంది. అందువల్ల ఖచ్చితంగా లారెన్సు ప్రభావం ఉందీ అని చెప్పడానికి చలం గ్రంథాలు, లారెన్సు గ్రంథాలు ఏయే కాలాలలో వచ్చినవో తెలుసుకొని వాటిని సద్వివేచనతో పరిశీలించవలసి ఉంది.

లారెన్సు ప్రభావం చలంగారిపై అధికంగా ఉంది అనే వారిలాగానే చలంగారిపై బెర్ట్రాండ్ రెస్సెల్ ప్రభావం అధికంగా ఉంది అనే వారు కూడా ఉన్నారు.[30] రస్సెల్ లేవనెత్తిన స్త్రీ సమస్యలకు ముందే చలం 'స్త్రీ' అనే పుస్తకాన్ని వ్రాశాడని, రస్సెల్ వ్రాసిన "మ్యారేజ్ అండ్ మోరల్స్" అనే గ్రంథం యొక్క ప్రభావం చలం గారిపై లేదని రచనాకాలం ఆధారం చేసుకుని చూడాలని వాదించేవారు ఉన్నారు.[31] ఏదిఏమైనా చలంగారు స్వయంగా తన ఆత్మకథలో "ఈ ఆలోచనలకు బెర్ట్రాండ్ రస్సెల్, మీటర్‌లింక్, హెవలాక్ మొదలైన వారి రచనలు ఊతనిచ్చేవి నాకు"[32] అన్నాడు. మరోచోట 'స్త్రీ' అనే పుస్తకం వ్రాయక ముందే రస్సెల్ "మ్యారేజ్ అండ్ మోరల్స్'' చదివారా? అని ప్రశ్నించినపుడు చలం ''లేదు చాలాకాలం తరువాత చదివా. రస్సెల్‌లో రేషనాలటీ నచ్చింది. అతనివి ఎక్కువే చదివా. సైన్సు పుస్తకాలు నాకు అర్థం కాలా''[33] అనటం వల్ల రస్సెల్ ప్రభావం చలంగారిపై ఉందా? లేదా? అనే సంశయం వస్తుంది. ఈ విషయంపై చాలా పరిశోధించవలసి ఉంది.

రస్సెల్, లారెన్స్ పుస్తకాలేకాక టాల్‌స్టాయ్, గోర్కీ, చెకోవ్ గ్రంథాలు కూడా చలం చదివాడు. టాల్‌స్టాయ్‌గారి ''వార్ అండ్ పీస్'' చలంగారు చదివినప్పుడు అతనికి 'లబోరియస్' అనిపించింది. యుద్ధ వర్ణనలు వదిలేశాడు. "వార్ అండ్ పీస్" పుస్త

కంపై అభిప్రాయం అడిగినపుడు "ఇట్ వార్ అండ్ పీస్" కన్న అనాకరీనైనా మెరుగు అని సమాధానం యిచ్చాడు.

గోర్కి చెకోవ్‌పై అభిప్రాయ మడిగినపుడు చలంగారు "ఆశ్రియం పొచ్చాక గోర్కి ఆటోబయగ్రఫీ, చాలాకథలు చదివా. నన్ను బాగా కదిలించాయి. ఇంతకుముందే ఎందుకు చదవలేదా అనుకున్నా. అమ్మ నాకు నచ్చలా, నాలో లోపమేనేమో. గోర్కి ముందు చెకోవ్ చాలా లైట్ అనిపిస్తాడు. ఐ ప్రిఫర్ గోర్కి."35 అని సమాధాన మిచ్చాడు. గోర్కి ప్రభావంతో రచనలు ఏమీ చేయలేక పోవచ్చు. ఆర్లెన్, మైకేల్స్, చెప్పిన ప్రేమికుల విషయాలు చలం గారికి ఎంతో నచ్చేవి. ఈ క్రింది వాక్యంద్వారా ఈ విషయం స్పష్టం చేసుకోవచ్చు.

"లవ్ ఈస్ జస్ట్ ఎ స్ట్రైక్ ఆఫ్ ది హార్ట్ టు ఫూల్ ది మైండ్".36

చలం విషాదాన్ని ఎంతో ప్రేమించాడు. అతనికి తెలియకుండానే అతనిలో దిగులు ఆవరించేది. ఇలాంటి స్వభావం గల చలంగారికి బైరన్ వ్రాసిన మాటలు పదేపదే జ్ఞాపక మచ్చేవని ప్రేమ లేఖలలో తెలుపుతున్నాడు. బైరన్ ప్రభావం చలంగారిపై కొంత ఉండేదేమోననిపిస్తుంది. బైరన్ గారు వ్రాసిన "ఇట్ ఈస్ బెటర్ టు బి వెప్ ఆర్ డెడ్; దాన్ వేర్ ఎ హార్ట్ వుమన్ లవ్స్ టు రెండ్".7 అన్న భావం చలం ఆలోచనా విధానంపై ఉన్నట్లనిపిస్తుంది. ఏది ఏమైనా చలం పాశ్చాత్య సాహిత్య ప్రభావంతో కొన్ని రచనలు చేశాడు. అంతేకాక కొన్ని అనువాదాలు కూడా చేశాడు. అందులో ప్రధానమైనది "దైవమిచ్చిన భార్య." ఈ నవలను అనువదిస్తున్నట్లు ప్రేమలేఖలలో తెలిపాడు.38 ఈ దైవమిచ్చిన భార్య ఇంగ్లీషులోని "ఎడాప్షన్, వెలెస్ పాషనేట్ ఫ్రెండ్‌కి అనువాదము. అసలు పుస్తకంమీద ఇంప్రువ్‌మెంట్."39 అని గొర్రెపాటి వెంకట సుబ్బయ్య తెలిపాడు. ఈ నవలేకాక పాశ్చాత్య సాహిత్య ప్రభావంతో కొన్ని కథలు వ్రాసినట్లు, కొన్ని అనువదించినట్లు కూడా తెలుస్తుంది. చలం 'చుక్కమ్మ' అనేకథను 'నార్వేజియన్ నావెల్' ప్రభావంతో వ్రాసినట్లు తెలుస్తుంది. అలాగే 'అనాటోల్‌ఫ్రాన్సు' కథ ప్రభావంతో 'మనోహరప్రణ్ణ' అనేకథను వ్రాసినట్లు తెలుస్తుంది. మొపాసా రచనల ప్రభావం చలంపై ఉండేదని వాస్తవం. తనపై ప్రభావం ఉన్నట్లు స్వయంగా చలంగారు తెలిపారు కూడా.42 మొపాసా గారి 'ఆత్మహత్యలక్ల బ్బు' అనే కథను చలం 'ఆత్మహత్య' అనే కథపేర అనువదించాడనిపిస్తుంది.43 ఈ కథకాక చలంగారి 'బిడ్డ' అనేకథకూడా మొపాసా నుంచి గ్రహించిందే ననిపిస్తుంది. మొపాసా కథలను అనువదించడమేకాక వారి రచనల ప్రేరణతో 'లక్ష్మిందేవి' అనే కథలవంటివి వ్రాసినట్లుకూడా తెలుస్తుంది.44

పైన వివరించిన అనేక సాహిత్యాల, వ్యక్తుల ప్రభావం చలంగారిపై ఉన్నట్లు స్థూలంగా వివరించా సూక్ష్మంగా, వివరణగా తెలుసుకోవడానికి వివేచనతో, నిష్పక్షపాతంగా పరిశోధించాల్సి ఇంక చాలా ఉంది.

## జ్ఞాపికలు

1. తన చెల్లెలి 'కార్యం' సందర్భంలో ప్రత్యక్షంగా చూసి బాధపడ్డాడు. చెల్లెలిభర్త కాముకత్వంతో కూడుకొని'కార్యం' రోజు అనుభవించ ప్రయత్నం చేసిన సంఘటన లాంటివి చలంను బాగా ప్రభావితున్ని చేసినాయి.
2. మ్యూజింగ్స్, పుట 51
3. మ్యూజింగ్స్, పుట 51
4. మ్యూజింగ్స్, పుట 63
5. మ్యూజింగ్స్, పుట 63
6. మ్యూజింగ్స్, పుట 64
7. మ్యూజింగ్స్, పుట 64
8. చలం అద్యంతము రొమాంటిస్టు. ముగిలి నాగభూషణ శర్మ : తెలుగు నవలా వికాసం, పుట 77
9. ఈదారెడ్డి: చలం నవలలు-సామాజిక చైతన్యం, పుట 3
10. చలంగారి కళ్యాణిపంటి కథలలో భావకవుల ధనదాహం - కీర్తి కాంతలను దృష్టిలో పుంచుకొని భావకవులు భావగీతాలను వ్రాసినవారిని విమర్శించాడు.
11. చలం, మ్యూజింగ్స్, పుట 41
12. చలం, ప్రేమలేఖలు, పుట 90
13. చలం, ప్రేమలేఖలు, పుట 90
14. సృజన: నవీన్ అడిగిన ప్రశ్నకు చలంగారు ఇచ్చిన సమాధానం, మే, 1968.
15. చలం ఆత్మకథ, పుట 48

16. సృజన – జూన్ 1979 చలంతో ఇంటర్వ్యూ : చలసాని ప్రసాద్‌రావు, పుట 60
17. చలం ఉత్తరాలు, రెండవభాగం, పుట 9
18. చలం ప్రేమలేఖలు, రెండవభాగం, పుట 165
19. గొర్రెపాటి వెంకట సుబ్బయ్య, చలం జీవితం–సాహిత్యం అనే గ్రంథంలో వివరించాడు.
20. చలం–కలం వెలుగులు, చలం–లోకం శ్రీశ్రీ వ్యాసం
21. సృజన–నవీన్ ఇంటర్వ్యూ, 1968 మే సంచిక
22. గొర్రెపాటి వెంకట సుబ్బయ్య: 'చలం జీవితం–సాహిత్యం' అనే గ్రంథంలో.
23. చలానికి, లారెన్సుకు మధ్యకూడా భేదం కనిపిస్తుంది. ప్రకృతి సహజమైనం వాఛలను అణచి ఉంచటం నేరమని లారెన్సు, చలం ఇద్దరు భావించినప్పటికి లారెన్సుదృష్టిలో స్వేచ్ఛాప్రవృత్తి, వాంఛాప్రవృత్తి అనేవి బాహ్యామైన విషయాలు. తెలుగునవల మనోవిశ్లేషణ. డి. విద్యేశ్వరి.
24. ఈనాడు దినపత్రిక, డిసెంబరు 1,1981. నార్లతో నారాయణ రెడ్డి, పుట 3
25. లారెన్సు పుస్తకాలు చలం చదవక ముందే చలం స్త్రీ, మైదానంలాంటి పుస్తకాలు వ్రాశాడు.
26. చలం : కవిగా చలం : పుట 85
27. సృజన: జూన్ 1979 చలంతో ఇంటర్వ్యూ, చలసాని ప్రసాద్, పుట 60
28. చలం ఆత్మకథ, పుట 107
29. చలం మ్యూజింగ్స్, పుట 68
30. ఈనాడు దినపత్రిక : డిసెంబర్ 18,1981. రంగనాయక లేఖ, పుట 3
31. చలంగారి స్త్రీ, 1925 ముద్రణ. మ్యారేజ్ అండ్ మార 1929.
32. చలం ఆత్మకథ, బాటమ్ బుక్స్ ముద్రణ, 1969, పుట 1
33. సృజన: చలంతో ఇంటర్వ్యూ, చలసాని ప్రసాద్, పుట
34. సృజన : చలసాని ప్రసాద్, చలం ఇంటర్వ్యూ, 19 జూన్, పుట 60
35. సృజన : చలంతో ఇంటర్వ్యూ, 1979 జూన్, పుట 61
36. చలం మ్యూజింగ్స్, పుట 41
37. చలం ప్రేమ లేఖలు, పుట 94
38. చలం ప్రేమ లేఖలు, పుట 107
39. చలం జీవితం–సాహిత్యం, గొర్రెపాటి వెంకటసుబ్బయ పుట 491
40. చుక్కమ్మ కథల సంపుటిలో తాను యేయే పాశ్చాత్య యిశల ప్రభావంతో యేయే కథలు వ్రాశాడో స్వయం చలం తెలిపాడు. ప్రచురణ కర్తలు చాలా కథలను ఆ వాదకథలుగా ప్రచురించారు. ఈ సంపుటిలోని కథ ఏది అనువాదమో. ఏది ప్రభావంతో వ్రాశాడో పరిశో చాలి.
41. చుక్కమ్మ కథల సంపుటి, పుట 56
42. చలం – చుక్కమ్మ, పుట 85
43. చలం – చుక్కమ్మ, పుట 96
44. చలం – చుక్కమ్మ, పుట 104



# సంభవామి ...

నిశ్శబ్దం సముద్రమైనా
కాలసర్పమై బుసకొడుతున్నా
నల్లని చీకట్లో
జివ్వుమనిపించే చలిలో
చివుక్కుమంటూ విషపు చుక్కలు ఆకాశం నుంచి
రాలిపడుతున్నా
ఏ మాత్రం కొరుకుడు పడని ఎముకలగుండెల్లోకే
దూసుకొని పోతున్నా
ఆ వేగుచుక్క పొడుస్తుంది !
నా కోడి కూత వేస్తుంది !!
చర్చిలో గంటలా
మసీదులో నమాజులా
గుళ్ళో మేలు కొలుపులా
నా గూటిలో రెక్కల విదిలింపులా.

నేను తప్పక నిద్రలేస్తాను!
సూర్యుళ్ళ నెందరినో లేపుతాను !!

# "స్త్రీ"

"స్త్రీ"లో ఎన్ని వంకరలున్నాయో
స్త్రీలో కూడ అన్నే ఉన్నాయని గేలిచేసే నేను
"స్త్రీ"లో ఒక జ్యోతికూడ ఉంటుందని
స్త్రీ లేకపోతే జీవితమంతా చీకట్ల మయమని
నాకంటూ ఒక స్త్రీ వచ్చాకే తెలుసుకొన్నాను !
నాదంటూ ఒక మనసుఇచ్చుకొన్నాకే తెలుసుకో
గలిగాను !

డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు



డాక్టర్ బి. ఆర్. కె. రావు

# సైమన్ న్యూకాంబ్ ఆర్థిక ఆలోచన

సైమన్ న్యూకాంబ్ 1835లో జన్మించాడు. ఖగోళశాస్త్రజ్ఞుడుగాను, శాస్త్రవేత్తగాను అందరికి తెలిసిన వ్యక్తి. ఆర్థిక విషయాల్లో అభిరుచికల్గి ఆ విషయాలమీద "ప్రిన్సిపుల్స్" అనే గ్రంథం వ్రాసాడు. అతని ఆర్థిక ఆలోచనలో స్పష్టత, ఖచ్చితమైన వివరణ కన్పిస్తున్నవి. 'అప్పుగా ఇవ్వదగ్గ నిధుల' ను ఆధారాగా తీసుకుని వ్రాసిన వడ్డీరేటు సిద్ధాంతము, వినిమయ సమీకరణము న్యూకాంబ్‌కు ప్రఖ్యాతి తెచ్చినవి.

అప్పుగా ఇవ్వదగ్గ నిధుల సిద్ధాంతము చాలకొత్త విషయాలను అర్థశాస్త్రంలోకి తెచ్చింది. ద్రవ్య అర్థశాస్త్రంలో విశ్లేషణను పెంచడానికి ఈ నూతన విషయాలు తోడ్పడినవి. అప్పు ఇవ్వదగ్గ నిధులకున్న డిమాండు, ఆ నిధుల సప్లయి వడ్డీరేటును నిర్ణయిస్తున్నవి. ద్రవ్యవిలువలో వచ్చే మార్పు ఆ నిధులకున్న డిమాండ్‌ను, వాటి సప్లయిని మార్చ గలవు. ఈ మార్పును, న్యూకాంబ్, ఋణదాతలు, ఋణగ్రహీతల దృక్కోణం నుండి విశ్లేషించాడు. బ్యాంకు నోటులను, నాణాలను మన దగ్గరే ఉంచుకుంటే వాటికి రావడానికి వీలున్న వడ్డీ రాకుండా పోతుంది. వడ్డీరేటు, పెట్టుబడిదారుని సగటు జీవితంలో పెట్టుబడిచేసే అసలుకు సమానమైన లాభపురేటు కంటె క్రిందికి పడదు.

ఇతని వినిమయ సమీకరణము 'సామాజిక ప్రవాహము' భావననుండి ఏర్పాటు చేయబడింది. ఒక సంఘంలో జరిగిన వినిమయాల మొత్తము సామాజిక ప్రవాహమౌతుంది. 'నిధి'కి 'ప్రవాహాని'కి వ్యత్యాసం ఉన్నది. ఈ వ్యత్యాసం తరువాత వచ్చిన ఆర్థిక విశ్లేషణలో ప్రాముఖ్యతగల పాత్రను నిర్వహించింది. నిధి ప్రవాహం కూడా సామాజిక ప్రవాహంలో భాగాలే. రెండు రకాల ప్రవాహాలున్నవి: (1) కరెన్సీ ప్రవాహము (2) వస్తు ప్రవాహము. మొదటిదాన్ని ద్రవ్య ప్రవాహమని, రెండవదాన్ని పారిశ్రామిక ప్రవాహమని చెప్పవచ్చు.

ఈ రెండు భావనలనుండి న్యూకాంబ్ తన వినిమయ సమీకరణాన్ని ఈ విధంగా వ్రాసాడు: $VR=KP$; $V=$ వాల్యూం ఆఫ్ కరెన్సీ లేక కరెన్సీ మొత్తము; $R=$ ఏవరేజ్ రేపిడిటి లేక సగటు వేగము; $K=$ టోటల్ ట్రాన్సాక్షన్స్ లేక మొత్తం వ్యాపార వ్యవహారాలు; $P=$ ప్రయిస్ లేక మూల్యము (ధర).

తరువాత ఈ సమీకరణానికి డిమాండ్, ఆదాయాలతో సంబంధం కలిపాడు. విపణివీని డిమాండ్‌కు, వాస్తవ డిమాండ్‌కు తేడా ఉన్నదన్నాడు. ఒక ప్రత్యేక ద్రవ్యరూప ధరకు సంవత్సరంలో సమాజం కొనుగోలు చేస్తుందని ఊహించిన మొత్తము విపణివీని డిమాండ్ అని, సమాజం వాస్తవంగా కొనుగోలు చేసినట్టి, చేయనున్నట్టి మొత్తము వాస్తవ డిమాండ్ అని తేడా చూపించాడు.

వ్యక్తి ఆదాయము వినియోగం మీదగాని, మూలధనంగా పెట్టుబడి చేయడానికిగాని ఖర్చు చేయబడుతుంది. లేదా చెలామణీలోకిపోని ఋణధనంగా డిపాజిట్ చేయబడుతుంది. అందువల్ల దాచిపెటిన (గుప్తపరిచిన) ధనంతో సమానమౌతుంది. గుప్తధనంవల్ల, స్వల్ప కాలీన వ్యవధిలో, నిరుద్యోగము, ధరల పతనము సంభవిస్తాయి. ధరలను గనుక సరళంగా ఉంచినట్లయితే డిమాండ్ మొత్తంలోను, సప్లయి మొత్తంలోను, కరెన్సీ ప్రవాహంద్వారా సర్దుబాట్లు తేవచ్చు.

న్యూకాంబ్ ఆలోచనలో ద్రవ్యరాశి, దాని ప్రవాహము, వ్యాపార వ్యవహారాలు, ధరలు, డిమాండ్, సప్లయి ఋణమివ్వదగ్గ నిధులకు వెనుక ఉండి చెప్పదగ్గ పాత్రను నిర్వహించినవి. వినిమయ సమీకరణంద్వారా అధునిక స్థూల ఆర్థిక విశ్లేషణకు, ద్రవ్య విశ్లేషణకు న్యూకాంబ్ పునాదులు వేసాడు. కీన్స్ ఈ ప్రాముఖ్యతను గుర్తించి న్యూకాంబ్ వ్రాసిన ప్రిన్సిపుల్స్‌ను "ఎక్కువ సనాతన విషయాలను చదివి తప్పు త్రోవను పట్టని వ్యక్తి, అప్పుడే విద్యాలయంనుండి బయటకు వచ్చిన తాజా శాస్త్రీయ మేధస్సు, అర్థస్వరూపం ఏర్పడిన ఆర్థిక శాస్త్రంలో అప్పుడప్పుడు వ్రాసే గ్రంథము" అని చెప్పాడు. సనాతన గ్రంథాల ప్రభావం ఇతని మీద లేదు. సాంఘిక శాస్త్రాలను శాస్త్రీయ పైఖరితో అధ్యయనం చేసాడు. ఇతనిది అధునిక మనస్తత్వము.

# నా దేశం

## శ్రీ చల్లా రాధాకృష్ణ శర్మ

నా పవిత్ర దేశం
పెట్టింది పేరు
భగీరథ ప్రయత్నానికి.
కాని లాభం ?
దాహం తీరక
మాడిపోతున్నది మాగాణి
గొంతు తడవక
అలమటిస్తున్నది ప్రాణి.

నా పవిత్ర దేశం
పెట్టింది పేరు
వాల్మీకి ప్రతిభకు
కాని లాభం ?
ఇంకా ఎందరికో
అక్షరజ్ఞానం కొండమీది కోతి
చదువునే సంశయిస్తున్నారు కొందరు
ధనాని కది దాసోహమ్మనడం చూసి.

నా పవిత్ర దేశం
పెట్టింది పేరు
ధన్వంతరీ ప్రజ్ఞకు
కాని లాభం ?
మందులు కొనలేరు
మంద భాగ్యులు కొందరు
మందుకైనా మందులు కనలేరు
మంద భాగ్యులు ఎందరో.

నా పవిత్ర దేశం
పెట్టింది పేరు
శంకరాద్వైతానికి
కాని లాభం ?
భేదాలు నానాటికీ
కొండలై పెరిగి పోతున్నాయి
ఆచరణ రహిత మవుతున్నది
ఆధ్యాత్మిక చింతన.

నా పవిత్ర దేశం
పెట్టింది పేరు
బుద్ధుని అహింసా తత్త్వానికి
కాని లాభం ?
రకరకాల రూపాలు ఎత్తి
హింసిస్తోంది ప్రజను హింస
సహనం శాంతం కారుణ్యం
నల్లపూస లవుతున్నాయి.

నా పవిత్ర దేశం
పెట్టింది పేరు
ఇంకా మరెన్నిటికో
కాని లాభం ?
మామూలు మనిషిని
పాపగ్రహాలు బాధిస్తున్నాయి
గతకాలం మేలని
వినిపిస్తున్నది అపశ్రుతి !



# నే నెవర్ని??

## శ్రీ రామగిరి శివకుమార శర్మ

మహాభారతం నుండీ
మరో మహాప్రస్థానం వరకూ
పొంగుతున్న హృదయం కలవాణ్ణి.

మేఘావృత ఆకాశం
చెలి పైటలా ఉన్నదన్నా,
అప్పిగాడి ఎద "ఎక్స్‌రే ఫోటో"లా ఉన్నదన్నా,
పులకరింతల ముళ్ళు
జలదరింపుల పళ్ళు గుచ్చుకుంటాయి.
కళ్ళల్లో తిరుగుతాయి
వెచ్చని నీళ్ళ సుళ్ళు.

"నవ వికచ కుసుమ సుకుమార కోరక నికర భరిత" అంటూ
సమాసాల మసాలాలు పోసినా,
వాడి సెకను ముల్లులా కాలపుపదాల్ని 'కట్'చేసే
"పర్ అభి" అన్నా అభిమానమే.

భూమధ్య రేఖకు అడ్డుగా గీచిన మరో భూమధ్య రేఖను.

***

# మినీ కవిత

## శ్రీ కే. కిశోరుబాబు     శ్రీ కే. అశోకుబాబు

రూపం
గోచి ధరించిన వేమన యోగిలా తిన్నన!
గురుజాడలా బక్క పలచన!
శ్రీశ్రీలా కుఱుచన!

ఓజస్సు
తేజస్సు మాత్రం
కందుకూరి కలంలా నిశితం!
గిడుగు గుండెలా దిట్టం!

శ్రీ వేగుంట మోహన ప్రసాద్

# బతికిన క్షణాలు

భద్రాచలం వెళ్ళాలని రైలెక్కితే టికెట్ ప్రకారమైతే వెళ్ళలేం. సీతమ్మ వారున్న పర్ణశాల చేరుకోలేం. ఎండిన గోదావరి పక్క బెముకల పక్క పడుకోలేం. భద్రాచలం 'రోడ్'కి కొయ్యాల్సిందే టికెట్.

దుర్గాపురం రోడ్ అని తెల్లాతెల్లారి ఎంతగా అరిచినా మన కేవన్నా తెలిసేడుస్తుందా?

'ట్రూ ప్లేసెస్ నెవర్ ఆర్' అన్లేదా మెల్విల్?

మాల్గుడీ మైసూరు కెంత దూరంలో ఉన్నదీ మైసూరు స్టేషన్ మాష్టారికే తెలీదుగా. జీవితపు రైళ్ళ స్టేషన్ పంతుళ్ళ మాటెప్పుడూ వినవు.

పక్క స్టేషన్ నుంచి మోగుతుంది పెట్టె టెలిఫోన్ కడుపులో గంట కొడ్తూ.

వట్లూరు స్టేషన్ మాష్టారు పవర్ పేట స్టేషన్ మాష్టారితో అంటాడూ— "వొస్తున్నాన్రా దొంగ...." అనుకొంటూ "ఆ ఏవి ట్సార్ బండీ వొదిలేరా అలాగే" అని నూజివీడుని తిట్టాడు — "చంపుకు తింటున్నావురా దొంగ...." అని రిసీవర్ పెట్టేస్తా.

అలాగే ఉత్తరాలు రాస్తారు. కేబిల్స్ ఇస్తారు విదేశాంధ్రి డా. జి. కె. లండన్ నించి నాలుగు పౌండ్లు ఖర్చు పెట్టి. ఫ్రాన్సిస్ థాంప్సన్ బొందెలో ఊపిరి బొమికల్లో భాస్వరం ఏమైనా కొంచెమైనా ఉందేమోనని చూస్తారు. ఇన్ని చేసినా మనం మన నిద్రలోకీ అవజ్ఞలోకీ జారుకుపోతాం.

కొండ నిద్రపోతున్నపుడు తొలిచారు మన శిల్పులు మొగ ల్రాజపురం గుహల్ని. సముద్రం నిద్రలో ఉన్నపుడు గెల్చాడు ఆహబ్ తనకు తాను.

ఎండలో ఊది అడవుల బాట చెవుల సీసల్ని గెంతి భద్రాచల రావుణ్ణి చూచుకొని ఆలయ ప్రాంగణంలో ఉన్న నెలకు మూడొందల రూపాయిల ఉద్యోగం చేసే ద్వారపాలికను డి సై ఎస్ పి రామచంద్రయ్య, లాయర్ నారాయణల్తో దర్శించుకుని

విషాద వ్యామోహం
భ్రాంతిమయత
కల్లోల దార్శనిక స్థితి
గాజు కెరటాల వెన్నెల గోదారి ఎండిన ఎముకలు
వైక్లబ్యంలోకి ప్రాకిపోయే ఉత్తేజం
అంతర్ముఖీనత
రహస్య వాదం
సాంకేతిక ధ్వని వాదం
విషాద గాంభీర్యం
మధ్యాహ్నపు టిసుకలో మెరసిన పలినాశ్రి బిందువు

దర్శించుకొని పర్ణశాలలో ఉన్న దీర్ఘవృక్షం మర్రిచెట్టు గీతల నీడల్లో కాళ్లూ చేతులూ బార్లాజాపి కళ్లు నిద్రించి గోదారి ఇసుక పొరలమీద గవ్వల్ని ఏరుకొని

చీకటడే సమయానికి ఆకాశానికి భయపడి గోదారిని సెల వడిగి సిమెంట్ రోడ్డుమ్మట మళ్ళీ జీపేసుకొని దారిలో ఎవరో సీట్ల పేకాడుతూండే వాళ్ళ మీద దాక్షిణ్యంచేసి బస్సొకటి దారి దొర్చున్న జనాన్ని మోసుకెళ్తూండే దాన్ని పట్టుకొని సాక్షి సంతకం చేయనని మొరాయించిన వాడ్ని మొలతాడుచ్చుకుని కొత్తగూడెం లాక్కెళ్ళి

బహిరంగ ప్రదేశంలో మూత్ర విసర్జన చేసిన-దుకుగాను వాడి మీద కేసు పెట్టినా

కాడ
అట్లాంటిక్ మహాసముద్రం ఉదేమిటని అడగదు,
భద్రాద్రి రాముడు ఏ తానీషాకూ కలలో కన్పించడు,
అధికార తృప్తులమై కొత్తగూడెం చేరుకొంటాం.
ఈ దేశమే ఒక బహిరంగ స్థలం
ప్రతి వాడూ అంతర్యుద్ధంలో మూత్ర విసర్జన చేస్తున్నాడు.

*   *   *   *

విమెన్ ఎట్ వార్ సినిమా. ఒకే సమయంలో ఎన్నో ఎన్నెన్నో అన్నీ అన్నన్నీ జరుగుతూంటాయి.

ఒక వేపున హిట్లర్ గెలుస్తుంటాడు. అయినా వాడి మీసాలు కుంచించుకు పోతాయి.

మరో వేపున కాతరీనా బాహు మూలాల్లో రోమాలు సుదీర్ఘమవుతూంటాయి.

రష్యన్లు గెలుస్తారేమోననే ఆశా పుట్టుకొస్తుంది ప్రసవ వేదనతో. ప్రేగ్‌లో ఉండటం, మూడుపందల ఏళ్ళ ఆస్ట్రియా పరిపాలన తర్వాత మళ్ళీ ప్రేగ్‌లోనే ఉండటం చెక్ భాష నేర్చుకొంటున్నంత కష్టం.

"డాక్టర్ సెల్‌మన్! నీ కూతుర్ని దొరికిన పాళంగా కాల్చేయమంటావా చెప్పు."

పాపం తండ్రి కళ్ళఅద్దాలమీద ప్రాకుతుంది కన్నీటి క్రీనీడ.

"హోటల్ పారిస్, రూం నంబర్ 402. వస్తావా రావా?"

రావా?

"ఒక గంటైనాక ఉంకో షాంపేన్ తెచ్చిపెట్టు."

షాంపేనూ పగిలింది తలా పగిలింది.

పావెల్‌కివేసిన పదేళ్ళశిక్ష అపుడే పడింది. ఒకే సమయంలో ఎన్నో ఎన్నో ఎన్నెన్నో అన్నన్నీ జరుగుతూన్నట్లు.

'నీకోసం కమ్యూనిస్టు మానిఫెస్టో చదువుతున్నాను. నీకోసమని ముగ్గురు శిశువుల్ని తొడల సందుల్లో నొక్కి చంపాను. నీకోసమని నేను జర్మన్‌నని చెప్పుకున్నాను. నీకోసమని మనిషినని.'

అన్నీ బద్దలయిన ఒకే క్షణంలో నావీపు వెనక అయిలాలా అయిలాలా సంగీతం - చర్చిలో గంటలు - వెన్నెముక విరిగిన కన్వెన్షన్. సాఫీగా నుంచుంటేగాని పొట్టదిగని విస్కీ-కూర్చుంటేగాని రాని ఒంటేలు - కరుణగా ఒక్కొక్క బొట్టూ వీణ గోటినుంచి రాలుతూ. నుదురంతా స్వేదం - చెప్పు చెప్పు తొందరగా - కాలపు ఇసిక కారిపోతూంది - ఆ అమ్మాయి నరాల్లోకి నరాన్నించి నరంలోకి నరనరాల్లోకి నాళీనాళ్లోకి - నీకోసం కమ్యూనిస్టు మానిఫెస్టో కంఠతా పెట్టిన అమ్మాయి తొడల మూడు శిశువుల చచ్చిన లుంగ చుట్టిన ప్రేగుల్లోకి కాలపు ఇసిక కారిపోతూంది - చెప్పు తొరగా - షాంపేన్ సీసా నీ తలమీద పగిలే లోగా -

శుక్రారంనాడు ఆపెరా. అందాకా ఉంటి ఆ సంగీతం మాష్టరుతో - హోటల్ పారిస్ రూం నంబర్ 402 కిరా. వచ్చేసేయ్ వేగిరం - నీ కోసం - ఆపెరా అయిపోయినాక వొచ్చే నీకోసం ఓ షాంపేన్ సీసా అదనంగా అందంగా బుట్టలో అట్టేపెట్టి ఉంచుతా.

పిచ్చికవి నెర్వా గాడినెవరూ దయతలచొద్దు. వాడిపనల్లా క్రిస్‌మస్ నాడు చాపకడుపు చీల్చి చీలికలో కాఫీ కప్పు పెట్టి ఉడికించి మనందరికీ ఒడ్డిస్తాడు. ఉల్లాయి పదాలు పాడ్తాడు ముఖ్యంగా

కాతరీనా కోసం.
పావెల్ ఏడుపూ అదే
ప్రపంచం ఏడుపూ అదే
విదూషకుడి ఏడుపూ అదే
ప్రపంచమంతా ప్రపంచాన్ని ద్వేషిస్తుంది.

నాసూది మొన చేతికర్రతో నేనుమాత్రం ప్రపంచపటంమీద అన్ని దేశాల నగ్న వక్షస్థలాల మీద పొడిచిపొడిచి వరి ప్రేమిస్తాను. ఒక్కొక్క దేశం ఒక్కొక్క కుమ్మటానికి వచ్చే రొమ్ము.

నా వీపు వెనక పియానో మెట్ల మీద హిట్లర్.
చెక్ కొలాబరేటర్స్
జర్మన్ నాన్ కొలాబరేటర్స్
చెక్ నాన్ కొలాబరేటర్స్
జర్మన్ కొలాబరేటర్స్

నా తొడల్లో శిశు హత్యలు. నా నాభిముందు ఆఫీసర్స్ బోర్డెల్. నా పాదాలముందు ప్రొ. డా. సెల్మన్ కళ్ళజోడు కన్నీళ్ళు. నా పిరుదుల వెనుక జఘనాలు. నా చావు కావల మృత్యువు.

అసే వొస్తావా రావా 402 కి?
నీ అక్కకి ఫాక్టరీ రాసేసాను.
నాసది విడాకులిచ్చేస్తుంది.
అన్నీ పోయిన చెక్ గాడికి ఫాక్టరీ ఏంజేసుకోను?
వొచ్చేసేయ్ అసే రావా 402 కి?
నా మృత్యువు షాంపేన్ బుడ్డీలో.

నెర్వాగాడు విషామూషక గీతాలు పాడుకుంటూనే ఉంటాడు, వాడి బ్రెసెస్ ఊడిపోతాయ్. వాని పాడె పట్టీలు తెగిపోతాయ్. దృష్టి ఉన్న వాళ్ళెవరూ పట్టించుకో గూడదు. రొమ్ముల గుండీబాడదీసే దమ్ములు వాడికెటూ లేవు. అందుకే వాడి కళ్ల నీరు గారి పోయి గుండీబాడి పోయి ఒకే క్షణంలో

కాతరీనా బాహు మూలాల్లో రోమాలు రాలిపోయి ఎన్నో!

* * * *

అక్షర జ్ఞానం లేకపోతే ఎంత బావుండును ఆ అమెరికన్ హర్మణీపెట్టి జాన్ ఎఫ్ కెనడి ఎర్‌పోర్ట్‌లోని కంప్యూటర్‌లా!

ప్రాత బలిగోపతుందీ అక్షరం అక్షయమవుతుందీ. కారమ్స్‌బోర్డ్‌ని 'సి ఎ ఆర్ ఒ ఎమ్ ఎస్' అని రాస్తుంది పాపం మన ఆంగ్లేయ హార్మోణీపెట్టి. కాని ఆ ఇనాక్యురస్ అమెరికన్ కంప్యూటర్ 'కె ఏ ఆర్ ఒ ఎమ్ ఎస్' అని గోలపెట్టి "నాయనా నీకారమ్స్ బోర్డ్ నా శబ్దరత్నాకరంలోగాని పదబంధ పారిజాతంలోగాని లోతుగా ఎంత వెయ్యిపెట్టి వెతికినాగాని దొరకటం లేదు ఏం చేసుంటావ్ నా బుర్రలోనాటిన తంనీలాల తలపోతల బీజాంకురాలు నీ చావు నీవే చావు నా చావు నేనే చస్తా నస్తమానం నువు తెల్లారేప్పటికి అవసరమయ్యే నేనిచ్చిన బహుమతి పెట్టిలోంచి పళ్ళు కడుక్కొని గడ్డంగీసుకుని సెంట్‌లూయీస్‌లో నేనిచ్చిన పెర్‌ఫ్యూమ్ రాసుకుని నీ అరవై రూపాయిలకీ నేనిచ్చిన నాలుగైన అరవైడాలర్లు కట్టీ సార్కో విస్కీ ఎక్కి బియాంకాకో డాలరు టిప్పిచ్చి అందులో మళ్ళీ ఓ అరడాలర్ అప్పుచేసుకుని హాయిగా నిచ్చెన్ల ఉయ్యాలలూగు" అని తప్పు ఒప్పేసుకుంది కాదా! మరీ దరిద్రపు శబ్ద దారిద్ర్యపు తెలుగు దేశంలో ఎవరెందుకు కంప్యూటర్లుకారో ఒక్క 'త్రిపుర'కే తెలుస్తుంది. శ్రీశ్రీ కీ తెలుసుగాని తెలియ జెప్పడు.

వచనంలోని ఎక్స్పాండెడ్ రియాలిటీని చూపించాలంటే రంగుల్ని పేప్సునీ, సైజెస్‌నీ, టెక్చర్‌నీ స్పేషియో టెంపోరల్ యాక్సిస్‌లో పిన్నుల్ని గుచ్చు కుంటూ పోవాలి. యుద్ధరంగపు ఆపరేషనల్ మాప్‌లా లొకేషన్స్‌ని గుచ్చుకుంటూ పోవాలి. సినిమాల్ని తీసేప్పుడు ఊటీలో ముఖ్యంగా ఆ పిచ్చిపిల్లల పేర్లమని కిళ్ళీ వేసుకున్న నోళ్ళల్లో పాటల్ని గుచ్చుతున్నప్పుడు బాగా లెగరేసుకు తిరుగుతూ గెంతుతూ క్లోజప్, లాంగ్ షాట్స్‌లో గుచ్చుతున్నపుడు అంచులు, ఆకాశాంచలాల అంచులు అందుతాయి. (వింటున్నారా త్రిపురగారూ మెదడులో రెండు కుమ్మరి పురుగులున్న నన్ను ?)

(తెలుగులో) అంచులు

అంచు అంచెలుగా అంచులు

మంచెలమీద అంచులంచులుగా మంచెలు

దుఃఖాల మంచెలమీద అంచులంచులుగా అంగాలు

అంగాలలో అంగాల మలినాంగాలు

(ఆంగ్లంలో) అంచులు

"ఐ స్ట్రిపెడ్ అపాన్ అ లోన్సమ్ ప్లేస్" (స్టీఫెన్ క్రేన్)

"అబౌవ్ ద స్యూ హెమ్స్ ఆఫ్ ది సీ" (హార్ట్ క్రేన్)

"ఐ స్టాప్ట్ అపాన్ అ లోన్సమ్ స్టేషన్" (స్టీఫెన్ క్రేన్)

"స్టిల్ హియర్ క్రైయింగ్ బినీత్ ద రూఫ్"
(ఆర్చిబాల్డ్ మక్లీష్)

"అబౌవ్ ద హ్యూమిడ్ హెమ్స్ ఆఫ్ ది సర్ఫ్"
(హార్ట్ క్రేన్)

కరణానికి కంప్యూటర్‌కి వ్యాకరణం అడ్డేమిటి? చూడు చూడు నీడలు కంప్యూటర్ పదాల జాడలు!

మళ్ళీ అంటుంది హార్ట్ క్రేన్, "అబౌవ్ ది ఫ్రెష్ రఫుల్స్ ఆఫ్ ది సర్ఫ్" అని. -

నేనూ అంటాను పుదుచ్చేరి ఒడ్డాబింకో అరేబియా సముద్రంలో ఆయారంగుల అమ్మాయిలో కాచునో నుంచునో వొంగునో భీష్మి వెండి ఇసుక తడి లాక్షారుణ పాదాల సునువెచ్చని సూర్య స్నాత చుంబనాంచలాల్లోంచో -

మళ్ళీ (తెలుగులో) అంచులు!

"నిష్క్రవేశించాను నేను నిర్జన నిరానంద నిరామయ కటి ప్రదేశంలో" (స్టీఫెన్ క్రేన్)

"కొత్త చీర చెరగుల వినూత్న సముద్రాంచలాంచలాల"
(హార్ట్ క్రేన్)

"దిగడిపోయాను దిక్కుమాలిన విధి ధూమ శకట క్రాంతి స్థానాన" (స్టీఫెన్ క్రేన్)

"ఇంకా ఇక్కడే పగాలుబడి దిగాలుబడిన కప్పుకింద కన్నెప్పలు కప్పడి" (ఆర్చిబాల్డ్ మక్లీష్)

"ఎక్కబోస్తోన్న కవోష్ణ సముద్రోష్ణంచో పసితలాల"
(హార్ట్ క్రేన్)

నా తలనీలాల కంప్యూటర్ కవిత్వోపరిరంభాల దిమ్మాసీ సూది మొనల నిలిచిన శూన్యాక్షరాన నిలిచిన సిద్ధాక్షర సిలబిల్‌లో బతుకు వెత కార్చిన నెత్తురు పన్నీటి మార్ఫిమ్ పిదిల్చిన వీర్యంలో కొన్ని కోట్ల క్రోమోజోమ్స్‌లో

ఇలాంటి జీవన భయానంద అక్షరం
అక్షరం అమీబా, ఏకకణజీవి అయినా నగ్న నీశ్వరా
అయినా స్మైల్ నువు సంతకం చేసిన
వేళ్ళల్లోంచి తొలగిన జారిన చిర్నగవు

"అండ్ ఫ్రమ్ ది సీక్రెట్ స్పేస్ ఆఫ్ ది సిగ్నేచర్
ది స్మైల్ స్ప్రాంగ్ అప్ ట్రాన్స్‌లేటింగ్ టు ది స్టాంప్
త్రీఫాయింటెడ్ సైన్ ఆఫ్ స్పార్క్ అండ్ ఫైర్"
(డైలాన్ తామస్)

అవునా 'అజంతా'గారూ
అక్షరానికి క్షయ వ్యాధి
'జానా మీరా ఖాన్‌గారూ'
మీరా వేట్టకి
త్రికాలాలా మూడువేళ్ళ త్రిశూలంలోంచి
అజంతాగారి 'క్షుద్ర సంధ్య'న
సంధ్య వారుస్తోంటారు
మోహన ప్రసాదొచ్చి
పిస్కీ ఉడికిందా అనడుగుతోంటారు.

నాన్నా మామయ్య మహానుభావుడు
నను కన్న నాన్న
నను పెంచిన మామయ్య
మహానుభావుడు పోతన మామయ్య
నను కడుపులో పెట్టుకు పెంచిన
పోతన మామయ్య మహానుభావుడు
నన్నిలా గొప్పకోసం కీర్తికోసం నువు పల్లకీలో
మోసుకొచ్చిన వజ్రాలహారం కోసం నీ మదకరేంద్రములకోసం
నన్నిలా వలువపెట్టి లాక్కెళ్ళొద్దు నాన్నా
నా స్నేహప్రియుడు కౌమార హాలికుడు తన నాగళ్ళను విచిత్రాతి విచిత్రంగ ఫారిన్ కరెన్సీమీద పహా తొందరగా దొరికే డాలర్ల ఫోర్డ్ ట్రాక్టరులా మన్నించగలడు నీ పల్లకీ అదేనా నాన్నా నను అంపించాల్సిన

శక్ర చాప మధువక్రరేఖ పల్లకీ
ఓహోం ఓహోం బోయీల పల్లకీ అగిపోయినపుడు గాలిలో తేలి పోయినపుడు తన నాగళ్ళను గాలితొందర పెట్టినట్లు వేగిరపెట్టినట్లు
కర్షక కవి అవుతాడు నాన్నా
కృషీవలుడవుతాడు నాన్నా
ఒద్దు నాన్నా నువు తెచ్చిన పట్టుపంచెలు పళ్ళే పల్లకీమీద తిరిగి మోయు భారంతో తీసికెళ్లాల్సి ఒచ్చినపుడు
నా కడుపులో ఏదో దేవుతుంది నాన్నా
నగుమోము నాగయ్యలో
ఈ ప్రపంచం ఈ సంచలనచిత్రాలూ చచ్చిపోతే ఎంత బావుండును!

కడుపులో శ్వాసకోశాల్లో హృదయంలో ఏదో దేవినట్లవటం ఎవరు ఏ డాక్టరుగారు చెప్తారు నాకు డా. మధుసూదనరావుగారు తప్పితే

నాడీమండలంలో ఏ జ్యోతిషరేఖ దొరుకుతుందో పాపం ప్రకృతి ఆశ్రమ డాక్టరు శర్మగారికి గోళ్ళల్లో ఏ అంతర్గోళాల వ్యాధి అదుల దృగ్గోచరమవుతాయోగాని వీళ్ళందరికీ జీవితంమీద ఇంత ప్రేమ బతకమని శాసించమని శ్వాసించమని ప్రేమమీద ఇంతప్రేమ శ్వాసించమని శపిస్తారు ప్రాణాలు తోడేస్తారుచూపుడు వేలు మీద ఓ చిన్న హత్య చేసే మూత్రం మచ్చుకో చుక్కని నాలుకమీద వేసుకొని రుచి రంగు వాసనా చూచి వ్యాధి గ్రస్థుడిలో ఏ పురాజన్మ వాసనలున్నాయోనని అనుమానించి అవమానించి కళ్ల ముక్కలు ముక్కలుగా కోసుకొని ఉల్లిపొర లాంటి అద్దంలోంచి వంద అంకెలదాకా ప్రపంచమంతా ప్రతిబింబితం చేసినా కూడా

నాన్నా మామయ్య మహానుభావుడు
రక్తంలో మూత్రంలో స్వేదంలో మలంలో
ఒక్క ప్రేమ తక్క ఏమీ లేనివాడు
ఊరికేనే ఏడుస్తాడు
ఆ కలనీ దాహమనీ ఆ మోహంలో
ఎప్పుడూ ఏమీ అనిపించదు
ఆ కళ్ళు ఈ నికృష్ట దారిద్ర్యాన్ని చూడవు
ఏ మహద్గోళాల వెల్తురులోని ఎటో
అదే చూపు అదే పోత ఆ కళ్ళు
ఆఖరి క్షణంలో నయినా రారా అని చూస్తోన్న చూపు
చీకట్లోంచి చిట్లినట్లున్న ఆ నయనాలు
ఎప్పుడూ ఆ పజం నేత్రాల దీపాల వెల్తుర్లో నేను నాన్నానన్నే ప్రేమలోంచి వెల్తురులోంచి కాంతిలోంచి దివ్వెలు వెలారిన ఆ దుఃఖ దురిత లోకాల్లోకి లాక్కెళ్ళొద్దు నాన్నా
నీ కాళ్ళకు మొక్కుతాను నాన్నా
నా కన్నీళ్ళు చూడు తండ్రీ

నీ దుఃఖం నాకు తెలుసు నీ దుఃఖం నీది లోకానిది కాదు సమస్త లోకాల్నీ ఆవాహన చేస్తున్నాడు మామయ్య పోతన మామయ్య కోసం దేవతలు వొచ్చి ఆత్మలో ఆకలిలేని బ్రాహ్మల కోసం మాలిన్యంలేని దేహాల్ని స్నానించి వొచ్చిన బ్రాహ్మలకోసం గుండిగలు కాగులు నిండా పాయసాలు పరవాన్నాల్లు వొండి ఒడ్డిస్తారు తాటాకు విసినకర్రలూ తెస్తారు. విద్యుత్పంకాలు తేలేరుగానీ నాన్నా కనపడని విమానాల్లో తలకిందులైన జలబిందువుల్లా వొస్తారు నాన్నా నామీద ఇంత ప్రేమ ఉండే వాళ్ళనీ ప్రకృతి ప్రేమనీ నేలతల్లి ఒడిలోని దయనీ నీ ఒక్క సీస పద్యంలోనయినా చూడలేవా నాన్నా.

కని పెంచిన ప్రేమ
కన్పించిన ప్రేమ
వెదుక్కున్న ప్రేమ
కాళ్ళకి చుట్టుకు పోయిన తీగ
పెంచుకున్న ఐవీ క్రీపర్

అంతా ఒకటే నాన్నా ఒకటే మమత నాన్నా ఎక్కడో ఎందుకో గాని పారేసుకున్న ఎవరికో ఎప్పుడో ఏ ఒకరికోగాని దొరకని మాధవీలత మాలతీ చంద్రికి నీ రాచ కవిత నీ శృంగార కవిత విన్పించకు

పల్లకీ గుచ్చకు
ఫర్మానా విప్పకు

నను అగరు దీప ధూప కాంతిలో చూస్తే నక్షత్రాలు మంచు కన్నీళ్లు కారుస్తయ్ నాముక్కోరమించి రాగజలధిలోకి రత్నాలయి.

ఇప్పటికే ఈ ప్రపంచం కన్నతల్లుల్లేని ప్రపంచం పెళ్ళి కాని తల్లుల వేశ్యల వీధి పాలకోసం ఏడుస్తోన్న ఫాక్టరీ గరం నీళ్ళ సమాధిలో మునిగి తేలిన నిష్కారణ నిర్మోహ శవం తకధిమి తకధిమి తోల్బొమ్మల కీలు విరిగిన దారం వేకువలోకి దూసు కొచ్చిన అమవస నిశి ఉవ్ క్లిటారిస్‌ని నముల్తోన్న కొండచిలువ సదా వెన్నెలవెల్లువల్లో అదే పనిగా తరుముతున్న. 302 బోర్‌గన్ క్రిమికీటకాల నాలుకల్లో పాచిని రూడనాకే లారీల ఫైనాన్సియర్ల ఐదురూపాయిల వొడ్డీల మంగళసూత్రాల ఇరవై సూత్రాలసంస్కృతి సారాకి నోరుతెరిచేఎన్నికలల స్టిక్కబించెలనిండా పంచదారలపరదాల విలువ ఎర్ర చొక్కాల ఎర్ర చీరల నప దార్లిని మరింత ఎరుపు చేసే రక్తదాహ రైఫిళ్ళ బాయొనెట్ల సామూహికహత్యాకాండ పోలియో పసిపిల్లల పక్షవాతాల్ని నరనరానా కోసివేసే పసిపువ్వులా మొగ్గ తొడిగిన అనేకానేక బాలికల నును స్వప్నలోకాల్ని పటాక్రుల దంతాల్తో కొరికేసే రౌడీ మూకల రాజ్యం కళ్ళవెల్తురు చూచే పెళ్ళాం, పిల్లల ముందు భాగల్పూర్ అంధ విభ్రాంతుల విచిర్మల విశ్చల చిత్రాల కసాయిశాల హాయిగా ఎగుర్తోన్న పక్షి రెక్కవి ఎఫ్ 16 తో కొట్టే క్రూర నైశిత్యం మృదు ధ్వని మధురలోకా ల్లోంచి వీస్తోన్నా కళ్ళ కిటికీల్ని ఓపి మని నుదురు చిప్పిల్లు మూసేసే శ్రవణ దారిద్ర్యం

నాన్నా మామయ్యా మహాను భావుడు
నను కన్న నాన్నా నను పెంచిన మామయ్యా
పోతన మామయ్యా మహాను భావుడు

ఒక చిర్నగవు కళిక ఈ తమస్సునంతా మాయగా లీలగా క్రీడగా గప్పున హారతి కర్పూరంలా వెలిగిస్తుంది అక్షరాక్షరానా తన తపస్సు నూనెని కాల్చుకుంటూ

ఇలా ఏడుపులోంచి కన్నీళ్ళలోకి
చూపుడు వేలులోంచి నెత్తురు చుక్కలోకి
ఎక్స్‌రే ఫొటోలో చిక్కుపోయిన ఎముకల్లోంచి
ఈ లోకపు అరక్త హృదయనాళాల్లోంచి
శ్వాసకోశాలు చీల్చుకొని అడుగుతున్నాను నాన్నా నాకీ

ప్రకృతే బావుంది సర్వప్రాణాల్ని కాపాడే ఈ నిసర్గ ప్రకృతే బావుంది నను లాక్కెళ్ళొద్దు నాన్నా పలుపుల్తో పల్లకీల్తో

ఈ ఆకాశమే బావురుమని ఏడుస్తోంది నాన్నా
నను కన్న ఓ నాన్నా నాన్నా నాన్నా
అమ్మ కోసమైనా నో నాన్నా!



# నేను

శబ్దాల గనులలో
తొంగి చూస్తుంటాను.

నిశ్శబ్దంలోంచి
లేచి వస్తుంటాను.

గుండె చప్పుళ్ళలో
పగిలి పోతుంటాను

అనంత సృష్టితో
పరుగు తీస్తుంటాను

దేశకాలాలను
దాటి పోతుంటాను

నాడు నాడులని
మీటి వస్తుంటాను

మలుగు తెరుగక
వెలిగి పోతుంటాను

వింత వ్యక్తిత్వాల ఐకమత్యాన్ని
పేరుకైతే నేను కవిత్వాన్ని !

# శోధనలు - సత్యాలు

గనులు దొలిస్తేగాని మణులు దొరకవు
శిలలు మలిస్తేగాని శిల్పాలవవు
వ్యధలు మథిస్తేగాని కథలు ఉదయించవు
మనసు తపిస్తేగాని కళలు చిగురించవు.

శ్రీమతి ఆదూరి సత్యవతీ దేవి

# స్నేహ సంగీతం

శ్రీ రామసూరి

ఎక్కడో ఏ కొండల్లోనో
కన్ను తెరిచి
చుక్కగా
ధారగా
ప్రవాహమై
అలా అలా సాగి సాగి
దూకి దూకి
చెలరేగుతూ
ఉయ్యాల లూగుతూ
మనిషి మేధస్సుతో
పాయలై
కాల్వలై
ఆవేశం సంయమనం చెంది
పొలాలని పలకరించి
స్నేహం చేసి
బీటలు వారిన ఎద ఎదలో
అనుబంధ ధారలై
నవ్వించి -
మట్టి గుండెల్లోంచి
ఆకుపచ్చని చైతన్యం ఆహ్వానించి -
మనిషి ఊహాలకి
తల వంచి
తల లూచి
'జల' లేచి
చల్లని గాలులై
తియ్యని దాహమై
ఆనంద ప్రవాహమై
కదిలే
నదులే
ఎదలో మెదిలే
స్నేహ సంగీతాలు
ప్రగతి సంకేతాలు !!!



# డిగ్రీలపై డిగ్రీలు

శ్రీ కొండపల్లి సుదర్శన రాజు

నా వయసు మూడు పదులు
నాకున్నాయి రెండు డిగ్రీలు

మొదటిది మాష్టరు.
రెండవది డాక్టరు.

మాష్టరుకు - ఆరేళ్ళు
డాక్టరుకు - రెండేళ్ళు.

ఇంకా నోటికందలేదు నాలుగువేళ్ళు
ఉద్యోగాన్వేషణలో పట్టేశాయి కీళ్ళు.

అనిపిస్తుంది జీవితం వ్యర్థమని
ఆశ ప్రోత్సహిస్తోంది జీవించమని

మనిషి విలువను డిగ్రీలు
చేస్తున్నాయా "డిగ్రేడు"?

నిరాశతో - నిస్పృహతో
గుండె స్పందన ఆగుతుందా !

ఆలోచనతో - ఆవేదనతో
మెదడు నరాలు చిట్లుతాయా !

శరీరంలో వేడి మాత్రం
పెరుగుతోంది ధర్మామీటరు దాటి
డిగ్రీలపై డిగ్రీలు.



# ఇది పద్యం

## శ్రీ వడలి మందేశ్వరరావు

ఇది పద్యం
శబ్దం మీద శబ్దాన్ని
శబ్దం ప్రక్క శబ్దాన్ని
దట్టించి
వెంట్రుక వాసి ఎడం లేక
నీరంధ్రంగా కూర్చింది !

ఇది పద్యం
బహుళార్థ విపులార్థ సాధకమే కాదు
అర్థాల అవధులు
మస్తిష్కపు టాస్తి నాస్తి వివేచన కందకపోగా
భగ్గున మండే అర్థ జ్వాలలో
పద్యం కరిగి రసధునిగా
పరవశిస్తుంది!

ఇది పద్యం
చూపుడు వ్రేలుతో
ఇలా, ఇలా అనదు
కాంతిచ్ఛటల్ని ప్రభవిస్తుంది !
మనో వల్మీకంలో
సుషుప్తి గొన్న చైతన్యం
సహస్ర ఫణియై
విన్గ్ర మించి
ఆత్మాభి ముఖంగా పరిక్రమిస్తుంది!

ఇది పద్యం
ఇది గద్యం

ఇది కవిత
పోరాటం కాదిది, ఆరాటం !
గతి నెరుగని సిరీక్షణ కాదిది
ఇది నిరంతర నిర్విరామ గవేషణ !

విన వచ్చేవి
చిరు మువ్వల శ్రుతి పేయమైన
గల గలలు కావు !
ఘన ఘనాంచలాల ఘర్షణలో
సూచీ నిర్భేద్యమైన తిమిరంలో
ఇరమ్మద మావిర్భవించగా
విన వచ్చిన ఘుర్ఘురధ్వను లివి!

ఇది పద్యం
భావుకుని కిది
పరమాణువు కా, దిది బ్రద్దలవడం ?
జడుని కిది
శిల్పావధికమైక హర్మ్యం కాదు
తన్నిర్మాణానికి తెచ్చిన
యేద్వనేరని శిలలు !

ఇది పద్యం
శబ్దం మీద శబ్దాన్ని
శబ్దం ప్రక్క శబ్దాన్ని
దట్టించి
వెంట్రుక వాసి ఎడం లేక
నీరంధ్రంగా కూర్చిన
పద్యమిది
ఇది పద్యం !

***

"చరిత్ర విద్యాధర" తురగా కృష్ణమూర్తి

# దాయగజకేసరి ఖండవల్లి శాసనము

ఇప్పటికి సుమారు పావు శతాబ్దికి పూర్వము నా మిత్రులు శ్రీ ఖండవల్లి సాంబశివరావు సోదరులు తమ గృహ నిర్మాణార్థము పునాదులు త్రవ్వించుచుండగా లభ్యమైన మూడు తామ్ర శాసనముల పరిశీలనార్థము స్నేహ ధర్మమున నాకొసంగిరి. వానిని నేను పరిశీలించు నిమిత్తం శాసన పాఠముల నిర్దుష్ట మొనర్చుకొని వరుస వెంబడిని ప్రచురించు యత్నములోనుండ, కొన్ని అనూహ్య పరిస్థితులవలన, ఆ మూడు శాసనములు వాల్తేరు ఆంధ్ర విశ్వవిద్యాలయాధికారుల అధీనములోనికిపోవుట సంభవించినది. అప్పటికే నేను ఒకేఒక రేకుగల *"కోనగణపతి శాసనము"ను 1959వ సం॥రం నవంబరు నెల "భారతి"లో ప్రచురించుట జరిగిపోయినది! అయిదు రేకులుగల ఈ "దాయగజకేసరి" శాసనముగూడ ప్రచురణకు సిద్ధమైయున్న కారణమున నద్దానిని నేను ప్రచురించుకొనుట కనుమతింపబడితిని. 7 రేకులుగల మూడవ శాసనమును ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు ప్రచురించు నిర్ణయముతోనది వారి కప్పగింపబడినది. తత్ప్రచురణ భారము కీ॥ శే॥ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి పాలబడినది; కాని-వారు శాసన ప్రచురణ చేయకముందే శివసాన్నిధ్యమునకరిగిరి. ఆ తర్వాత నా శాసన ప్రతిబింబములు ప్రభుత్వ పురావస్తుశాఖ, మైసూరు వారికి చేరినవి.

ప్రభుత్వ పురావస్తు శాఖలో పనిచేయుచున్న శ్రీ కె. వి. రమేష్, శ్రీ వి. ఎస్. సుబ్రహ్మణ్యం గారలా ప్రతి బింబముల సహాయమున "ఎపిగ్రాఫియా ఇండికా" (38 వ సంపుటము)లో "కాకతిరుద్రాంబ ఉత్తరేశ్వరపుర శాసనము"ని ప్రచురింపగా, ఆంధ్ర విశ్వవిద్యాలయ చారిత్రకోపన్యాసకులగు శ్రీ సోమసుందరరావు శ్రీమతి ప్రతిభ చిన్నప్పగారల సహాయమున 1976 జూన్ నెల "భారతి"లో "వీరరుద్రుని ఉత్తరేశ్వరపుర శాసన"మను పేరున ప్రచురించిరి. ఈ ప్రచురణకు కారణము తొలిప్రచురణలో కొన్ని తప్పులు దొరలినవని, వానిని సవరించుటకే ఈ ప్రచురణ జరిగినదని వారుద్ఘాటించిరి. అయితే-ఈ ప్రచురణలు రెండింటిలోను ఇంకను కొన్ని విషయములు వివాదాస్పదములుగ నుండుటచే, వానిని, వివరించుచు నేనొక వ్యాసమును ప్రచురింప నుద్యమించుచున్నాను.

ప్రస్తుత విషయమైన "దాయగజకేసరి" శాసనమును గూర్చి ప్రస్తావింతును.

ఇది అయిదు రేకులుకలిగి, రేకుల కిరుప్రక్కలను తెలుగు-కన్నడ లిపిలో, సంస్కృత భాషలో 147 పంక్తులుగా వ్రాయబడినది. దత్తగ్రామ సీమావర్ణనము దేశభాషలో చేయబడినది. ఒక్కొక్క రేకు పొడవు 26 సెం. మీ., వెడల్పు 15.6 సెం. మీ. దళసరి 0.6 సెం. మీ. కలిగి అంచులు కొంచెము ఎత్తుగా పైకి వంచబడినవి. ప్రతిరేకు 1.8 సెం. మీ. వ్యాసము గల రంధ్రము రేకు ఎడమ అంచునుండి 1.5 సెం. మీ. దూరమున తొలవబడి, అందుండి ఒక రాగి కడియము దూర్చబడినది. రాగి కడియము అంచులు రెండును కలిపి, అతికింపబడి, అందుపై గుండ్రని రాగి బిళ్ళ అతికింపబడినది. ఈ బిళ్ళ పైభాగమున చంద్ర, సూర్యులు ఆ దిగువను వరాహము, నంది, నిలువునవున్న ఖడ్గము ఉబ్బెత్తుగా పోతపోయబడియుండి, ఆ దిగువ సగభాగమున "దాయగజకేసరి" అను అక్షరములు పోతపోయబడి, రాజముద్రికగా నలరారుచున్నది. కడియము మందము 1.5 సెం. మీ., రాజముద్రిక వ్యాసము 8.3 సెం. మీ., దళసరి 6.8 సెం. మీ. ముద్రిక చుట్టు అంచు ఉబ్బెత్తుగా నుండి, గుండ్రని ముద్రికలోని చిహ్నములకు అక్షరములకు రక్షణగా నిలిచియున్నది. శాసనము బరువు రాజముద్రికతో గూడ 6.500 గ్రాములు.

---

* "కోనగణపతి శాసనము"ను "భారతి"లో ప్రచురించిన పిదప నీ "దాయగజకేసరి" శాసనమును "ఎపిగ్రాఫికా ఆంధ్రికా IV" లో ప్రచురించితిని. అయితే ఆ ప్రచురణ నాకు తృప్తికరణతోనుండుటచే శాసన విశేషములింకను విపులీకరించి, ప్రచురించు యుద్దేశ్యముతో నీ రచనకు పూనుకొంటిని. (తు॥ కృ॥)

ఈ శాసనము తక్కిన శాసనముల తీరునకు భిన్నముగా నుండి, ఒక విలక్షణమైన రీతిలో ప్రసాదింపబడినట్లు కానుపించు చున్నది. ఇందు రెండు శాసనములున్నవి. మొదటి శాసనము 1 నుండి 113 పంక్తులు రెండవ శాసనము 114 నుండి 147 పంక్తులు కలిగి యుండినది. ఈ సాంప్రదాయము సాధారణముగానే శాసనములలోను గానము. శాసన ప్రతిగృహీత ఒక్కరే అయినను శాసనదాతలు వేర్వేరుగా నున్నారు. మొదటి శాసనమిచ్చినది క్రీ॥ శ॥ 1289 వ సం॥రం. కాగా రెండవ శాసనకాలము క్రీ॥ శ॥ 1292 అయినది. 3 సంవత్సరముల కాల వ్యవధిలో వేర్వేరు వ్యక్తులచే నీయబడిన దానములనొకే శాసనములో నుట్టంకింపబడుట నిజముగా వింతగొల్పకమానదు. దానమిచ్చిన కాలమందే శాసనము వ్రాయుటాచారము. ఇందల్లుగాక వేర్వేరు కాలములందు వేర్వేరు వ్యక్తులచే నీయబడిన దానములొకే శాసనము నందుల్లేఖింపబడుటొక విశేషమేగాక, విలక్షణ లక్షణమును కలిగియున్నది.

మొదటి శాసనములో ఇందులూరి అన్నలదేవుడు (అన్నయ మంత్రి) విద్దనాచార్యునకు 50 ఖారీల పరిమితం గల "మర్పడిగ గ్రామము"ను విరోధినామ సంవత్సర ఫాల్గుణ బహుళ శుక్రవారం సూర్యగ్రహణ వేళ దాన మొసంగినట్లు తెలుపబడినది. ఇది ఇంగ్లీషు మానము ప్రకారం ది 10-9-1281 అగుచున్నది. ఆ గ్రామమును స్వీకరించిన విద్దనాచార్యుడు దానికి "వినాయకపురమ"ను నామకరణ మొనర్చి తనకు కొంత భాగము నుంచుకొని మిగిలిన దానిని బ్రాహ్మణులకు పంచి యిచ్చెను. శాసనములో కాకతి ప్రోలరాజు నుండి ప్రతాపరుద్ర చక్రవర్తి వరకు గల కాకతీయవంశ వర్ణన గావింపబడి, ప్రతాపరుద్రుని తన మాతామహి రుద్రమదేవివలన పొందిన "ఓరుగల్లు" సామ్రాజ్య పాలనాభారము వహించి, రాజ్యము చేయుచున్న వీరరుద్రుని మంత్రి ఇందులూరి వంశమండనుడు, మల్లని పౌత్రుడు, గన్నయ పుత్రుడు అన్నలదేవుడధికభక్తి తాత్పర్యములతో విద్దనాచార్యులకా గ్రామము నర్పణ చేసినముల విశదీకరింబడినది. దాన కాలమున శాసనము వ్రాసి యిచ్చినటుల కాన్పింపదు: ఈ అన్నలదేవుడు ప్రతాపరుద్రునకు పినతల్లి భర్తయైనవాడు. రుద్రమదేవి కాలములో యు కోరుకొండ రాజ్యభాగమును పాలించుచున్నవాడునై యున్నాడు. విద్దనకిచ్చిన మర్పడిగ గ్రామ సీమావధులబట్టి అది అతని పాలనాధికారపరిధిలో గల గ్రామమై యుండవలెనని తోచుచున్నది.

ఈ శాసనములో నె 45 రు శ్లోకములో చెప్పబడిన

"యః ప్రాప్య స్వయమిందుశేఖర నృపా చ్చాళుక్య
వంశోద్భవా
దష్టైశ్వర్య మదుత్తరేశ్వరపురం గ్రామం మహీభూషణం
భక్త్యా బ్రాహ్మణ సాద్విధాయ భవనే లక్ష్మీ భుజావల్లరీ
వేల్లత్కంకణ ఝుల్లరీ ఝుణఝుణాన్వాయః సమాకర్ణయత్"

అను విషయ మసంగతముగా కానుపించుచున్నది. ఏలనన చాళుక్య ఇందు శేఖరునిచే విద్దనకు ఉత్తరేశ్వరపుర గ్రామదానము

"సుధాకర వసుంధరా నయన చంద్రమః సంఖ్యయామితేషు
శక వత్సరేష్వథ విరోధినః ఫాల్గుణే శశిగ్రహణ మందిత
నగురవే
సతాసుగ్రణీరదత్త పురముత్తరేశ్వర మశేషభోగైః సహ"

అను వక్కాణమును బట్టి శక సంవత్సరం 1211 నాటి విరోధినామ సంవత్సర ఫాల్గుణశుద్ధ పౌర్ణమికి సరియైన హూణమాన పరిగణన ప్రకారం 25-2-1290వ సంవత్సరమున నొసంగబడినది. అట్లౌట క్రీ॥ శ॥ 1289 వ సంవత్సరములో అన్నలదేవు డిచ్చిన "వినాయకపుర" శాసనములో మరుచటి సంవత్సరములో జరిగిన గ్రామదానవిషయ ముట్టంకింపబడుట వింతగా తోపకమానదు:

ఈ సమస్య నొకవిధముగా సమన్వయింపవచ్చును. అన్నల మంత్రి 'వినాయకపుర దానము' క్రీ॥ శ॥ 1289లో జరిగినది. అప్పుడది శాసనస్థముగాలేదు. ఆ పిమ్మటి సంవత్సరమున చాళుక్య ఇందుశేఖరునిచే ఉత్తరేశ్వరపురము పండితుడు, పిన్నయజ్వ కుమారుడు నగు రుద్రదేవునకు దానమొసంగబడగా, నా రుద్రదేవుడు గురుదక్షిణగా నా గ్రామమును విద్దనాచార్యునకు సభక్తికముగా నర్పించెను. ఆ విషయమే ఉత్తరేశ్వరపుర శాసనములో నుద్ఘాటింపబడినది. ఆ పిదప మరి రెండు సంవత్సరములకు అనగా క్రీ॥ శ॥ 1292 సంవత్సరములో చాళుక్య ఇందుశేఖరుడు "ఓనల్లి" గ్రామమును విద్దనకు దానమిచ్చి శాసనము వ్రాయించుచు, విద్దన ప్రతిభావ్యుత్పత్తుల, పాండితీ ప్రకర్షల వర్ణించు పట్టులో నాతడింతకు మున్నుపొందిన గ్రామదానములు, ఒనరించిన సత్కార్యములు, రచించిన గ్రంథరాజముల నుట్టంకించి అగ్గించుచు తన శాసనములో వానికి తావొసంగి, విద్దన గొప్ప తనమును వెల్లడించినాడు. "దాయగజకేసరి" శాసనములోని

"విద్యా నద్యనుషంగి భంగి మధురం వాగీశరత్నాకరం
యస్మిన్నేయుషి సర్వతోముఖ సుఖం కీర్తి ప్రదం తన్వతి
చిత్రం చంద్రకరోచిషః సుమనసాం చక్షుః ప్రియం భావుకా
ధూమ్యామండలినః కలాపిన ఇవక్షీణ న్తి హోమాగ్నయః ॥
"యః ప్రాప్య స్వయమిందుశేఖర నృపాచాళుక్య వంశోద్భవా
దష్టైశ్వర్యమదుత్తరేశ్వరపురం గ్రామం మహీ భూషణం
భక్త్యా బ్రాహ్మణ సాద్విధాయ భవనే లక్ష్మీ భుజావల్లరీ
వేల్లత్కంకణ ఝుల్లరీ ఝుణ ఝుణాన్వాయః సమాకర్ణ
యత్॥

"కైలాసప్రభవి భీమవల్లభపురే యశ్చంద్రశ్రి చూడామణే
రాగారం నిరమాపయద్గురు శివజ్ఞానేశ్వర స్యాఖ్యయా
తస్యాం శేఖరి తేన తత్పురి సరే గంగేతి నామ్నాచల
ద్వీ చీవిధీతడాగమవ్యనుదినం ఫేనైః పయోధిం హసత్॥

"ఆదాయ పూర్వోత్తర తంత్ర సారం
మగుంఫ యద్గ్రంథను కల్మషం యః
గ్రైవేయకం వాగధి దేవతాయాః
ప్రమేయ చర్చాప్రృత నామధేయా ॥

"దేవ్యాగిరా విస్మితయా యదీయే
కీర్తి ప్రసూనే నిజకర్ణ దేశం
ఆరోపితే తత్ర నవస్తుమిష్టే
హ్రీయేవపూర్వః కుసుమావతంసః ॥

ఇత్యాది వక్కాణముల నుదాహరణలుగా నుదహరింప వచ్చును.

ఈ అయిదు రేకుల శాసనమును బంధించిన రాజముద్రికను గూర్చి కొంత విమర్శింపవలసి యున్నది. ఈ శాసనములో రెండు గ్రామ దానములు ప్రసక్తింపబడి, దాన ప్రతి గృహీత ఒక్కరే అయినను, దాతలిర్వురు వేర్వేరు వంశములకు చెందియున్నవారగుటచే, శాసనమునకుంచవలసిన రాజముద్రికలొకే రూపున నుండనవకాశములేదు. రెండు విభిన్న రాజ ముద్రికల శాసనమునకుంచు సాంప్రదాయ మెచటను గాన్పింపదు. రెండవ శాసనమిచ్చినవారి రాజ ముద్రికనుంచిన, మొదటి శాసనమిచ్చినవారిని కించపరచుటే యగును. ఉభయ తారకముగా నుండు మార్గము నెన్నుకొని, ఈ శాసనదాత లిరువురును విజ్ఞతతో కూడుకొన్న మార్గమునే యెన్నుకొన్నారు.

ఈ శాసనమునకిడిన రాజముద్రిక పైగల గుండ్రనిపిళ్ళకు పై అర్ధ భాగమున యెడమపైపు చంద్రుడు కుడిపైపు సూర్యుడు, ఆ దిగువను వరాహము, నంది నిలువున నిలిపిన ఖడ్గము, ఆ క్రింది సగభాగములో "దాయగజకేసరి"యను అక్షరములు ఉబ్బెత్తుగా పోత పోయబడి యున్నవి. ఈ ముద్రికలో నున్న చిహ్నముల అర్థము చెప్పవలెనన్న ఇట్లూహింపవచ్చునని యనుకొనుచున్నాను. చంద్ర సూర్యులున్నంత కాలము ఈ దానము విచ్ఛిన్నముగా జరుగవలెనను ఆకాంక్ష చంద్ర, సూర్య చిహ్నములలో కానుపించును. ఇక ఆ దిగువనున్న వరాహ చిహ్నము చాళుక్య, కాకతీయరాజుల చిహ్నముగా మనకు తెలిసియే యున్నది. అయితే ఈ శాసనమిచ్చినది చాళుక్య ప్రభువా? లేక కాకతి ప్రభువా? యన్న మీమాంస కల్గును. శాసన ప్రారంభమునుండియు ఓరుగల్లు పుర వర్ణన, ఆ పురమునేలు కాకతీయ రాజన్య వంశ వర్ణన కానుపించుటచే నా వరాహ లాంఛనమునుబట్టి ఆ శాసనము కాకతీయరాజులచే నీయబడి యుండవలెనను యూహ జనించుట సాజము. కాని- శాసనము సాగిన కొలదిని ఇందులూరి అన్నలమంత్రి ప్రసక్తి, విద్యనాచార్య వంశ ప్రసక్తి, ఆతని పాండితీ గరిమ ప్రసక్తి వ్యక్తమై ఆ దానము అన్నల మంత్రిచే నీయబడినట్లు స్పష్టమగును. ఈ పరిస్థితిలో వరాహ లాంఛన ప్రశస్తి డిందువడుచున్నది. అయితే అన్నల మంత్రి స్వతంత్ర ప్రభువుకాదు. ఆ కారణమున నాతనికి ప్రత్యేక రాజలాంఛనము, ముద్రిక యుండుట సంభవము. ఆతడు కాకతి రాజన్యుల సేనాని. సామంత ప్రభువు. సామంత ప్రభువు దానమొసంగునపుడు తనకు ప్రభువగు సార్వభౌముని రాజలాంఛనమునే ఉపయోగింపవలెనుగాని స్వీయలాంఛనము నుపయోగింపరాదు. ఒకవేళనట్లుపయోగింప నుద్యమించినను సార్వభౌమాధికారముగల తన ప్రభువు రాజలాంఛనమును ప్రస్ఫుట ఫణితిని ప్రదర్శింపవలయు నియమమున్నది. * ఇట నా సాంప్రదాయమే అనుసరింపబడినదని నా యూహ.

రెండవ శాసనములో "ఓరపల్లి" గ్రామదాన ప్రసక్తిగలదు. ఆ దానమిచ్చినది "చాళుక్య ఇందు శేఖరుడు." ఈతడు ప్రతాప రుద్రుని మాతామహి రుద్రమదేవి భర్త చాళుక్య వీరభద్రుని తమ్ముని కుమారుడు. ఆ విధిని చాళుక్య ఇందు శేఖరుడు ప్రతాప రుద్రుని బంధుకోటిలోని వాడగుచున్నాడు. అంతకుమించి ప్రతాప రుద్రుని సామంతుడుగా నిరవద్య పురము రాజధానిగా రాజ్యమేలుచున్నవాడు. ఈ చాళుక్యుల రాజ లాంఛనము గూడ వరాహమే! ఆ రీతిగా నీ శాసనముపై నున్న వరాహ లాంఛనము ఉభయతారకముగా నిలిచియున్నది. అన్నలదేవుడు, ఇందు శేఖరుడు గూడ కాకతి ప్రతాప రుద్రు సేనానులు, సామంతులు, చుట్టములునైన కారణమున వారి ప్రభువగు కాకతీయ ప్రతాప రుద్రుని రాజ ముద్రినే తమ శాసనమునకుంచినారు. ఆ విధి వరాహలాంఛన ముద్రికౌచిత్యమును సమన్వయించినను మిగిలినవంది, నిలిచి యున్న ఖడ్గ చిహ్నముల గూర్చియేమని చెప్పవలెను? ఈ చిహ్నము లే రాజవంశమునకు చెందినవో ఇంతవరకు వెలుగులోనికి రాలేదు; కావున పరిశోధక మహాశయులీ విషయమై కృషి చేయవలసి యున్నది.

ఇక మిగిలినది "దాయ గజకేసరి" బిరుదనామధారి యెవ్వరనునది. శాసనదాతలైన అన్నలదేవ ఇందుశేఖరులకీ బిరుదము

* 1. వేంగిపాలకుడు చోళ పరాంతకుని క్రీ॥ శ॥ 1116 నాటి పల్లవరం శాసనము.

2. కోటగజపాంబ "మొగలుట్ల శాసనము."

లేదు. తమ బాంధవ్యములబట్టియో లేక కాకతీయ సార్వభౌమత్వ మంగీకరించి వారి సామంతులుగాట వలననో వారి లాంఛనముల తమ శాసనముల కుంచుకొన్నారన్న హంశ మంగీకరించినను ఈ శాసనము చాళుక్య ఇందు శేఖరుడిచ్చినదా ? లేక కాకతి ప్రభువిచ్చినదా ? యన్న సమస్య ఉత్పన్నమగును. "దాయగజకేసరి" బిరుద మెవరికున్నదో తెలిసికొన్నచో ఈ సమస్య తీరిపోగలదు.

సుప్రసిద్ధ చారిత్రిక పరిశోధకులు శ్రీ పి. వి. పరబ్రహ్మ శాస్త్రిగారీ విషయమై తీవ్రపరిశోధనజేసి తమ "కాకతీయకాయిన్స్ అండ్ మేజర్స్" అను చిన్న గ్రంథములో ఈ బిరుదము ప్రతాపరుద్ర ప్రశస్తిదని నిర్ధరించియున్నారు. *

శ్రీ పరబ్రహ్మశాస్త్రిగారి వివరణవలన ప్రతాపరుద్ర చక్రవర్తి తన సేనానులగు సోమయాజుల రుద్రదేవుడు ఇందులూరి అన్నయమంత్రి, చాళుక్య ఇందుశేఖరుల తోడ్పాటుతో కాయస్థుడగు అంబయదేవుని త్రిపురాంతకము వద్ద పరాజితు జేసిన సందర్భమున విజయ సూచకముగా చాళుక్య ఇందుశేఖరుడీ దాన మొసంగుచు తన సహసామంతుడగు అన్నల దేవుని దాన ప్రశస్తి నిందుజేర్చి తమ యేలిక కాకతి ప్రతాపరుద్రుని రాజ లాంఛనము పై నీ శాసనము నిచ్చియున్నారని తెలియుచున్నది.

మొదటి శాసనములో సుదహరింపబడిన సర్పడిగ గ్రామము (వినాయక పురము) వెనపల్లి, పెదమిత్తి, దుత్తిగ గ్రామములు పశ్చిమ గోదావరి కాలువ ఒడ్డున యుండి యుండునని తోచుచున్నది. వాని ఉనికిని కనిపెట్టుటకు పరిశోధనావసర మెంతేని కలదు.

రెండవ శాసనములో ప్రసక్తిగన్న ఓనపల్లి, కడమి (నేటి తణుకు తాలూకా పిట్టలవేమవరం గ్రామ శివారు కడింపాడు) గ్రామ సరిహద్దుననేయుండి, ఉత్తరేశ్వరపురము (శాసనము దొరికిన ఖండవల్లి గ్రామము) లోనంతర్భాగమైపోయి, ప్రస్తుతము ఖండవల్లి గ్రామముగనే వ్యవహరింప బడుచున్నది.

---

* ది జనరల్స్ చాళుక్య ఇందుశేఖర, ఇందులూరి అన్నయ ఎండ్ సోమయాజుల రుద్రదేవ ఇఫెక్టెడ్ దిస్ గ్రేట్ విక్టరీ (నేమలి) ప్రతాపరుద్రాస్ విక్టరీ ఓవర్ ది కాయస్థ చీఫ్ అంబదేవ ఇన్ త్రిపురాంతకం ఎండ్ ఇష్యూడ్ ది ఖండవల్లి ప్లేట్స్ ఎండ్ ది తేవల రికార్డ్ అండర్ ది కింగ్స్ సీల్ "దాయగజకేసరి".

## మొదటి రేకు - మొదటి వైపు

1. స్వస్తి। దేవస్తంబేరమాస్యః కరశిఖరచయః శీకరైస్తావ కీనం చేతః శీతం విదత్తాం ద
2. లయతు తిమిరం దన్తరేఖామయూఖైః। దూరే ధూనేతు విఘ్న ప్రకరమను కిలం
3. వ్యాగ్రక [జ్ఞ] గ్రవాతై [ఘ్నాదా] సింధూర ధూళి వితతి భిరవతాద్ధర్మ కర్మానురాగం [గమ్] (1) మాధ్యంతం,
4. మహిషాసురం [గిరినిభం] న్యక్కృత్యవామాం ఘ్రిణా (పా) ఘాతక్రుంవ ఇతీవ దక్షిణ పదా సంబా
5. యన్నిథువం। ఆశాస్వష్ట సురక్షితు కిల జగద్బాహాష్టకం బిభ్రతి సాశక్తిర్నిటలాక్షి నిష్ఠు
6. రరుచా యుష్మద్రి పూన్పశ్యతు ॥ (2) ॥ అనుపదమ వధూన్వద్దం క్షత్రియా దైత్య వంశానుపనిషంద
7. టవీనామంతరే సంచరిష్ణుః నియమ విదచలా నామంతరా త్మాన్తి శాలీ ప్రథమ కిరి ర
8. జస్రింపాతు దేవీంధరిత్రీం [త్రీమ్] (3) శరామ్మక్త్వా పంచాప్య ఫలితరుషా చిన్తి జామనసా పరిక్షిప్తం పౌష్పం
9. ధనురివకిరీపేన్మర। [ఘ్న] షః కలాయిన్య స్ఫురంతిభజతి రజనీశశ్చ భవతాం ప్రసాద
10. ప్రత్యూహం విఘటయతు తామిశ్ర పటలం (మ్) (4) సేవఃపాథో విశాయి ప్రథమమజన
11. యన్నాభీనా భీకగర్భాన్ద బ్రహ్మ [ణం భూర్భువ] స్వత్రయ మనూజన సౌతత్ర భూలోక భూషా। అం
12. ద్రిఃఖల్వ స్తిధేశః సంకల సుఖ పరిపాక సౌరభ్య సీమాయ త్రాస్తి ముక్తముక్తావళిరివ విమలా
13. గౌతమి నామ గంగా ॥ (5) బామ్మైరానంద జాతైరివకటక తట ద్యుష్ఠ రేర్నిర్భరోర్మైర్యాన వ్యాసక్త నృత్తైరి
14. ద[శ] వలితమరుత్కంపితా శశాఖికాండైః। గాన్తైగ్గాం ధార గర్భీరివ మదురత మౌస్త [తు] ప్రసూనాన్యా (స్పా)
15. ద్రియత్రస్థితః శ్రీగిరి రభిలవ (రం) మౌళిభాగే దధానః (6) ఓరుంగల్లు నగరం వి జితే తత్ర గోపు
16. రకరం (రం) చితంబరం। దేవతాభవన భవ్య భేరికారావ రాజిత విమాన గహ్వారం (మ్) (7) శీతా తపసార
17. సహస్రరం యతు ప్రాసాద పాళీషు సువర్ణ కుంభాః। ఆలంబ్య [సి] ష్ణోః [పద] మంగనానా
18. మురోజ సామ్యయాతః శ వన్తి (8) బాలా తపాయత్ర బాలా (నిపా) నాం యచ్ఛంతి హమ్య

### మొదటి రేకు-రెండవ వైపు

19. ణి గవాక్షమార్గైః భవ [తు] ప్రతాపాస్థిరయస్తు నాస్మానితీవ సేవాముప

20. గస్తు కామాః॥ (9) దేశాన్తరాదాగమినః పుమాంసః సవర్ష విద్యాస్వపిసారభా

21. జః। శాస్త్రార్థ సందేహ నిరాసరీతిం యస్మిన్నులభన్తే శుకసారి కాభ్యః॥ (10) తత్రాభవ

22. త్కాకతి వంశ కేతుః ప్రోలాహ్వయః ప్రోషితవైరివర్గః। భువః పతిర్యాజ్ఞ స్యభు

23. జ ప్రతాప ప్రతిచ్ఛవిస్నాన సమబింద్ధవాగ్నిః। (11) గాతుం యదీయ ప్రతిపాద నాన్వ

24. ర్యోత్సుకానాం ప్రమదావనానాం। పుష్ణన్తి తానం పురుహూతలోకే పృథ్వీ

25. రుహః పుష్పవిహం విరావైః॥ (12) యశాంసియస్య(స్ఫు) టముల్లసన్తి త్రిలోకిసీ

26. లోత్పలలోచనానాం। కంఠేషు కర్ణేషు పయోధరేషు హారన్తి హేరం

27. త్యపి చంద్రికాన్తి॥ (13) సహద్ర దేవస్తనయన్తమూర్వ్యం కాలాకరమాత్మాయి

28. తుండిదేశ॥ యస్య ప్రతాపేనహుతాశ్చనేన ప్లుష్టం నభోనూనముపైతి

29. నైల్యం॥ (14) యస్యారి భూపాల విలాసి నీభ్యః శ్వాసానిలోత్థేర్వనవాసి నీభ్యః। లావ

30. ణ్య భిక్షాముపగన్తుమేవ ప్రవాళహస్తైర్లతికాయతన్తే॥ (15) యత్కీర్తి సారంగ

31. విలోచనాయాః దిగ్భిః సఖీభిః పరివారవత్యాః పన్యేషుఘానాం పథిలోల

32. మానం క్రీడాకరం కందుక మిందు బింబం॥ (16) అసౌ మహాదేవ ఇతి ప్రతాయ కసీ

33. యసేఖండితవైరి వర్గః। దధౌ(దౌ)ధస్త్రీ పలయాధి పత్యం కీర్త్యేవరస్తుంకిల రక్త చేశః। (17) అ

34. సావచల వక్షోజానదీనక్షత్ర మాలికం అధత్తలీలయాదేవీ మనన్యం సా

### రెండవ రేకు - మొదటి వైపు

35. గరాంబరాం (రామ్) (18) పరిమ్లానయశః పుష్పం ప్రస్త ప్రాకారమేఖలాం॥ సకదాచిద

36. (రతి) యాచకేభ్రి కామాకులం పురీ (రీమ్) (19) కుంభయోస కరీంద్రస్య జయశ్రీః కుచయో

37. రివ॥ సంవివేశరణేరాత్రౌ రక్త చందన చర్చితః। (20) తతో గణపతి స్తస్యదానశ్రీ నిలయ

38. సుతః। దధారరత్న ధామాంకం కరేణ వలయం భువః (21) యత్పాద పీఠవిన్యస్తం ప్రశ

39. స్తాంవసనంబభౌ। చిరార్చితమి వారిణాం యశః శరణమాగతం (తమ్) (22) యత్పాదపీఠప

40. ర్యన్తంకుట్మలీ కృత పాణయః॥ నీరాజయన్తి రాజాన శ్చూడామణి మరీచిభిః (23) య

41. స్య పతీ పక్షితి భృత్యకులానాం కిరీట సంఘట్టన యాస శంపా। నిపేతవాని స్తరవారి యష్టి

42. ర్ధారాఘరత్వం ప్రకటీచకార। (24) ఆసీత్తమా సోమలిరస్య దేవీ పురందర స్యేవ

43. పులోమకన్యా। సౌభాగ్య లక్ష్మీ రివరుద్రమాంబా పుత్రీ తయోః పుణ్యవశా

44. చ్చకాశే। (25) సాచండి కేవ ప్రతిపక్ష వృత్తిః కాలేన రాజ్యం పితు రాససాద। పరిస్ఫుర

45. త్యా। [-] పద పద్మ కాంత్యా మాగధి తారాజ భియత్త మాంగైః॥ (26) యస్యా వితరణః కిలచినయ [-] చిన్తా

46. మణిః స్థావర తాంజగామ। యస్యా యశఃసామ్య [మ] నాశ్రియంతి ధనుశ్చ దివ్య సురభిర్బభూవ।

47. (27) తస్యమా భూవీశ్వరయ దేవతాన్వయంపుగ్ధా కృతిస్త మ్మడి నామ ధేయా॥ పత్న్యామ

48. హాదేవనృపేన గా సాపుద్ర దేవం సుషులే కుమారం। (28) భాగ్యేన సార్ధ పరివర్ధమానః స్వప్రా

49. ప్యరాజ్యం జననీ జనన్యాః। అరాదరాతిన్ క్రథయన్ ప్రతాపా దాపోన్నతు ప్రతాప దేవ మాత్మ

50. నామ। (29) యస్మిన్మహీం శాసతి నే (నౌ) వచౌర్యన దైన్య వృత్తిర్న పరాప వాదః। నా సత్య భాషా [భ-]

51. పతి ప్రజానాంకుల క్రమావార కుతూహలానాం। (30) యదీయ రాజ్యేసతి మాసిమాసి వా

## రెండవ రేకు - రెండవ వైపు

52. రత్రయం వర్షతి వారివాహః జనా నిరాతంక నిరీతి శంకా భవన్తి సస్యానిచయ

53. తి (న్తి)రు (ర్వ్య)ద్ధిం (ద్ధిమ్) (31) కీర్తిర్యదీయా లలితాం బరశ్రీః పయోధర స్ఫూర్తిమ దర్శయన్తీ। న

54. క్షత్రమాలా భరణం వహన్తి బిభర్తి భవ్యం సుమనో వికాసం (సమ్) (32) మాన్యః సతాంముల్లి

55. నమంత్రి పుత్రాన్మహా బలాద్గన్నయ నామధేయాత్ ॥ అదే ఋవా నన్నల దేవ హూతి రమా

56. త్యతం ప్రాపద ముష్యరాజ్ఞః (33) ఇందుబారు రితియశ్చ [కులీన గ్రామ నామని] జనాముని

57. శౌషతు। బిభ్రదాత్మ గుణపంక్తి మనన్య మవ్యనర్ఘ శాసు దిక్షుః [జనేభ్యః] (34) యద్బాహా

58. బా సంపదా కుటిలిత భ్రూకల్ప కోదండయా నిర్ముక్తా నిశితాః శరాఃకువలయా

59. రూక్షాః కటాక్షా ఇవ। ప్రాప్తుం సంగర మీహినాం ప్రతిభట శ్రీ సంగినా [నీభరం?] భిందానా

60. హృదయాని రక్తిమ దశాంసక్వ్యహోభ్రిభతి ॥ (35) యన్ని త్రింశసి తేత రాహి రహితశ్వా

61. సానిల గ్రాసవాన్ ప్రాప్తుం తన్మహిలా విలాస హసితం క్షీరం కల త్కౌశలః ॥ మ [త్కాం]

62. త్యావరలంపటా వర వధూ హస్తోత్పల ప్రసక్త్విషాం మా భూన్లాంనిరి తీవ నిర్మల యశో నిర్మోక మా

63. ముంచతి (36) శశ్వద్యస్య త్రిలోకే తిలకితయశసస్త్యాగమా కర్ణ్య నూనం ప్రాప్త స్పర్ధాలు

64. భావం వితరణ నిపుణం స్థావరాత్మా శరీరి। పుష్పైః క్రోధాట్టహాసం వహతికి సలయై

65. రాధీవహిన్దద్విరేఫై ర్ధూమ స్తోమంచకించ స్ఫురిత ఫల మిషా ప్రాంతరేషుస్ఫులింగాన్ ॥ (37) యః

66. సత్వే నిజరాజ (జా) జ్ఞాం నకదాచి దలంఘయత్। ఒశ్వ రేచ్ఛా మివ సస్టా। వేలామివ మహోదధిః (38)

67. అకర్మకటి నేతా ప్రమోయస్య పాణౌకృపాణికా। విభాతి ప్రపభాకృష్టా। వేణీవ రి

68. పుసంపదః ॥ (39) దేవనాచార్య సంభూత శ్రీ రంగాచార్య సంభవే [సభక్తిం]వి

## మూడవ రేకు - మొదటి వైపు

69. ద్దనాచార్యే [వి] నాయక ఇవాకరోత్। (40) ప్రోలేశ్వర స్యాస్పద మిందు మౌళే రధ్యాసీతు

70. ర్యత్ర వినాయకస్య। అనన్య వృత్తిః కరుణాచకాస్తి నాధే నదీనా మివజహ్నుక

71. న్యా॥ (41) దానార్ద్ర హస్తాంచిత పుష్కర శ్రీ ర్నిత్యం శివాఖ్యాము పలాల్యమానః। ఆరాధితాం

72. ఘ్రిః సుమనోభిరాస్తే వైనాయకీయం శ్రియమాప్నుకానాః॥ (42) బ్రూమఃకిం వి [ద్ద] నా

73. చార్యపుత్రః పిన్నయయజ్వనః। రుద్రదేవః పురీ (రారీ) రజ యద్యతు ప్రసాదతః॥ (43) విద్యా

74. నద్యనుషంగినం (భం) గిమ (దు) రంవాగీశ రత్నాకరం యస్మిన్నేయుషి సర్వతో ముఖ మఖం

75. కీర్తి ప్రదం తన్వ [తి]। చిత్రం చంద్ర కరోచిషః [సు] మన సాంచక్షుః ప్రియం భావుకా ధూమ్యామం

76. దలిన (నః) కలాపిన (ఇ) వక్షీ భన్తి హోమాగ్నయః॥(44) యః ప్రాప్యన్వయ మిందుశేఖర నృపా

77. చ్చాళుక్య వంశోద్భవా దష్టౌశ్వర్యమదుత్తరేశ్వర పురం గ్రామం మహీ భూషణం భ

78. క్త్యా బ్రాహ్మణ సాద్విధాయ భవనేలక్ష్మీ భుజావల్లరీ వేల్ల త్కంకణ ఝల్లరీ

79. ఝణఝణాన్భ్యాయః సమాకర్ణయత్ ॥ (45) కైలాసప్రవి భీమవల్ల భపురే యశ్చం

80. ద్ర చూడామణే రాగారం సిరమాప యద్గురు శివజ్ఞానేశ్వర స్యాఖ్యయా। తస్యాః శేఖరితే

81. న తత్పురి సరే గంగేతి నామ్నాచల ద్వీచీ విధీతడాగమస్య నుదినం ఫేనైః పయోధిం హ

82. సత్ (46) అదాయ పూర్వోత్తర తంత్రసారం మగుంఫ యద్గ్రంథమ కల్మషం యః। గ్రైవేయకం వా

83. గధిదేవతాయాః ప్రమేయ చర్చామృత నామధేయం(యమ్) (47) దేవ్యాగిరా విస్మితయా యదీయే కీర్తి

84. ప్రసూనే నిజకర్ణ దేశం। ఆరోపితే తత్ర న వస్తు మిష్టే హ్రియేవ పూర్వ (కు) సుమావతం సః॥ (48)

85. శాకాబ్దేష్వధు (ధి) వీందు పూషగణితేవర్షే విరోధి ప్రభే భాద్రేశ్యామల పక్ష పర్వణిక వేల్వారే

### మూడవ రేకు-రెండవ వైపు

86. రవేశ్య గ్రామే। గ్రామం మప్పడిగం ససర్వవిభవం తం విద్ద నార్య ప్రీతి ప్రాదాదన్నల దేవనా

87. మసచివః శ్రేష్ఠః కపెర్గోత్రిణాం (ణామ్) (49) పంచా శత్వారి సంఖ్యాక క్షేత్రం గ్రాము మ

88. సాహిమం। ప్రాదాయవిద్దనార్యా యస్వంకృతార్థమమన్యత॥ (50) తం గ్రామ మథ విఖ్యా

89. త వినాయకపు రాఖ్యయా । అకరోద్ది ద్దనాచార్య కర్తా (ర్తా) వైనాయకం ప్రియం (మ్) (51)

90. ఆహూయ ద్విజ సత్తమాన్నిజకుల శ్రీ పద్మినీ భాస్కరాన్ది వ్యాప ల్లి వరదుర్యమాన్ వినయి

91. తాపుష్పాలి పుష్పంధయాన్ । సద్యః ప్రీతమనా వినాయక పురం తద్ది ద్దనార్య స్స్వయం

92. ప్రాదాదిదృశ చేతసాం సుమనసాం కిన్నా మనోలభ్యతే ॥ (52) సర్వా యతుక్షితిరుర్వ రాయదభితః

93. సంహారి గాంగంజలం యత్పర్య న్త వనం వరద్రుమశతం యతు ప్రాంజలం శాద్వలం ।

94. యజ్ఞాతం నిరుపద్రవం నిఖిల మప్యుద్దామ సారాస్పదం తదృహ్యా క్షిత(ం) వినా

95. యకపురం కేషా (ం) నతోషావహం (హమ్) (53) అస్య గ్రామస్య సీమానః॥ పూర్వతః। వి

96. నాయకపురపు వెనవెల్లి పెనుమిత్తిముయ్యాన కుట్రిన తుమ్మ పుట్ట । ఆగ్నేయత

97. ః। వినాయకపురపుదు త్తిగ పొలమేరగర్చిప్పుట్ట॥ దక్షిణతః। వినాయక పురపు దు

98. త్తిగపొలమేరకొఅపుట్ట ॥ నైఋత్యతః। వినాయక పురపు దుత్తిగ గంగాదే (వి) ముయ్య కుట్ట ।

99. నమేపిపొడ్డ ॥ పశ్చి తః గంగాదేవి నడు । వాయవ్యతః। వినాయక పురపు రాలి గం

100. గాదేవిముగ్గ న కుట్రినజేసెలవంపు॥ ఉత్తరతః। వినాయక పురపు రాలిపొలమే

101. [ర] భల్లభి ముని పుంత బరకెప్పుట్ట । ఈశాన్యతః । వినాయకపురపు రాలి వెనవెల్లిము

102. య్యాన కుట్రిన వప్పుట్ట॥ ఏతే। విష్ణుపు [ట] శాసినః। వి [ద్ద]నయ అర్థిన్] ప్రోలే పుటశా

### నాలుగవ రేకు మొదటి వైపు

103. సినః। [విట్టిపెరుమాడిపు। కేశవపు। .... .... ఏతేహ

104. రీతాః। సూర్యదేవభట్ట .... .... .... ....

105. .... .... .... శాసినః సోమనాధపు । .... .... అన్నె

106. పు.... ....ఏతే కుండినాః । శ్రీ కోదేశ్వరపు । క — వెన్నాకు త

107. పు.... ....ఏతేకశ్యపాః । జోస్య పెరుమాడిపు । భార ద్వాజః । కంచి

108. .... .... .... ప్రోలే పుటశాసినః । అగ్రహార ప్రతాతారః

109. విద్దనాచార్యేన్ః శ్రీమదా [- -] చతుర్భాగినః । ఏతే కపి గోత్రాః, అత్రిచగ్రామే కుంభకా

110. ర తేలికారాద్యష్టాదశజాతి భిర్యద్దేయం యజ్వార్యన ద్యకం (మద్యకం ?) తత్సర్వమేత్య ఏవవిప్రే

111. భ్యోద త్తం । సామాన్యోయం ధర్మ సేతుర్నృపాణాం కాలేకా లేపాలనీ యోభవద్భిః సర్వా [నే]తా

112. న్భావినః పార్థి వేంద్ర [న్భూయో] భూయోయాచతే రామ చంద్రః। బహుభిర్వ సుధాద త్తం బహో

113. భిశ్చాను పాలితా। యస్య యస్య యదా భూమి స్తస్యతస్య తదాఫలం (లమ్)। స్వస్తి। శ్రీ ॥

### నాలుగవ రేకు-రెండవ వైపు

114. శ్రీ గణాధిపతయేనమః ॥ భక్తానాం ముక్తి విధోమివ సూచ యుతం [హేతమా]

115. నాగ్రిక న్తః సంసార శ్రీ న్తిరేఖా మివ విఘట యితుం విజిత శ్రోత్ర పాలిః। ప్ర

116. త్యక్షా[వాత లక్ష్మీమివమలినయితుం సాంద్రదానాంబుధారాః సశ్రీమా న్నా।

117. ప జన్యః స్ఫురతం (తవ) మనః పద్మ పీఠే కృపాణః । (1) యస్యాగ్రే [శివ నిధి]

118. కర్పూరి వరాముస్తాతి కూర్మాదిపః సర్ప ప్రాగ్రహరాబిస న్తి తటినీ [కా న్తశ ]

119. కాసారతీ। కించక్ష్మావలయం విషాణ విలగచ్చైవాల జాలత్య (సౌ) బ్రహ్మండాల్పత

120. యానికుంచిత మహాకాయః కిరిఃపాతువః॥ (2) [శృంగార] మార్గా చర

121. మీశ్వరమత్త నాగం కర్తుఃకుతూహలవతః కుసుమాయు ధాస్య। పు

122. ష్పైః కృతాస్యణిరివేందుకలా। కపర్ద్వాసంగినీ భవతు కామ్య విభూతయే

123. వః॥ (3) ప్రాసోష్ట ప్రథమం పయోధిశయనం [*] పద్మా సనం సత్రియం లోకానాం (మ్)

124. [చలీకృతం] నృపకులన్త త్రాస్తి సోమోద్భవం॥ తస్మి న్భూపతిరిందుశేఖర ఇతి [ప్రా]

125. న్మహాదేవరాట్ తజ్జన్మాభవ దిందుశేఖర ఇతిఖ్యాతతః। [ప్రాభవత్] (4) సరిపుపు

126. రవధూ విలాసహాసా। నధరి తవాన్కుర చంద్రహాసా భూషా। అతిరయ [శఖర]

127. ద్యుతి యశోభర్నిజ తనూ సహ్యులసంచ బాణలక్ష్మిః। (15) మాణిక్యాభరణా మనోజ్ఞవ

128. సనామాన్యంగరాగా మధుస్యాయన్యా [శర] మరా [ల] గమనా మాయూర

129. బహలికాః॥ రమ్యంగా విషమాస్త్రరా (గ) కరణీ రాజ్యస్య లక్ష్మీ [స్వయం] రక్తయ

## అయిదవ రేకు-మొదటి వైపు

130. త్రతమిందుశేఖర మహారాజం [సగా.. ....] (6) రాజా భక్తిం సరత్తేరుచి

131. రఫలకరీ [దేవ] నాచార్యుల సూనోః శ్రీరంగాచార్యనామ్న స్తనుజను

132. షశివే విద్దనాచార్య వర్యేం। నిత్యం రుద్రాక్షమాలా వం యినిరియ

133. తేమాతి భవ్యాంగరాగే కీర్తి గంధాపదానే విబుధ పరివృతే పుణ్య కైలాస

134. భాజి॥ (7) తం వక్తుం కే సమర్థాః వినిధగుణ మణ్డిం విద్ద నాచార్యుల వార్ధియ

135. న్మంత్రౌః కల్పవృక్షేణ్ణగి [డి] తిసుమనసాం భుక్తి ముక్తి [ఫలర్ధి] స్వాయ

136. త్యానాంద్రిమాతాం యశసి [పరిభవం] ప్రాపితేషాం సువర్ణ

137. ప్రాయః। క్షీరాంబురా శిస్తర విమ గరిమ (స్సోమ) భూమానమేతి॥ (8)

138. తస్మై విద్దన నామధేయ విబుధ శ్రేష్ఠాయగోత్రే కపేః సంభూతాయ స

139. ఇందు శేఖరనృపః శంభు ప్రియం బావుకః। శాకాబ్దే గుణ చంద్ర పూషగణి

140. తేపుణ్యోఖరో (రే) ర్ధోదయే భోగైరష్ట బినోనపల్లిమ తులం ప్రాదాత్ విభ్రాజి

141. తా [౦] (9) సవిద్ద నాచార్యుల వరస్త దానీంతామోన పల్లిం వసుధా సురేభ్యః। పాదత్

142. సంతోషకరః సురేభ్యః పంక్తిం ఫలానా మివ పారిజాతః॥ (10) అస్యగ్రామాస్య సీ

143. మాసః॥ పూర్వతః గంగాదేవి నడుము। ఆగ్నేయతః। ఓనపల్లి గంగాదేవి

144. కడమి పొలమేర ముయ్యన కుట్రిటున బలసు పుట్ట॥ దక్షిణతః ఓనపల్లి

145. కడమి పొలమేర తంగడిపుట్ట॥ నైరుత్యతః॥ ఓనపల్లి కడమి పొలమేర

## అయిదవ రేకు-రెండవ వైపు

146. — లు విరపుట్ట॥ ఓనపల్లి ఉత్తరేశ్వరపుర ఏవాంతర్భా విత — తత్సు ....

147. — వాస్యైతరేసీమానః॥



# స్వప్నంలో పొడిచిన సూర్యుడు

శ్రీ ముదివేడు ప్రభాకరరావు

**1**

ఎక్కడో నా చర్మ చక్షువుల కందని అతీత అంత
రిక్షంలో
ఎవరో యక్షుడో, హర్యక్షుడో తిప్పినమంత్రదండ
మాయాజాలంలో
జ్వలిత మార్తాండ మూర్తిని గర్భీకరించుకొన్న
భూతధాత్రిలో
నేనొక అపూర్వ తేజః పథంలో అడుగులు వేస్తూ
వస్తున్నాను

నా చుట్టూ వచ్చి ఆవరించాయి నిశ్శబ్ద కాంతి
వల్లికలు

అది నిశ్శబ్దం కాదు నిజంగా —
అందులో సన్నగా విన్పిస్తున్న
భ్రమరీనాదం లాంటి ఏదో గీతం వలయాలు
వలయాలుగా
నన్ను వివశుణ్ణి చేస్తోంది !

వెలుగులు నా వెన్కనే చేతులు చాపుకొంటూ
వస్తోంది !

ఆ నాదాన్ని నాలో దాచుకొంటూ
ఆనందాన్ని అందరికీ పంచిపెడుతూ —
నిశ్శబ్ద సంగీతాన్ని నిర్విరామంగా వింటూ
విశ్రమించిన సోదరుల్ని వెల్గు చేతులతో మేల్కొ
ల్పుతూ-
వెలుగు దారుల వెంట ఒంటరిగా పయనిస్తూ
ఈనాడో రేపో. శిరసోదయం కాబోయే గర్భస్థ
శిశువులా

ఊహాతీతమైన వెలుగు గడప దగ్గర
ఒక్క క్షణం నిల్చి ఊపిరి పీల్చుకొన్నాను.

**2**

'నా లోపలా బయటా ఒక్కడే సూర్యుడు'
అని లోలోపల గొణుక్కొన్నాను
ఆ తర్వాతనే తెలిసింది —
'ఈ లోకానికి తెలిసింది ఒక్కడే సూర్యుడని
కాని ఎందఱో సూర్యులు నిజంగా వున్నారని'
అదిగో ప్రాగ్దిశలో ప్రభలు చిమ్ముకొంటూ
ప్రాగ్జన్మ సంస్కారంలా వెన్నంటే ఈ సూర్యుడే-
అహర్నిశలూ అదే పనిగా నేనున్నానని
నిశ్శబ్ద సంగీతం విన్పించే ఈ సూర్యుడే -

ప్రజ్ఞా ప్రభాకరుడై
నా స్వప్నంలో పొడిచాడు
వెలుగుతీరాలకు నన్నువడిగా లాక్కెళుతున్నాడు
నా హృదయాకాశమంతా వెలుగులతో పుక్కి
లింతలైంది.
దిక్సీమలను స్పృశించే దివ్య స్పర్శతో నా తనువు
పులకించింది
జిగేలుమనే కాంతి పథంలో నా జీవితం ప్రవేశి
స్తోంది
రంగు రంగుల ఇంద్రధనుస్సు నాలో వెల్లి
విరిసింది.

***

# కీ. శే. కుందుర్తి

శ్రీ దేశపతి గోపాలకృష్ణ

విశ్వనాథ కవిరాజు - విశ్వం విడిచిన నాడు
నాగుండెలో ప్రవహించింది కిన్నెరసాని వాగు
నాగుపాము బుసలను - మానవతకు జరిగే
అన్యాయానికి, నీ కవిత ఆమడ దూరం నుంచే
వినిపించింది. వెళ్ళినావు సాహితీ శాంతి నందనానికి
విధిబలీయం! దూరం కాలేని సాహితీ బాంధవ్యం!

నాలాంటి సామాన్యుల అనుభూతులు, ఆరాటాలూ
కలిమి లేములూ - సుఖ దుఃఖాలకు
అద్దం పట్టిన నీ కవితాత్మకు
అక్షర రూపంలో నివాళి - ఇది

దేహ సౌందర్యానికంటే - ఆత్మ సౌందర్యం గొప్ప
అన్న తాత్విక కవితా మూర్తీ! కుందుర్తీ!

అలనాడు సాగర లంఘనం చేసిన
ఆంజనేయునిలా - సంసార జలధిలో
కవితా నౌకలో విహరించి - రసాలను పంచి
దివి చేరుకున్న కవితా విరించి
తీసుకో నా కవితా విపంచి!



# త్వామ్

శ్రీ తిరునగరి

నువ్వెంత సొగసరివి
మంచు కురసిన పందిరిపై విరిసిన మల్లెపువ్వులా
సుందరంగా హసిస్తావు

నువ్వెంత గడుసరివి
నీ వీణను సవరించి మధురమైన గొంతెత్తి
విరహిణిలా ప్రణయ గీతనూలపిస్తావు
నువ్వెంత ఒయ్యారివి
తోటలోకి పుష్పాపచయం చేసేందుకు
అందెలు రవళింపగా అందంగా గమిస్తావు

నువ్వెంత మిటారివి
శ్రావణ మేఘావృత గగనం చాటునుంచి
శతకోటి విద్యుత్ప్రభలతో
శంపా లతికలా మెరుస్తావు

నా స్వప్నాల దారుల్లో
నవమోహనంగా
నడచివచ్చే సౌందర్య దేవతా!

నా సాహితీ ప్రపంచంలో
శిల్పాభిరామంగా
సాక్షాత్కరించే రసమయ కవితా!

నీ ఆరాధనలో

ఎంతతృప్తి
ఎంతతృప్తి
ధన్యోఽస్మి
ధన్యోఽస్మి!



# దన్తకూరః

ఇది ఒక విచిత్రమైన శబ్దం. నా దృష్టికి అందినంత వరకు ఇది ఒక్క సంస్కృత మహాభారతంలో మాత్రమే ప్రథమంగా ప్రయోగింపబడినట్లు కన్పిస్తుంది. ఎందు చేతనంటే ఈ శబ్దాన్ని చూపిన సంస్కృతాంధ్ర నిఘంటువులన్నీ ప్రమాణంగా వ్యాస భారత శ్లోకాలనే ప్రదర్శించాయి. మరో విశేషమేమంటే తెలుగులో విశేష ప్రచారంలో ఉన్న శబ్దరత్నాకరం, ఆంధ్ర వాచస్పత్యం, వావిళ్ల నిఘంటువులు ఈ శబ్దాన్ని చూపలేదు. అంతేకాదు అమరకోశంలో కూడా ఈ శబ్దం కానరాదు.

ఆప్టే, మోనియర్ విలియమ్స్, వాచస్పత్యము, మామిడి వేంకటార్యులు నిర్మించిన శబ్దార్థ కల్పతరువు అనే సంస్కృత నిఘంటువుల్లో ఈ శబ్దం ఉంది. తెలుగులో సూర్యరాయాంధ్ర నిఘంటువులోను, ఆంధ్ర శబ్ద రత్నాకరంలోను ఈ శబ్దం కాన వస్తుంది. తెలుగు కావ్యాల్లో, బహుశః, ఎక్కడా ఈ శబ్దం ప్రయుక్తం కాలేదేమో. శ. ర., వా. ని. లు, ఈ శబ్దాన్ని వదలి వేశాయి. తత్సమ శబ్దంగా వాడుకోవచ్చు ననటానికి సూ. ని., వగైరాలు గ్రహించి ఉంటాయి. ఇంతవరకు బాగానే ఉంది.

కానీ, ఈ శబ్దార్థం దగ్గరనే ఒక విశేషం ఉంది. ఒక్క మోనియర్ విలియమ్స్ నిఘంటువు తప్ప మిక్కిన సంస్కృతాంధ్ర నిఘంటువులన్నీ ఈ శబ్దానికి 'యుద్ధం' అనే అర్థాన్ని ఇచ్చాయి. ఈ అన్ని నిఘంటువులకూ ఆ అర్థాన్ని అందించినది శ్రీ మహాభారత నీలకంఠ వ్యాఖ్య. చూడండి:

మాద్రీ పుత్రః సహదేవః కలిఙ్గాన్
సమాగతా న్నయ ద్దన్తకూరే
వామే నాస్యన్ దక్షిణేనైవ యో వై
మహాబలం కచ్చిదేనం స్మరన్తి

(మ. భా. 5. అ 23 - శ్లో. 24)

అయం కపాటేన జఘాన పాణ్డ్యం
తథా కలిఙ్గాన్ దన్తకూరే మమర్ద
అనేన దగ్ధా వర్షపూగా న్వినాథా
వారాణసీ నగరీ సంబభూవ

( . భా. 5. అ 48. శ్లో. 73)

ఈ రెండు శ్లోకాలలో మొదటిదాని దగ్గర నీలకంఠులు ఇలా వ్రాస్తున్నారు.

"కూర మన్నం, దన్తాః క్రోధావేశవశాత్ కూర వచ్చర్వ్యన్తేఽస్మిన్నితి దన్తకూరః సఙ్గ్రామః" కూరమంటే అన్నం, క్రోధావేశం వల్ల అన్నంలాగా దంతాలను యోధులు కొరుకుతారు గనుక దంతకూరమంటే యుద్ధం అని దీని తాత్పర్యం. వాచస్పత్యం, ఆప్టే మొదలైన భారతీయ నిఘంటుకారులంతా ఈ అర్థాన్ని యథాతథంగా స్వీకరించారు.

కాని మోనియర్ విలియమ్స్ మాత్రం దీనికి "నేమ్ ఆఫ్ ఎ ప్లేస్" అని అర్థం వ్రాశాడు. అంటే అది ఒక స్థలానికి నామంగా ఆయన సంభావించాడు. పై నీలకంఠ వ్యాఖ్య ఆయన దృష్టికి రాలేదా? లేక ఆ అర్థం కృతకంగా ఉన్నదని సంభావించాడా? కాక 'ప్రమాదో ధీ తా మపి' అనే న్యాయాన్ననుసరించి పొరబాటు పడ్డాడా? జాగ్రత్తగా పరిశీలించాలి.

దంత కూరమనేది విలియమ్స్ మాటతో చూస్తే ఒక దేశ నామమో, ఒక గ్రామనామమో లేక పట్టణం పేరో అయి ఉండాలి. దేశనామంగా ప్రసిద్ధిలేదు. ఎందుకంటే అంగవంగాది షట్పంచాశద్దేశాలలో ఈ పేరు కానరాదు. గ్రామనగరాది నామమైతే నిర్ణయించటానికి తగిన అవకాశాలు లేవు. 'సహదేవుడు కళింగులను దంతకూరమున గెలిచాడు' అని శ్లోక తాత్పర్యం కనుక అది ఒక నగరమో గ్రామమో అయి ఉండవచ్చును. కాని నిర్ణాయక ప్రమాణం కానరాదు. ఈ శ్లోకానికి ముందువెనుకల భీమాదుల యుద్ధ పరాక్రమాదులను వర్ణించిన 21, 22, 23, 25 శ్లోకాలలో వారు యుద్ధం చేసిన స్థలాలను పేర్కొనలేదు కాబట్టి ఇక్కడ కూడా స్థల నామాన్ని వ్యాసభగవానుడు గ్రహించి ఉండడని సంభావించటానికి మాత్రం అవకాశం ఉంది. అప్పుడిది తప్పనిసరిగా యుద్ధ పర్యాయ వాచకమే అవుతుంది.

కాగా, మోనియర్ విలియమ్స్ ఇది ఒక స్థలనామం అనటానికి ఆధారమేమైనా ఉందేమో చూద్దాం. పైని చూపిన ఉద్యోగ పర్వంలోని రెండవ శ్లోకం దగ్గర నీలకంఠులు

"కపాటేన - వక్షస్తటాఘాతేన, దన్తకూరే సంగ్రామే" అని వ్రాసి "అన్యేతు కపాటే నిజఘానేతిపాఠం ప్రకల్ప్య కపాటే

నగరే, ఏవం దన్తకూరే చేతి వ్యాచఖ్యుః" అని పాఠాంతర ప్రకల్పనను చూపి అర్థాంతర ప్రదర్శనం చేశారు. ఇందులో "ప్రకల్ప్య" అనే మాటవల్ల అది వ్యాస సమ్మతం కాదనే విషయాన్ని నీలకంఠులు ధ్వనిస్తున్నారు. అది అలా ఉంచితే ఆ అన్య వ్యాఖ్యానకారుల మతంలో ఇది స్థలనామంగా రూపొందుతున్నది. ఆ అన్యమతం విలియమ్సుకు ఆధారమై ఉండాలి. అయితే నీలకంఠులు ప్రధానంగా తీసికొన్న యుద్ధం అనే అర్థం - ఈతడు గ్రహించనే లేదు. స్థలనామంగా అన్య నిఘంటుకారులు తీసికోక పోవటానికి నీలకంఠుల పరసనయే కారణమై ఉండవచ్చును. ఏమైనా మోనియర్ విలియమ్సు యుద్ధం అనే అర్థాన్ని చూపకపోవటం విచార్యం.

మరో విశేషం. దంతక్రూర శబ్దం మహాకవి భారతంలోనే ద్రోణపర్వం 70వ అ, 5వ శ్లోకంలో ప్రయోగింపబడింది.

"బ్రహ్మద్విషా శ్చైథ తస్మిన్ సహస్రాణి చతుర్దశ
పునరన్యాని జగ్రా హ దంతక్రూరం జఘాన హ"

ఇక్కడ నీలకంఠ వ్యాఖ్య - "దన్తాః క్రూరాయస్మిన్ దేశే, తన్నృపే చ" అని. శ్లోకంలో దంతక్రూరుడనే వానిని చంపాడని అర్థం కనుక ఇది నృపవాచకం. 'విలియమ్సు' ఈ శబ్దానికి తదనుసారంగా నేమ్ ఆఫ్ ఎ ప్రిన్స్ అని అర్థం వ్రాశాడు. తక్కిన నిఘంటువులు ఇది జనపద క్షత్రియ వాచకంగా చూపాయి. వారికి నీలకంఠుని వ్రాత ప్రమాణం. [దేశంపేరు, ఆ దేశపు రాజుపేరు ఒకటే అయితే అట్టివానిని జనపద క్షత్రియవాచకం అంటారు. ఉదా ; అంగదేశం అంగరాజు] దీనిబట్టి ఇది దేశవాచకమని విలియమ్సు అంగీకరించటం లేదన్నమాట. దీనికి కూడ తగినంత కారణం కానరాదు. ఇదివరకు అనుకున్నట్లు షట్పంచాశద్దేశాలలో దంతకూరంతో పాటు దంతక్రూరం కూడా కనబడదు. కాని క్రూరమైన దంతాలు కలవాళ్లు ఎక్కువగా ఉన్నదేశం అని ఇది ఒక కల్పిత నామమై ఉండాలి.

నిఘంటు నిర్మాణంలో పరమ జాగరూకత వహించిన మహానుభావుడు మోనియర్ విలియమ్సు ఈ శబ్దం దగ్గర పొరబాటు పడ్డాడో, లేక తానిచ్చిన అర్థమే వ్యాస సమ్మతమనే నిశ్చయజ్ఞానంతో ఉన్నాడో శబ్ద తత్త్వజ్ఞులు నిర్ణయించాలి.

డా॥ శలాక రఘునాథ శర్మ

# కాలం

## కె. శోభ

మొదలూ చివరా తెలియని
అనాది గర్భాన్ని చీల్చుకుని
ఊపిరి పోసుకున్న క్షణాన
నాకు తెలియదు ఈ అనంత కాలవాహిని పొడవెంతో!
నూరేళ్ళు బతకమని పుట్టిన రోజు దీవిస్తే
నూరు దీర్ఘకాలానికి కొలమాన మనుకున్నాను.
'వెయ్యేళ్ళు ఈ చెట్టు జీవితకాలం'
బోటనీ మాస్టారి మాటల కచ్చెరువందాను.
కాంతి సంవత్సరాన్ని అంకెల్లో కూడి
దాని వ్యాప్తి ఊహాకందక తలమున్కలైనాను.
గులాబి పుట్టి విడిగి విప్పారి
మరురోజే తన మార్దవాన్ని కోల్పోయింది
నాపాదాల కింద గడ్డి పువ్వు!
ఉదయకాలం నన్ను నవ్వుతూ ఆహ్వానించిన గడ్డి పువ్వు

మధ్యాన్నం మార్తాండుని వేడికి
మసియై మాయమైంది.
మరో వందల వేల గడ్డి పూలు....
మరునాటి ఉదయమే పాదాలకింద మెత్తగా నవ్వుతూ
అవి ఇచ్చిన క్షణకాలపు
అనుభూతి విలువ ఎంత?
నీ పరిష్వంగంలో ఆదమరచిన రోజులు
ఒక్క క్షణంలో ఏదోవంతైనా
వాటి విలువ కొలవ తరమా?
నీకు దూరమై నేననుభవించే ఈ వియోగం
ప్రతీక్షణం యుగం, నిజం!

నాకవితా వేశంలో గమనించనే లేదు
ఇందాక కనిపించిన ఎఱ్ఱని సూర్యుడు
ఎటుమాయ మైనట్లు?
మబ్బుల్లో చిక్కుకున్న ఎఱ్ఱటి తన కిరణాల్ని
ఆ దూరపు కొండల వెనుక
ఎప్పుడు పోగు చేసి కొన్నట్లు?
నాకు తెలియకుండా కాలం నడిచి వెళ్ళిందా?

నడవనివ్వక సంకెళ్ళు వేయాలనీ
స్తంభింప జేయాలనీ
ఎందుకీ తాపత్రయం?
ఎందుకీ వృధాయాసం?

కట్టిపెడ్దా మనుకుంటే త్వరత్వరగా జరిగి
గడిపి వేద్దామనుకుంటే భీష్మించుక్కూచుని
ఎందుకీ తాపత్రయం?
ఎందుకీ వృధాయాసం?

కావలసినంత ఖర్చుచేసుకుంటే మాత్రం
తరిగి పోయేదేం కాదుగా....

అనుభవాలతో పండి
అగచాట్లతో నిండి
ఏళ్ళల్లో ఎదిగి
రెప్పపాటు వ్యవధిలో
జీవిత కాలం నడిచి
నేను నేనుగా మిగలక అంతమైతే
మిగిలిందేమిటి?
నీ గుర్తింపేమిటి?

ఎదుగూ బొదుగూ లేక
బయటా లోపలా మార్పేమీ లేక
ఉదయించే సూర్యుడు లేక
అస్తమించే చంద్రుడు లేక
కాలమా నీ గుర్తింపెక్కడ?

క్షణాలు యుగాలుగా సాగి
యుగాలు క్షణాలుగా కుదింపబడి
మనసు చేసే గారడితో
ఆవేదనకి ఆనందానికీ ఏర్పరచుకున్న నిర్వచనంలో తప్పు

ఉదయించే సూర్యుడు లేక
అస్తమించే చంద్రుడు లేక
కాలమా, నీ గుర్తింపెక్కడ?



శ్రీ టి. ఎల్. కాంతారావు

# చెరబండరాజు కవితాస్ఫూర్తి

ఇరవయ్యో శతాబ్దంలో తెలుగు కవిత్వంలో మహా సంచలనాన్ని కలిగించిన మహోద్యమాలు నాలుగు. భావ, అభ్యుదయ, దిగంబర, విప్లవ కవితోద్యమాలు. ప్రక్రియాకు రూపం పునాది, విప్లవానికు భావం పునాది. కవిత్వంలో విప్లవం అంటే కవిత్వ ఇతివృత్తంలో అని అర్థం. వస్తుపరంగా భావకవులకు, అభ్యుదయ కవులకు, దిగంబర కవులకు, విప్లవ కవులకు సారూప్యం లేదు. కవిత్వంలో వస్తువు మారుతున్నప్పుడల్లా కవిత్వరూపం మారటం సర్వ స్వాభావిక లక్షణం. ఏ కవిత్వానికైనా వస్తువే ప్రాణం కాగా రూపం శరీరమవుతుంది. భావకవిత్వ ప్రభావం పూర్తిగా నశించి, అభ్యుదయ కవితోద్యమ ఉధృతం క్రమ క్రమంగా సన్నగిల్లి కనుమరుగవుతున్న కాలంలో, తెలుగు నేలమీద కవితా చైతన్యం దీరి దాపుగా స్తంభించి, యువశక్తి నిర్వీర్యమై, జాతి నిస్తేజమై నిస్తబ్ద ప్రవృత్తిలో కాలం గడుపుతున్న సమయంలో దిగంబర కవితోద్యమం ఆరంభమైంది. దిగంబర కవులు ఆరుగురిలో చెరబండరాజు (బద్దం భాస్కరరెడ్డి) కవిగానూ, వ్యక్తిగానూ ఒక ప్రత్యేక మార్గంలో ప్రస్థానించినవాడు. దిగంబర, విప్లవ కవితోద్యమాల్లో ఉద్యమాలే తానై జీవించిన చెరబండరాజు వచన గేయ కవిగా, జనం పాటల కర్తగా (ప్రజాకవి) ఒక విశిష్ట స్థానాన్ని పొంది ఉన్నాడు. "దిగంబర శకంలో నుంచి విప్లవ కవితా యుగంలోకి ప్రవేశించిన వాళ్ళలో కొద్ది కాలంలోనే ఇంత ఎత్తు ఎదిగిన కవి లేడని ధైర్యంగా చెప్పగలను" అని చేకూరి రామారావు గారు నాలుగు సంవత్సరాల క్రితమే చెప్పి ఉన్నారు.

ఒక కొత్త భావోద్యమం ప్రచలితమవుతున్న కాలంలో రెండు రకాల కవులు కనిపిస్తారు. ఒకరు తమ అస్తిత్వంతో ఉద్యమానికి ఊపిరి పోస్తారు. మరొకరు ఉద్యమ ఊపిరితో తమ అస్తిత్వానికి మెరుగులు దిద్దుకుంటారు. చెరబండరాజు మొదటి రకం కవి. వ్యక్తివాదంతో ఆరంభమైన దిగంబర కవితోద్యమం సమిష్టి వాదంతో సమసి పోవటం తెలుగు కవిత్వ పరిణామ క్రమాన్ని శ్రద్ధగా అధ్యయనంచేసిన వారందరికీ తెలుసు. దిగంబర కవుల మూడు సంకలనాలు సంపూర్ణంగా వచన కవితా ఖండికలే. ఉన్న వ్యవస్థ మీద అసంతృప్తి, ఆ వ్యవస్థను దీనికి ఆలంబనమైన గత సంస్కృతిని మొత్తంగా ధ్వంసం చెయ్యాలనేది అప్పటి పరమాశయం. 'నన్నెక్కనివ్వండి బోను' అనే శీర్షికగల కవితా ఖండికతో దిగంబర కవితా సంకలనం మొదటి భాగంలో పరిచయమవుతాడు చెరబండరాజు. ఈ శీర్షికకు అనంతర కాలంలో అతని జీవితానికి నిడదీయరాని సంబంధం కాకతాళీయం కాదని అతని జీవితమే ఋజువు చేసింది.

> "ఆకలి, కామం, కలలూ, కన్నీళ్ళు,
> మనిషిలోని మర్మజ్ఞానమంతా ఒక్కటే
> దేశ మేదైతేనేం ? మట్టంతా ఒక్కటే
> అమ్మ యెవరైతేనేం? చనుబాల తీపంతా ఒక్కటే".

అనే మానవతా వాదంతో ఆరంభమైంది అతని కవిత్వం. మనిషి మీదా, అతని మంచితనం మీద, ప్రస్తుత వ్యవస్థలో రగులుకుంటున్న తపన మీద విశ్వాసం, మతం మీద, మతాధికారులమీద, దోషికీ నిర్దోషికీ ఒకటే సూత్రాన్ని ప్రయోగించే చట్టాలమీద ఏవగింపు నన్నెక్కనివ్వండి బోనులో కనపడతాయి.

> "మంచి మనసు పరిమళాలు
> విశ్వ వ్యాప్తి కాకపోవు
> భావితరం గుర్తించకపోదు
> జగత్ప్రళయ కావ్యంలో
> తపనాగ్నిజ్వాల పిలుస్తోంది
> అణు వణువునా అగ్ని కణం
> చల్లారక రగులుతోంది
> నన్నెక్కనివ్వండి బోను"

అంటాడు ఈ గేయంలో.

ఈ వ్యవస్థ లోపభూయిష్టమైనది. ఈ రాజకీయాలు, స్త్రీల వర్ణనకే పరిమితమైన కవిత్వం, మనిషిని మనిషే వంచన చేసుకొనే విధానం, ఆశ్రయింపులు, కులాలు, అధికార దాహాలు ఉన్మత్త క్రీడలు ఇత్యాది లక్షణాలతో కంపుకొడుతున్న ఈ వ్యవస్థ మొత్తం సమూలంగా దగ్ధం కావాలనేది ఆయన ఆశయం.

"ఈ మహాపాపంలో
మనమంతా భాగస్థులం
రాగల యుగాల కొఱకు
అణువణువును చిదిమి చిదిమి
చైతన్యాగ్నిజ్వాలా ముఖులమై
చితి పేర్చుదాం రండి"

అని తోటి వారిని ఆహ్వానిస్తూ సాహిత్య, సామాజిక రణ రంగంలోకి ప్రవేశించిన వాడు చెరబండరాజు.

దిగంబర కవిత మూడవ సంకలనంలో కవిగా చెరబండ రాజుకి ఈ సమాజం పట్ల గల అవగాహన మరో మెట్టు పైకి పెరిగింది. మార్పుని ఆశించటమే కాదు మార్పు రావలసిన పద్ధతిని గురించి ఆలోచన ఆరంభం కావటంతో కవికి ఒక దృక్పథం ఏర్పడుతుంది. ఆ దృక్పథానికి పునాది మూడవ సంపుటంలో "వందేమాతరం" గేయం. ఈ సమాజం కుళ్ళిపోవటానికీ, భ్రష్టు పట్టటానికి అనేకమైన అవాంఛనీయ, అసమాన సాంఘిక సంప్రదాయాలకు ఆర్థికం మూలబీజమనేది ఏనాడూ, ఏ ఒక్కడూ విస్మరించరాని విషయం. వందేమాతరం గేయం ఒక పెద్ద సెటైర్. భారతదేశ ఆర్థిక వ్యవస్థ, దానితో పెనవేసుకుపోయిన దారిద్ర్యం, అజ్ఞానం, లంచగొండితనం, రాజకీయ దురహంకారం, నిర్లజ్జ ఈ లక్షణాలన్నిటికీ ప్రతీయమానంగా నిలుస్తుంది ఈ గేయం. దేశంలో ఉన్న ఒకానొక అనిశ్చల, అరాచక ప్రవృత్తికి ఈ ఖండికలోని ప్రతి అక్షరం ప్రత్యక్ష సాక్ష్యం.

"ఓ నా ప్రియమైన మాతృదేశమా
తల్లివి తండ్రివి దైవానివి నీవేనమ్మా
దుండగుల్తో పక్కమీద కులుకుతున్న శీలంనీది
అంతర్జాతీయవిపణిలో అంగాంగం తాకట్టుపెట్టిన అందంనీది
సంన్యాసుల చేతుల్లో మైమరచి నిద్రిస్తున్న యవ్వనం నీది
... .... ...
ఒంటిమీది గుడ్డలతో జెండాలు కుట్టించి
వివస్త్రవై ఊరేగుతున్న ధైర్యం నీది
... .... ....
ఎండిన స్తనాల మీదికి ఎగబడ్డ బిడ్డల్ని
ఓదార్చలేని శోకం నీది
ఆకలికి ఎండి మాడి ఎముకుపోయ్యూలతో పీడినబడ్డ సింగారం నీది
అమ్మా భారతీ! నీ గమ్యం ఏమిటి తల్లీ
వందేమాతరం
వందేమాతరం."

దిగంబర కవితోద్యమం శ్రీశ్రీ షష్టిపూర్తి ఉత్సవాలతోను, హైదరాబాదులో జరిగిన సభలతోనూ విప్లవ కవితోద్యమంగా రూపు దాల్చింది. అభ్యుదయ కవులు ఆదిలో ఆశించిన ఫలితాలు సమాజంలో వాస్తవరూపం దాల్చకపోగా పరిస్థితులు అనాటికంటె మరింత భయంకరంగా రూపుదాల్చాయి. సంస్కరణ, సామరస్య వాదాలకు బూజు పట్టింది. మార్క్స్, లెనిన్, మావో ఆలోచనా విధానం, నక్సల్‌బరీలో జరిగిన పోరాటం తెలుగు కవులకు కొత్త మార్గాన్ని నిర్దేశించటంతోనే విప్లవ రచయితల సంఘం ఏర్పడింది. దిగంబర కవిగా జన్మించిన చెరబండరాజు విప్లవ కవిగా పరిణామం చెందాడు. వర్గ సామరస్యానికి, వర్గపోరాటానికి మధ్యనున్న భేదమే అభ్యుదయ రచయితకు, విప్లవ రచయితకు మధ్యగల భేదంగా కార్యవశించింది. అభ్యుదయ కవితా వాహికగా మాత్రా ఛందస్సులు, వచన కవిత నిలిస్తే విప్లవ కవితా వాహికగా జనంపాట నిలిచింది. దిగంబర కవిత నుంచి విప్లవ కవిత్వానికి ప్రయాణించిన చెరబండ రాజు వచన కవిత నుంచి పాటకు పరిణామం చెందాడు. అతని పాటలో శ్రామిక జన సంగీతం వినిపించటానికి కారణం అతను కేవలం కవిగానే కాక పీడిత జన ప్రియుడుగా మారటం. ఎవరి కోసం అతను కవిత్వం రాస్తున్నాడో వాళ్ళతో అతనికి గల సన్నిహిత సంబంధం అతని కవిత్వంలో జీవనాడిగా స్పందించింది. అతను సాగించిన కవితోద్యమానికి, అతని జీవితానికి ఉన్న అభేదమే విప్లవ సాహిత్య చరిత్రలో అతనొక పేరు శిఖరంగా, సజీవమూర్తిగా నిలగలిగింది. అతని త్యాగశక్తి, అకుంఠిత కార్య దీక్ష, సహజ కవితాధోరణి అతన్ని, అతని రచనను శాశ్వతం చేస్తున్నాయి.

"నాది శ్రామిక జీవన సౌందర్య గీతం
పతనానికి దోపిడీ రథానికి నేను పల్లవిని కాను
బొట్టు బొట్టుగా నా నెత్తుటిని
ఈ నేల విముక్తి కోసం విత్తనంగా చల్లుతాను
బందీనైనా బానిసను కాను
నన్ను కదిపినా ఖండించినా
మళ్ళీ మళ్ళీ అలలా పుట్టుకొస్తూనే వుంటాను"

అనే వజ్ర సంకల్పం చెరబండరాజుది. మార్పుకోసం ఓర్పు, నేర్పేకాదు ప్రాణాలను సైతం అర్పించే త్యాగం చెరబండరాజుది. ప్రపంచ పురోగతి శ్రమ జీవి నెత్తుటి బొట్టులోనే ఉందని గాఢంగా నమ్మిన కవి. ఈ నేలనూ, ఈ గాలినీ, అనుక్షణం పీడింపబడుతున్న మనిషినీ ప్రేమించి, ప్రేమించటం నేర్పిన మహానుభావుడతను.

"ఈ మట్టి నాకు
పట్టెడన్నం పెట్టి పాలు తాపింది
రాక్షస భూస్వామ్య రంపపు కోతల్నుండి
తనను విముక్తి చేసి
రుణం తీర్చుకుంటాను."

అంటూ తానే ఈ జీవితం నుంచి విముక్తం అయ్యాడు. ఆలోచన, అక్షరం, ఆచరణ కలిపి ఏకరూపం దాల్చిన సహజకవి చెరబండ రాజు. అతని ఒక పాట అనుబంధంగా ఇస్తున్నాను.

## కొండలు పగలేసినం

కొండలు పగలేసినం
బండలనూ పిండినం
మా నెత్తురు కంకరగా
ప్రాజెక్టులు గట్టినం
శ్రమ ఎవడిదిరో
సిరి ఎవడిదిరో

బంజర్లను నరికినం
పొలాలనూ దున్నినం
మా చెమటలు ఏరులుగా
పంటలు పండించినం
గింజెవడిదిరో
గంజెవడిదిరో

మగ్గాలను పెట్టినం
పోగు పోగు వడికినం
మా నరాలె దారాలుగ
గుడ్డలెన్నొ నేసినం
ఉడుకెవడిదిరో
వణుకెవడిదిరో

యంత్రాలను తిప్పినం
ఉత్పత్తులు పెంచినం
మా శక్తే విద్యుత్తుగ
ఫ్యాక్టరీలు నడిపినం
మేడెవడిదిరో
గుడిసెవడిదిరో

కారణాలు తెలిపినం
ఆయుధాలు పట్టినం
మా యుద్ధం ఆపకుండ
విప్లవాలు నడిపెదం
చావుమీదిరో
గెలుపు మాదిరో!



# నాగరికతకు పునాది

శ్రీ బండి రాధాక్రిష్ణ

జిలుగు సౌదామినుల,
తళుకు నాట్యాల
పలుకు పరవళ్ళ సోయగాల
పరిభాష నేర్చుకున్న కోయిల
ఆకలి కేకలు వేస్తున్న
కాకి గుంపులోని
సహజీవన సౌభ్రాతృత్వాన్ని
అసహజమూ, అనాగరికమూ
అనుకుందే గాని,
ఇద్దరి రంగూ ఒకటేనని మరిచిపోయింది.

కథాకళి ఒక్కటే
జీవితాదర్శం కావచ్చునేమో కాని,
వేటకు వెళ్ళే జాలరి నృత్యం
చెప్పదా జీవన సత్యం ?

ఆకలితో వేసే కేక
నాదంలా ఉండక పోయినా,
పురిట్లోని పసికందు
ప్రేవుల కుహరాల్లో నుండి
పైకెగసే రోదనా ప్రవాహం,
కాదా నదీనదాల ప్రక్కన వెలసిన
నాగరికతలకు సంకేతం!



# రెక్కలు విప్పుకొన్న మనసు

శ్రీ కలికిరి వి. అబ్దుల్ ఖాదర్

ఊగే
గరికపోచ కొనకు
ఉరేసుకొన్న మంచుబొట్టు –

గొంతెత్తి
కోకిలలు పలికే
సోకిలా సానువుల్లో
నడిచే నల్లమబ్బు –

సూరీడు దొంగలించిన ఉదయంలో
చేతన తాగి
జడలు విప్పుకొన్న జలపాతము –

సంజ పొద్దు
నారింజ రంగు నీళ్ళలో
తల పులుముకొంటున్న తాటిచెట్టు –
దేన్నని అడగను ?

చీకటి చప్పుడించిన
నిరాశా నిస్పృహాలు
పురులు విప్పుకొన్న నిన్నటి నీలిమ నీడల్లో
చెళ్ళున కురిసిన అగ్గి –

హిమానీగాలి తగిలిన
మల్లెలా
ఊహాల కౌగిళిలో
ముద్దుగా ఒదిగిపోయిన గతమంతా
పీడకలై
పెట్టిన పొలికేకా –

అరవిరిసిన కన్నుల్లో
వెలిగిన
ఏకాకి నవ్వు ....
ఘూర్ణిల్లే శోకార్ణవమై విరుచుకుపడినా –

చాంద్రి కావాలని
చక్రడోలై తిరగాలని
పులుగై ఎగరాలని
పలుకై పల్లవించాలని
కలగమై పొంగాలని
కలభమై ఘీంపెట్టాలని
హరిణశాబకమై దూకాలని
హరివిత్తై పురివిప్పాలని
తిలపోస్తోంది, తలపోస్తోందే....
ఇన్నాళ్ళూ లేనిది
ఇవ్వాళ
ఏమైందీ పాడు మనసుకు—
గుండె గొంతుకలో తన్నుకొని
గిటారు వాద్యం మీద
ఆనంద బాష్పాలు మీటే
పాడే మనసుకు, పరిగెత్తే మనసుకు !



డా॥ ఎస్. గంగప్ప

# అన్నమాచార్యుల సంకీర్తనలు రాయలసీమ మాండలిక పద ప్రయోగం★

అన్నమాచార్యుడు ఒక అసామాన్యుడైన మహామనీషి. అత్యుత్తమ భక్తాగ్రేసరుడు. ప్రథమాంధ్ర వాగ్గేయకారసత్తముడు. అందుకే అన్నమాచార్యునికి 'పదకవితా పితామహుడనీ, సంకీర్తనాచార్యుడనీ' బిరుదులు కలగడంలో ఆశ్చర్యంలేదు. ఆ మహానుభావుని మాటల్లో ఆ మాటల మూటలైన పాటల్లో, ఆపాటల కనుగుణమైన ఆటలో సర్వాంగీణంగా, సముచితంగా భక్తిని రంగరించి, రక్తిని మెరపి పాడి, ఆడి తరించాడు; భక్తకోటికి తరుణోపాయాన్ని చూపించాడు. ఆ పద కవితా రచనా రీతిలో భక్తి మార్గోపదేశ పద్ధతిలో ఆ తరువాతి తెలుగు వాగ్గేయ కారులైన క్షేత్రయ్య సారంగపాణి, త్యాగయ్య మొదలైనవారి కెందరికో అన్నమాచార్యుని అడుగు జాడలే గురిజాడలు. "ఈతని శృంగార సంకీర్తనాంశము, మున్నూరేండ్లు తరువాత క్షేత్రయ్యగాను, అధ్యాత్మ సంకీర్తనాంశము అటు తరువాత నూరేండ్లకు త్యాగయ్యగానూ నవతరించెనన జెల్లును"- అని ముక్తకంఠంగా ఏనాడో పేర్కొన్న వేటూరి ప్రభాకరశాస్త్రి గారి మాటలు అక్షరాల సత్యం:

**1.1.** తెలుగు సాహిత్యాన్ని సంస్కృత సాహిత్యమూ, పామర సాహిత్యమూనని స్థూలంగా రెండు విధాలని చెప్పవచ్చు. దీన్నే ప్రౌఢ సాహిత్యమూ, జానపద సాహిత్యమూ అని కూడ పేర్కొనవచ్చు. ఇంతకంటే శిష్ట సాహిత్యమూ, శిష్టేతర సాహిత్యమూనని చెప్పడం సముచితం. తెలుగు సాహిత్య మాగాణంలోని శిష్టేతర కవితా స్రవంతి మూడు పాయలుగా ప్రవహిస్తూ ఉంది. మొదటిది కేవలం జానపదకవిత. దాని పుట్టుక అనాది. రెండోది పాల్కురికి సోమనాథుతో ప్రారంభమైన ద్విపద కవిత. మూడోది అన్నమాచార్యుని వరవాక్కుతో ఆరంభమైన సంకీర్తన కవిత. అన్నమాచార్యుడు భక్తి పరవశుడై ఆడిపాడిన పదాలే ఆధ్యాత్మ శృంగార సంకీర్తనలు తెలుగులో శిష్టకవులు పద్య కవితా పీఠం ప్రక్కనే పద కవితకు సమపీఠం సవదరించి, గౌరవం సంపాదించి పెట్టిన ఘనత తాళ్ళపాక అన్నమాచార్యునికే దక్కింది. ఈతనిసాహిత్యం అనంతం. అదొక మహోదధి. తన సంకీర్తనల్లో వాడుక చేసిన భాషా వైభవాన్ని-ముఖ్యంగా రాయలసీమ మాండలికతను కొండని అద్దంలోలాగా, స్థాలీపులాక న్యాయంగా - చూపించడమే నాయీ పత్ర సమర్పణ పరమ ప్రయోజనం.

## 2.0 కమనీయ కవిత

పండితులను మాత్రమే కాక పామర ప్రజల్ని సైతం రంజింప జేయడం పద కవితల పరమ ప్రయోజనం. సామాన్య ప్రజకు అందుబాటులో ఉండేట్లు, వారి అర్థావగతికి దగ్గరగా ఉండేట్లు సరళమూ, సుబోధమూ అయిన భాషలో పదకవితల రచన సాగడం ఎంతైనా ముదావహం. ఈ విషయంలో అన్నమాచార్యుడు అన్నివిధాలా సఫలీకృతుడైనట్లు అతని సంకీర్తనలే చెబుతాయి.

ఇందుకు చక్కటి ఉదాహరణ :

"విరహ మొక్కించవ మాయ విచ్చేయవయ్యా
నిరతి నాతెర జూచి నీకంటా మొక్కీతివి ॥పల్లవి॥
చెక్కటి చెయ్యే చెలికి శేష పర్యంక మాయ
జక్కవ చన్నులు శంఖ చక్రము లాయ
పుక్కట చెమటే జలధి వునికి సేసుక వున్నది
జక్కని సతిదలని సారూప్య మందె ॥విరహ॥
చలువ కస్తూరి పూత సరినీల వర్ణమాయ
మెలుత సివ్వెర గనిమిషద్రిష్టాయ
తొలుత చిగురు పాన్పు తులసి పూజాయ నిన్ను
జలజాక్షి తలపోసి సారూప్య మందె ॥విరహ॥

★ తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి, అన్నమాచార్య ప్రాజెక్టువారు 1981 మే 18, 19, 20 తేదీలలో ఏర్పాటుచేసిన అన్నమాచార్య జయంతి సందర్భములోని సదస్సులో సమర్పించిన పత్రం.

సిగలు గట్టిన తాళి శ్రీవత్స భావ మాయ
వగుసవలపు భక్తి వత్సలమాయ
యిరవై శ్రీ వేంకటేశ యింతలో నీవు గూడగ
సరసనిన్నింటి నాకె సారూప్య మందె ॥విరహ॥

(శృంగార సంకీర్తనలు XXVI - 191)

ఇందులో కమనీయ కవిత ఉంది. ఆ కవితకు తగినచక్కటి భాష ఉంది. విరహవ్యథా భరిత మనస్క అయిన నాయిక సర్వవిధాలా శ్రీ వేంకటేశ్వరుని లాగానే సారూప్య మందిందట. ఈ విరహం నాయికకు ఒక అందాన్ని చేకూర్చిందట. ఆ సారూప్య మందిన నాయికనే, నాయకుడు శ్రీ వేంకటేశ్వరుడే కాబోలునని చెలులు 'నిరతినాకె జూచి నీవంటా మొక్కెదము' అని 'విచ్చేయవయ్యా' అని ప్రార్థిస్తున్నట్లు చెప్పారు. ఇందులో వ్యంగ్యం, హాస్యం పరిస్ఫుటమై సహృదయ హృదయాల్ని ఆనంద పరవశుల్ని చేస్తాయి. ఇంతేగాదు చెలి చెక్కిలిమీది చేయి శేషపర్యంకమైందనీ, ఇక్కడ చన్నులు శంఖ చక్రాలయ్యాయనీ, చెమట జలధి అయ్యిందనీ ఉత్ప్రేక్షించడంలో ప్రతిభా సంపన్నుడైన మహాకవి కుండవలసిన భావుకత, తన్మూలంగా చమత్కారం గోచరించి మనకానందా కి అవధి లేకుండా చేశాయనడం అత్యుక్తిగాదు. ఇలాగే తక్కిన రెండు చరణాల్లోను. ఇలా వివరిస్తూ వెళ్ళితే ఎంతైనా చెప్పవచ్చు. ఇందలి భాష సరళం. పైగా యిందలి క్రియలు "శేష పరియంకమాయ, శంఖ చక్రము లాయ" అని వ్యావహారిక భాషలోనే ఉండి పుష్టినీ, తుష్టినీ చేకూర్చాయి. 'ఆమెను' అంటే అంతస్ఫూర్తి వచ్చేది కాదని మనకు తెలుసు.

## 3 0 రాయలసీమ మాండలికాలు

ఇంతవరకు అన్నమాచార్యులు తమ సంకీర్తనల్లో వాడుక చేసిన భాషావైభవాన్ని చవిచూశాం మనం. సర్వాంధ్రకవుల్లాగే చక్కటి తెలుగు భాషనే అన్నమాచార్యుడు గ్రహించినా ప్రత్యేకించి అతడు రాయలసీమ కడపమండలంలో పుట్టిపెరిగి టంగుటూరు, పెనుగొండ, విజయనగరం, అహోబిళం మొదలైన చోట్ల తిరిగి చూసి, చివరికి తిరుమలలో శ్రీ వేంకటేశ్వరుని సన్నిధిలోనే నివాసం ఏర్పరచుకొని జీవితాంతం పదరచన చేస్తూ భగవత్కైంకర్యం చేస్తూ వచ్చిన వాడు గనుక అతని భాష ప్రధానంగా రాయలసీమలో ఈనాడూ వాడుకలో ఉంటూ జీవిస్తున్న భాష ఆ మాండలికాల్ని పరిశీలిస్తే ఆనాటి రాయలసీమవే. ఈనాటికీ పెద్ద తేడాలేదనిపిస్తుంది.

3.1 ఈ సందర్భంలో తెలుగు భాషలోని మాండలికాల్ని గూర్చి స్థూలంగా తెలుసుకోవడం అసమంజసమేమీకాదు. తెలుగుగ్రాంథిక భాషలో అట్టే తేడాలు లేకున్నా వ్యావహారిక భాషలో అనేక భేదాలున్నాయి. అందులో ప్రధానంగా మూడు మాండలికాలు అందరకు సుపరిచితమే. అవి రాయలసీమ, తెలంగాణ, కోస్తా ప్రాంతాలకు సంబంధించిన మూడు మాండలికాలు. వీటిలో మళ్ళీ సూక్ష్మంగా పరిశీలిస్తే రాయలసీమలోని చిత్తూరుజిల్లా మాండలికంలో తమిళ ప్రభావమూ, అనంతపురంజిల్లా వారి వాడుకలో కన్నడ భాషా ప్రభావమూ, తెలంగాణాలో ప్రధానంగా ఉర్దూ భాషా ప్రభావమూ, అదిలాబాద్, నిజామాబాద్ జిల్లాలవారి మాటల్లో మరాఠీ భాషా ప్రభావమూ, కళింగాంధ్ర ప్రజల్లో ఒరియా భాషా ప్రభావమూ కనిపిస్తూ ఉంటుంది. కోస్తా జిల్లాలలో కృష్ణా గుంటూరు జిల్లాల వాడుకకూ, ఉభయ గోదావరుల వ్యవహారానికీ, విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలో మాట్లాడే భాషకూ ఉచ్చారణలో, వాడుకలో తేడా లుండడం మనకందరికీ తెలిసిందే. ఈ జిల్లాల్లో సాంస్కృతికంగా, రాజకీయంగా, వ్యాపారరీత్యా భాషలో మహా వేగంతో మార్పు వచ్చింది. రాయలసీమలో ఈ వేగం లేకపోవడం వల్ల పూర్వ పూర్వ రూపాలే నిలిచిపోయి ఈనాడు వినిపిస్తూ ఉంటాయి.

3.2 రాయలసీమలోని వాడుకకు, కోస్తా వ్యవహారానికీ ఈనాటికీ కొన్ని తేడాలున్నాయి. ఇలాగే రాయలసీమ, కోస్తా, తెలంగాణా ప్రాంతాల్లోని వాడుకల్లో తేడాలున్నాయి. ఇందుకు ఎన్ని ఉదాహరణలనైనా చూపించవచ్చు. దీనికి తోడు ఊనిక, ఉచ్చారణ మొదలైన వాటిల్లో యాసల్లో గూడా తేడాలు గోచరించవచ్చు. వీటినే మనం మాండలిక భేదాలంటాము. ఇలాగా రాయలసీమకూ, తదితర ప్రాంతాలకూ, ఉన్నభేదం మనకు స్పష్టమవుతుంది. అంటే అన్నమాచార్యులు రాయలసీమవాసి గనుక అతని సాహిత్యంలో రాయలసీమ మాండలిక పద ప్రయోగం ఎక్కువగా కనిపించడం అసహజమేమీ కాదు.

4.0 అన్నమాచార్య సంకీర్తనల్లోని రాయలసీమ మాండలిక పదజాలాన్నంతటినీ - అధ్యయన సౌలభ్యం కోసం - పదాలు, పదబంధాలు క్రియాపదాలు అని వర్గీకరించడం జరిగింది. వాటిని క్రమంగా పరిశీలిద్దాం.

### 4.1 పదాలు

అడ్డో (అదిగో అన్నపదం అడ్డో అనే ప్రయోగం)

'కొద్దెరిగి నీవుంచితే కోరి గించునాయాపె
అడ్డోనీ వింతలోనె మారలుగగ జెల్లునా' (XXII-269)

అప్పా : [తండ్రిని అప్పఅనడం, గౌరవార్థంలో ప్రయోగించడం రాయలసీమ వాడుక]

'అప్పానే, దొల్లి అజ్ఞానినైనది
తప్పానేటిగావ సంగదానన్ను' (II-II)

అసిమి : (దీన్నే అసిపి అని అంటారు. పొడుగాటి సంచి. నడుమ తెరువడానికి వీలుంటుంది. అటు ఇటు సరుకులు వేసి భుజంమీద వేసుకొని వెళ్ళటానికి వీలుగా ఉంటుంది)

'అమ్మెదొకటియానసిమిలోని దొకటి
య [illegible] నీయందే కంటిమిదివో దిష్టాంతము'

(XXII-327)

ఇల్లటము : (ఇల్లరికం)

'చల్లని చూపుల సతికి వలచిపోయి
యల్లట మున్నవాఁడీతఁడు' XII-296

ఉపద్రవ : (ఉపద్రవం)

'కటకటా నిన్నుంజూచి కడుం జలము లెక్కినను
పతిభక్తి సేయంగ ఉపద్రవ రాదుగదవే' (III-10)

ఎగదిగ : (క్రిందికి పైకి, తత్తరపాటు)

'మొగము జూచేవు మోనానఁద వంచేవు
ఎగదిగ [illegible] పైతేనేర జొచ్చేడి' (XXVI-271)

ఎగసక్కెలు : (ఎగతాళి)

'ఒడమాటో నింతయేల యెగసక్కెలు
వేడుక కాడవు నీవు వేసాలు మానరా (XXVI-246)

ఒడ్డారాలు : (ఒయ్యారాలు, ఏమొడ్డారం చేస్తావే అన్నది ప్రయోగం)

'యీ [illegible] నిన్నల మేల్మంగ తోడఁగూడుకుమునాక
పూడిగపు [illegible]కేల వొడ్డారాలు' (XXIV-170)

ఒబ్బిడిగా : (నిశ్చింతగా, హాయిగా, ప్రత్యేకంగా. ఒబ్బిడిగా అన మరిగింది, [illegible] ఒదిలో కలిసుంటుంటావా ?)

'వొబ్బిడిగా నాయింటనే వుండితేనే మేలవా
గుబ్బల గర్వము [illegible] గూడితే గాక' (XXIV-278)

కణజాలు : (పాతరలు)

అట్టె తలవంచగానే ఆసమాటలాడితివి
నెట్టుకొన్న కణజాల నిండెవలపు (XXIV-235)

కణజాలు పద ప్రయోగం సారంగపాణి సైతం చేసి ఉండడం గమనించ దగ్గ అంశం.

'పద్దతిరో మాకూరా పైరు పచ్చలాయె
కడలేని ధాన్యాల కణజాలాయె'

(సారంగపాణి పదములు-8?)

కిమ్ములు : (కిమ్ముల్లేని రహస్యంగా)

'కిమ్ములు దానన్నీ నెరిగీ ననివున్నడన
యెమ్మెలి తరులవలె నెచ్చరించను' (XXII-220)

కుదువ : (తాకట్టు)

'నాడికె యింతికి కుదువగా నన్నుంచుమనేవు
నేడు వావి విడిపించుకొనవశమా' (III - 631)

కుదువ పదాన్ని వేమన ప్రయోగించాడు.

'అధన భుక్తి చేత మొదటి సొమ్ముకు హాని
కుదువ సొమ్ము కెన్న కొంతహాని
మొదటి [illegible] మూలకర్తకు హాని ॥విశ్వ॥'

(వేమన పద్యాలు; పుట 103, పద్యం 280)

కూరాకు : (అకు కూర)

చెలగి కూరాకుగాఁ జేసేవునీ
తలమీద నుండే [illegible] (XII-194)

గన : (కనుక కాని)

సేసవెట్టిన చెలికి సేసిన వెల్లాసేత
ఆసబుచ్చిన నీవు గన ఆదరించితే (XXV - 256)

గబ్బు : (మాలిన్యము, కల్మషము, కంపు, వక్రిమాలిన)

గక్కున గాఁగలించగా గబ్బిది యనేనంటా
వొక్కటై వోవరిలో నున్నది చెలి' (XXVI - 373)

గులుగు : (గొణుగు)

'కొలదిగా నీవు గోపించుదువా [illegible]
గులుగు రేచకు వోయి గోపించుడా' (XXVI - 3)

జంపు : (బొడపు)

యీ పేళ నిన్నీత దేలె యిచ్చకము శాయవే
పూవుల వేటులాడ జంపుల సిగ్గులేల (XXII - 544)

నిండా : (పూర్తి, ఎక్కువ)

'నీ కొలువు సేసితిమి నిండా, దనిసితిమి
చేకొని నీవారమని చెప్పేపయ్యా' (XXII-194)

నిమ్మలాని : (నిశ్చింతగా)

ఆదరించి శ్రీ వేంకటాధిప నన్నేలితివి
నీదయతో నాపెచూచి నిమ్మలాననుండెను (XXII-45)

పట్నాలు :, (పొట్లాలు)

'చెప్పనేల నీ సుద్దులు చెల్లుబడై వుండఁగాను
కప్పిన పట్నాలువార గందమిత్తురా' (XXVI-485)

పై : (ఒళ్ళు)

'పన్నీరు వసంతాలుపై చారలు చూపిచ్చీ
చెన్నుమీద సాకిరేల చెప్పించీనే' (XXIV-374)

బయకారాలు : (విలాసాలు, మోసాలు, బయకారి - విలాసవతి, మోసగత్తె)

'ఇచ్చట శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నిట్టె
యిచ్చకపు బయకారాలెన్నేసేసేవిపుడు' (XXIV-444)

బిగ్గె : (బిగ్గరగా బిరన, గట్టిగా, ఉచ్చారణ)

'కందువతోఁ జన్నులంటి కడుబిగ్గెఁ గాఁగిలించి
సందడిపర్వములంటి చల్లీ నూర్పులు' (XXIV-489)

ఈ ప్రయోగం సారంగపాణి సైతం చేశాడు.

'చెయ్యితీరదని కొందరు, నేడు
వెయ్యనేరావని కొందరు, బిగ్గె
కుయ్యవద్దు నోరుమూయ్యనుచురాగ
గయ్యాళి పైటికి గదిమి పొమ్మనెకృష్ణా !'
(సారంగపాణి పదములు-19)

మిండు : (మూర్ఖత్వం)

పెలుచైన వానికిఁ బ్రియములు చెప్పితేను
కలుపమిఁగాక సంగతెరుగునా

తలచుకొనీఁ దానే తరినాకిచ్చిన బాస
మలసి పూఁటకుండితే మంకుఁ దేరీనతడు
(XXIV-445)

ఈ ప్రయోగం వేమనలోనూ ఉంది

ఇంటిలోని ధనము యిదినాది యనుచును
మంటిలోన దాచు మంకుజీవి ;
కొంచుబోడు వెంట గుల్లకాసును రాదు ॥విశ్వ॥
(వేమన పద్యాలు - పు. 22, ప. 148)

మలిగండ్లు : (అలిగండ్లు, మలిగండ్లు)

తాలు దింటా మలిగండ్లాడి రాసిగా నేరేము
తేలుచు శ్రీహరి నీవే దిక్కౌటగాక (X-61)

ఈ ప్రయోగం వేమనలోనూ ఉంది

అలయచేసి మంచియడిగెండ్లు మలిగెండ్లు
తిరిపె మిడెడు కటిక దేబెలెల్ల
నెలమిమన్ను దినెడు నెఱలౌదురు సుమీ ॥విశ్వ॥
(వేమన పద్యాలు-పు. 135, ప. 34)

మోపు : (అధికము, ఎక్కువ)

'ఎగసక్కెపు వలపెందాకా
మొగమోటములే మోపానాకు' (XXII 400)

యేతువులు : (యాతువు లెత్తి మాటాడాల్నా-అంటే హేతువుఁనే అర్థంలో ఈనాడు ప్రయోగంలో ఉంది)

'సులసి యేతువులెత్తు మాటలాడవలెనా
వలచినన్నుఁ బాయకపసమైన వానికి' (XXV-321)

సంతము : (సొంతము)

'చక్కని శ్రీ వేంకటేశ సంతమయితివప్పుడే
వెక్కసాలు మానితేను వెంగెమాడ నిన్నును'
(XXVI-202)

సరకా : (సరదా, తమాషా)

'ఎచ్చరించెదననిన యీ జగంబనగాను
సచ్చరిత్రుడ నీకు సరకావో' (XII-314)

సవరేతిరి : (నవరాత్రి)

శ్రావణ బహుళాష్టమి సవరేతిరి కాడను
ఆవేళ రోహిణి మంచిదైన పొద్దానట

కావింప మేనమామకు గండమాట యీతఁడే
దేవరఁట రాపలెల్లా దిక్కులఁ జెప్పిరి (XXIV-27)

సోలిగా : (వరుసగా)

'ఏలసిగ్గువదేవు యెదుటకి రాఁగదవే
సోలిగా నీ సింగారాలు చూచుఁగాని యీతడు'
(XXIV-290)

## 4.2 పదబంధాలు

ఆపసోపము : (కష్టం లేకున్నా అలసినట్లుండడం)

'ఆపసోపమున నీవు అందుండి వచ్చినవేళ
ఆపె నీతో నవ్వినది అరుదుగాదా' (XXII-198)

ఏ పొద్దు : (ఏ దినం)

'నీ దేవియైన లక్ష్మి నిచ్చ సంపదలు నిండె
ఆదియై శ్రీ వేంకటేశ ఆకె నీ పురాన నిండె
పోదిమై నీవివి యెల్లా భోగించేదే పొద్దో' (IX-127)

ఉద్దువుద్దులై (జతలు జతలై)

బద్ధిలేని బుద్ధితోడ పొందుచేసుకొనవట్టి
యెద్దుబంపి కింటె నంది సింగేము
నిద్దురతో తెలిపంట నీడలోని యండంట
వుద్దు వుద్దులై లేని వొద్దికసున్నాము (II-74)

ఈ ప్రయోగం వేమనలోనూ ఉంది.

'కనక గ్రామమునకు కారణ కర్తలి
ట్లండయగుచు నుభయులుండిరేని
గండ పక్షి యుగళముండిన రీతిని
యుద్దిగూడి బ్రతుకుచుంద్రు వేమ'
(వేమన పద్యాలు, పు 140 - ప 67)

ఎగదిగ : (ఎదురు మదురుగా - పెరుకు పెరుకుగా)

ఇత్తల నదియునుగాక ఎగదిగనాటవి జూచుచు
చిత్తణి గుణముల చెక్కులు చెమరించే వేమే
(XXII-331)

కడ్డాయపు పొందులు : (కడ్డాయము-షరతు-కండిషన్)

ఇంత కడ్డాయపు పొందులేల మాకు
యెంతేసి వారలు నీకు నెదురు చూచేరో (XXII-396)

గుజగుజలు : (గుసగుసలు)

ఏటికి మీగుజగుజ లెరుగరాదు
తేట పరచగ రాజా దిద్దేము తగవు (XXIV-321)

నెల్లిచెట్లు : (ఉసిరిక చెట్లు)

పెళ్ళి చెట్టు పందుగాదు పెద్దకొండ లెక్కి తెచ్చే
నెల్లి చెట్టు చవిగాక నే మేల నీకు (XXV-435)

నేరుపో నెయ్యమో : (అది నేరుపో, లేక ప్రేమో)

నేరుపో నెయ్యమో నన్ను మన్నించి పురమునమోచె
తారుకాణించగరాదు తనకింక బోదు (XXVI-220)

మంకోమరులో :

మంకోమరులో మదమో ముదమో
జంకో లంకో జగడమో
శంక లేక నను సరిగనం గూడితి
వేంకటగిరి గోవిందుడా (III-77)

మనసురానిదియాల : (ఇష్టపడనిదెందుకు)

మనసురానిదియాల మానగరాదా
చనవిచ్చి నాకు వేరే సతుల దేవలెనా (XXVI-122)

మయికిముయామె: (సరికి సరియయ్యె, కానుకలిచ్చిన వారికిసమంగా
కానుకలివ్వడం ముయ్యకి ముయ్య)

మయికిముయామెనిదె ముచ్చట లిద్దరికిని
నయముల మాయెదకు నవ్వులేమి నవ్వము
(III-203)

కన్నడ భాషలో పురందరదాసు ప్రయోగముంది.

(ముయ్యగె ముయ్యాయితు !)

మూసిన దాపిరములు (రహస్యాలు) :

మూసి దాపిరములేల యిందరికి రాగదవే
సేసపాల వెంటనే చిమ్మిరేఁగె వలపు (XXV-182)

శేనాశేనాలు : (శానాశానాలు-చాలా చాలా)

చెంతల మొక్కేటివారు శేనాశేనాలుండగాను
దొంతిగాఁ బైనొరగేవు దొడ్డతనమునాదా
(XXII-240)

ఈ ప్రయోగం సారంగపాణిలోనూ ఉంది

గంధమేల పూలు గలపు అక్కడశానా (136)

సూడోపాడో, (సిగ్గోలజ్జో సూడూ పాడూలేనోడు)

పాడుతాఁ బరాకైతేఁ బదాలలో ముద్ర చూపీ
గోడచూచిన చిత్తరు కూటములోఁ బొడచూడీ
సూడో పాడోతనకు సొరిదినన్నింత సేయ
యీడా నుండదు చూడనింటనే వున్నాడు (XXVI-220)

## 4.3 క్రియాపదాలు

ఆయనాయ : అయితే అయింది

ఆయనాయ నూరకుండు మంతేచాలు
పోయయి సన్నసైతేఁ జప్పసెయ్యానికను (XXV-530)

అయలే : (వ్యంగ్యంగా అనడం)

పాయము నీకు మీఁదెత్తి సవతి వుండఁగనీవు
చాయ సేసుకొని యంత జాణవైతివి
అయలే బిరుదు బంటవై మెరిసిన దెల్ల
రాయడి యింతుల కింత రవ్వసేసేదా (XXII-134)

ఉండబట్టదా : (ఊరకే వుండలేకనా)

వుండబట్టదా తనకు నూడిగము సేయఁగాను
చండిపట్టి వ్రాసి వ్రాసే చన్నులమీద (XXV-228)

ఎకబోసి : (ఎగబోసు చాడీలు చెప్పి)

చాయలునే యెకబోసి నన్నలు నింటిసేసి
యేమోకుఁ బోసీవు ఇంతకంటేనేమే (XXV-368)

ఎగ్గెరగక : (అనుమతిలేక, అయిష్టంలేక)

సిగ్గిరిపెండ్లికొడుకు చెలుల ముందర నెల్లా
మెగ్గెఁరగక మెపసీదివో యపుడు (XXIV-73)

ఎగ్గు ప్రయోగం వేమనలోనూ ఉంది.

వెల్ల కుక్కల యెంగిలి విశదమాయె
పసుచువేశ్యల యెంగిలి ప్రాప్తమాయె
చెరుగు యెంగిలి యెంతయు శ్రేష్ఠమాయె
యిష్టమగు వారి యెంగిలి యెగ్గువేమ
(వేమనపద్యాలు - పు. 128, ప. 449)

'ఎగ్గులేనోడు' అన్నట్లు వ్యస్తంగా రాయలసీమలోని ప్రయోగం. కానీ సమస్త పదంగా సిగ్గు ఎగ్గు అని అన్ని చోట్లా వుంది.

ఏకారేవు : (మిక్కిలి ఆశపడి దానికై ప్రయత్నించడం)

చెలువైతే జూలునట్టి బేరియెంత వడియైనా
మలసి మలసి నీవు మాటలాడేవు
కొలది మీరినట్టి కుచములు గంపేచాలు
యెలమి నూరకియైనా యేకారేవు (XXV-39)

కుప్పిళించి : (కుప్పించి, ఎగిరి)

కొప్పు చక్కబెట్టు కొంటా కొలుపులు సేసుకొంటా
నెప్పునఁ జన్నులనొత్తి నెలఁతనిన్ను
ఫుప్పతిల్లుఁ గళలతో నుడివోని జవ్వనాన
కుప్పిళించి వలపులు గురిసీ నీయెదుట (XXIV-30)

కూడిమాడి వుండేది : (కలసి మెలసి వుండేది)

వేడుక మాటలెన్నైనా వేవేలు నాడగవచ్చు
కూడిమాడి వుండేది గుఱుతుగాని (XXIV-217)

కూడుకొందుగా (కలుసుకొని, తనదిగా చేసుకొను)

వల్లెగా విటుండనై రేపల్లెలో నుండేవాడు
గొల్లెతనయినా నిన్ను కూడుకొందుగా (II-12)

కేకరించీని (కొంక్రించి?)

వెయ నీతో నేసు వేడుకకు నవ్వగాను
నలినాక్షి యెవ్వతో సన్నలు సేసీని
నిలిచి నీవు నాతో నెయ్యములు చూపగాను
కెలనను ండి తాను కేకరించీని (XXIV-563)

కోకో : (తీసుకొమ్ము)

కోకలేల తీసితివి గోవిందుడా ; నీకుఁ
గోకో ఇదిచో మొక్కు గోవిందుడా (XXVI-3)

కోవయ్యా : (తీసుకోవయ్యా)

కొంచెపు వెన్నెల లివి కోవయ్యా కానికె
మంచి మొల్ల మొగుడుల మాటు నాఁ చాయనివి
(XII-75)

గునిసీని : (ఎగిరీని, గెంతీని, మిడిసిపడీని)

నసుపున నాతో నవ్వులు నవ్వితివంటా
గునిసీ నాపె నిన్నుఁగొంచి కొంచి

చనవరి వినోదాల సరసురాలన్నిటాను
వౌనరా నాపెతో నవ్వి వుండవయ్యా నీవు
(XXV-43)

చేసుకుండేది : (చేసుకొనేది)

అవుర రమణుఁడెంత యగ్గలీకఁదిరిగినా
చవిసేసుకుండేది సకియ (XXIV-368)

చొకళించి : (కుప్పించి)

సందడి లోపలనే సంగడిఁదేరులు నిల్పి
కందువతోఁ జొకళించి కౌఁగలించేను (XXIV-138)

దావతిపడి : (అదుర్దాపడి, దావంతంపడి)

దేవదానవులు ధీరతను
దావతిపడి వార్థిఁదరువగను
శ్రీ వనితామణిఁ జెలఁగిఁబెండ్లాడిన
శ్రీ వేంకటగిరి శ్రీనిధికి (XII-18)

దొబ్బేవు : (తోసేవు, నెట్టేవు)

సిగ్గుతో నుండానసనంటా శ్రీ వెంకటేశ్వరుఁడెచ్చి
దగ్గరించిపై దొబ్బేవు తతిగానవే (XXII-91)

పంగించు : (ఎత్తిపొడుచు)

చేతులు చాఁచి చాఁచి చేరి నీతో వాదడచి
ఆ తలఁపంగించితిగా అయ్యో నిన్ను
నీతిలేని యింకు దాన నీవు చెప్పిన పనులు
తోతోయు నీ పాదములఁదోసితి గా నేను (XXII-120)

పుడిరేవు : (తడిపేవు)

పసిన నన్నుఁబెట్టుక చన్నులెంత పుడికేవు
గరిమి నీ మన్ననలు గైకొం నయ్యా (XXIV-75)

పూచుక : (తనదే అన్నట్లు పట్టించుకొని)

పోటి చెలికత్తె గాన పూచుకనే మాటాడితి
ఆటది గోలఁమైతే నట్టే మొత్తుదురా (XXII-554)

పొద్దుపోద : (పనిలేక కాలం గడవదా)

పోదోయింకా నేటికి పొద్దుపోదా
పైపైనీకు మొక్కేము పదివేలు వచ్చెను (XXII-201)

మల్లాడు : (తిరుగాడు)

తగుమోహసలీలంబు దాటమతి లేదుగన
మగుడంబడి భవనముతో మల్లాడవలసె (II-210)

మాగిన : (పండిన)

కాఁగలించితివా లెదో కాంతనల్ల నాడునీవు
కాఁగలించితి నేడు కమ్మటి నిన్ను
పీఁగక శ్రీ వేంకటేశ వేమారు సాధించనోప
మాఁగిన రతుఁ బెను మాయలింకేలా (XXVI-98)

మొరిగేవు : (బొంకేవు, అబద్ధమాడేవు)

ఇంతిపాదములత్తుక యిదివా నీకునంట
యింతలోనె మొరిగేవు యిదివొమాటా (III-508)

వక్కలాయ : (ముక్కలాయె)

వెక్కసపు గుబ్బలపై వేసిన కస్తురమెల్ల
నొక్కమాటే నీరాయనోయమ్మా
మిక్కుటమైన దీని మేనిమీద లెక్కచూచి
వక్కలాయె గుండె యిట్టి వలపెందుగలదా
(XII-328)

వేసటకోపలదు : (యాసిరికోవద్దు - అసహ్యించుకోవద్దు)

వేసటకోవలదు విభుడెలయించితేను
ఆసలేచి యిచ్చేము లాడుటగాని (XXII-442)

సంచకారిచ్చితిని : (బయానా యిచ్చితిని)

దొరవు నీవు నేను దోసిటి పాలదానను
సరిలక్షకు నా మొక్కు సంచకారిచ్చితిని (XXII-292)

సదరమైతినా : (సదరమైతినా, పలచనైతినా, తేలికైతినా)*

కొంతకోక నల్లనైతే గొరుపడము సవేవు (?)
అంత నేను సదరమైతినా నీకు
పంతగాడవటి యా కంబళి నీవు ధరియించి
అంతనింత నుండి యాల ఆవులిగాచితివి (XII-152)

పై పరిశీలనవల్ల అన్నమాచార్యుని సంకీర్తనల్లోని రాయలసీమ మాండలిక పదజాలం దాని స్వరూప స్వభావాలు సూక్ష్మాతి సూక్ష్మమైన అర్థ భేదాలు మొదలైన అంశాలన్నీ మనకు స్పష్టమవుతాయి.

ఇది కేవలం అన్నమాచార్యుని సంకీర్తనల్లోని రాయలసీమ మాండలిక పద ప్రయోగానికి సంబంధించిన దిఙ్మాత్ర పరిదర్శన మాత్రమే. ఇంకా లోతుగా పరిశీలించి సూక్ష్మాతి సూక్ష్మమైన అన్నమాచార్యుని భాషారీతుల్ని ప్రత్యేకించి అన్నమాచార్యుని రాయలసీమ మాండలిక పద ప్రయోగాన్ని గూర్చి పరిశోధన చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది. దానివల్ల అన్నమాచార్యుని హృదయావిష్కరణకు సంబంధించిన తీరు తెన్నుల్ని స్పష్టం చేయడమేగాక కొంతవరకైనా మనం ఋణ విముక్తులం కాగలమని భావిస్తాను. అందుకై పరిశోధకులు ప్రయత్నిస్తారని, వారికితోధిక సాయం తిరుమల తిరుపతి దేవస్థానంవారు చేస్తారనీ ఆశిస్తున్నాను.



# ఈ భూమిలో...!

## శ్రీ భగ్వాన్

ఒక పురుషునికి
పాదధూళి సోకినంతనే
రాతి నాతిగ మారిన ఈ భూమిలో
ఎన్నో కన్నీటి బిందువులు
తాకినా సరే
కరగని హృదయ పాషాణా లున్నవెందుకో.

కొన్ని కోతులు కలసి
సముద్రానికే వారధి కట్టిన ఈ భూమిలో
ఎందరో మానవులు
తమ కష్టాల సముద్రానికి
అడ్డు కట్టుకోలేకపోతున్నారెందువల్లనో.

చిన్ని బాలుడు
ధైర్యంగా
రక్కసి మూకల చెండాడిన ఈ భూమిలో
చాల మంది
చిన్న అన్యాయాన్ని కూడ
ఎదిరించలేకపోతున్నా రెందుచేతనో.

దేవుడుగా కొలువబడిన
రాముడే
శబరి ఎంగిలి తిన్న ఈ భూమిలో
అంటరాని వారంటూ
కొందరు
దూరంగా నెట్టబడినా రెందుకనో....!



శ్రీ మానేపల్లి సత్యనారాయణ

# నిప్పుపుల్ల కాదు, విద్యుద్దీపం

"ఎవరయ్యా మీరు ?
నిప్పుపుల్ల వెలిగించి
విద్యుద్దీపమంటున్నవారు ?"

— ఇవి కుందుర్తి వాక్యాలు, నాకు గుర్తున్నంతలో.

కుందుర్తి నిస్సందేహంగా విద్యుద్దీపమే. మరి నిప్పుపుల్ల వెలిగిస్తున్నవారెవరు ? వారిని ఎవరయ్యా ఎవరుమీరని కుందుర్తి ఎందుకు నిలదీస్తున్నట్టు ? ఇవన్నీ ఆలోచించుకోవలసిన ప్రశ్నలే.

* * * *

తెలుగులో వచన కవిత ముందుగా ఎవరు రాశారన్నది ఒక విధంగా పనికిమాలిన ప్రశ్న (త్రివ్యకాల దృష్టిలో తప్పనిసరి ప్రశ్న) కావొచ్చు. ఆ సందర్భంలో పురిపండా (వీణలోని 'గదబ కన్య'), శిష్టా ఉమామహేశం, శ్రీరంగం నారాయణబాబు — వగైరా పేర్లు తగుల్తాయి. నారాయణబాబు పేరు పూర్తిగా మినహాయించవచ్చు. ఇంతకూ "ముందు రాయడం ముఖ్యంకాదు. ముందుకు వెళ్ళడం ముఖ్యం."1 కుందుర్తి నిస్సందేహంగా ముందుకు వెళ్ళినకవి. ఎవరికంటె కూడా ఎక్కువగా ముందుకు వెళ్ళినకవి. నయాగరా వలె దూకినకవి.

వచన కవితపై ఇటీవల పత్రికల్లో చెప్పుకోదగిన చర్చ సాగుతున్నది.2 వచనకవిత ఆలోచనాపరులైన అక్షరాస్యులది అనేది నిర్వివాదాంశం. వచనకవితకు సైతం ఛందస్సు (పరిమాణం, వాక్యాల పరిమితి వగైరా) ముఖ్యం అని నమ్మి, వాదించి చివరి క్షణం వరకూ మాట తిరగని కవి కుందుర్తి. వచన కవితలో ఒక సమగ్ర కావ్యమే రావాలన్నది ఆయన ఆకాంక్ష. మిత్రులిద్దరితో కలిసి (1940లలో) 'నయాగరం'పడం ప్రారంభించి, తెలంగాణా, ఆశ, యుగేయుగే, నాలోని నాదాలు, నగరంలో వాన.... మాత్రమే కాదు — చనిపోయే ముందు కాలంలో పుంఖాను పుంఖాలుగా రచించిన కవితల వరకూ ఆయన ఆకాంక్షకు అనురూపాలే.

## కుందుర్తి మార్గము

కవితా రచనలో వారిమార్గము గురించి చెప్పడం కంటె, వారి వాక్యాల్నే ఉదహరించడం మేలు.

"కవికీ ప్రజలకూ మధ్య ఒక యినుప తెర వుంది. పూర్వ కవితలో యీ తెర సంస్కృత సమాస బాహుళ్యము చేతనూ, కవులూ, పండితులూ, యితర సాహిత్య వేత్తలతో కూడిన ఒక అల్ప సంఖ్యాక వర్గము మాత్రమే శ్రమపడి తెలుసుకోదగిన భావ ప్రాబల్యము చేతనూ, తత్కాల ప్రజలకు ఎంతమాత్రమక్కరలేని, అందువలన రుచించని విషయ సంపద చేతనూ నిర్మించబడి వుండేది. ఈ తెరను బ్రద్దలుకొట్టడానికే నవీన యుగంలో ప్రయత్నాలు, ప్రయోగాలు జరిగినవి; జరుగుతూ వున్నవి. ఎవరు ఒప్పుకోకపోయినా నవ్య కవితా విప్లవ మార్గ ముద్దేశించిన పరమ ప్రయోజనము మాత్రమిదే. దీనిని గ్రహించలేని కొందరు నవ యువకులు అయోమయము, అస్పష్టత, పరభాషా పదాడంబరము, మార్మికవాద లక్షణములు, వ్యక్తివాద విజృంభణము, వస్తువైవిధ్య లోపము — యీ గుణము లన్నింటిని తనలో చక్కగా యిముడ్చుకో గలిగిన ఆత్మాశ్రయ కవితా విధానము మొదలగు వాటితో తమకూ ప్రజలకూ మధ్య మరొక ఉక్కు తెరను నిర్మించు కున్నారు. ఇటువంటి అవలక్షణాలు ఆధునిక కవితకు వుండకూడ దనేదే నామతము. ఇలియట్ ఇలా రాశాడు, డిలాన్ థామస్ యిలా రాశాడూ అంటే నేను ఒప్పుకోను."3

కుందుర్తి ఏనాడూ "నేను వ్రాసిన దానిలో పూర్వార్థము నిక్షిప్తమై యున్నది; తెలియనివాడు మూర్ఖు"అని సిద్ధాంతము చెయ్యలేదు. సర్రియలిజం, సింబాలిజం, ఎగ్జిస్టెన్షియలిజం, దాదాయిజం—మొదలైన పాశ్చాత్య కవితోద్యమాలపట్ల వ్యామోహాన్ని పెంచుకోలేదు.4

కుందుర్తి — వైశ్వనాథ సాత్యనారాయణీయం వంటబట్టించుకున్నవారే. కానీ అక్కడ ఆగిపోలేదు. దయచేసి ఈ పద్యాలు గమనించండి !

"స్వామి ! నీ రథము ప్రట్టి విశ్వాసహీను
గృహము ముంగిట నేల యాగినదో కాని

ఈ యెడద పూర్వజన్మ సంస్కృతుల జలలు
పొంగినవి తేరునకు వారు పోసినట్లు"
(నీ రథము - అనే కవిత నుండి)

ప్రాకవి వల్లులై తెనుగుపల్లెలు తల్లులుగా ననంత సం
ఖ్యాకములైన జానపదగాన, మనోహర నృత్య, నాటక
ప్రాకృతరూపములన్ గలవాని యెదల్ సహజప్రభూత గం
ధాకృతులా మహా ప్రతిభయంతయు మీకు లభింపనెంచెదన్
('సప్తవర్ణాలు' అనే కవిత నుండి)

పై రెండు పద్యాలూ ఆరంభదశలో వ్రాసినవి కావు. ఆ తరువాత వ్రాసినవే. కొంత పరిణత దశకు చేరుకున్నాక-

"బడిలో చెప్పని చదువు బ్రతుకుతూ బాధతో నేర్చి
బాధ అని అదిలో అనుకున్నది బ్రహ్మానందపదంగా తోచి
చేసుకుంటే పూలబాటే జీవితమని చాటే పని
ఎండిపోయిన మెదడు వనిలో తెలివిమొక్కలు నాటేపని
ఎవరు పెట్టింది నాకీ భారం?"
('ఈభారం' అనే కవిత నుండి)

——వంటి కవితలు రాస్తున్న రోజుల్లో రాసినవే.

కాని రాను రానూ పదనుతేరి, కవితా రీతుల్లోనూ, పద ప్రయోగాల్లోనూ సంప్రదాయ ఛాందసాన్ని ఛేదించుకుని, మరణించే ముందు సంవత్సరాల్లో మరింత మహత్తరమైన కవిత రచించాడు.

## ఇటీవలి రచనలు

'కుందుర్తి కృతులు' అనే బృహద్గ్రంథం మాత్రమే చదివి, ఇటీవల ఆయన రచించిన కవితలు చదవని వారికోసం, రెండే రెండు కవితల్ని ఉదహరిస్తాను.

## పార్టీ ఫిరాయింపు

అభ్యుదయ కవితా సామగ్రిలో చేర్తానని
అప్లికేషన్ పెట్టుకుంది మేఘం
అవవాళ్ళ కొప్పు గుర్తు పార్టీతో వదులుకుంది పొత్తు
కొంతామణుల కబరీభరాలకు ఉపమానంగా వుండనంది
ఫిరాయింపు దారనే పేరొచ్చినా సరే భరిస్తుందట
ప్రజాసేవే తన ధ్యేయమని
పత్రికలో పెద్ద ప్రకటన జారీ చేసింది

సరే సంబరమే! ప్రతిపక్షీ కూసేది యిదేలే కూత
కొమ్మమీదనుంచి యింకో కొమ్మమీదికి గంతేస్తూ
విన్నాను ఎన్నోసార్లు ఈ కూతలు
అన్నాడు మొగం తిప్పుకుంటూ, నిర్మాగమాటంగా

కట్టతెగిన చెరువులై కారాయి మేఘం కళ్ళు
ఒళ్ళంతా ముచ్చెమటలు పోసి తడిబట్ట ఆరేసినట్లైంది
నింగికీకాక, నేలకూ కాక
రెంటికీ చెడిన రేవడైనట్లు బెంగతో బెంసేలు పడింది.

అన్యాయంమీద ధ్వజమెత్తడం అసత్కృతి చూడడం మానని
నల్ల జెండామీద ఎర్రటి నక్షత్రం గుర్తు మాది
కొండశిఖరాలైనా ఢీకొని ఘోరంగా పోరాడవలసిందే
అడవుల్లో అగ్గిలలి ఉలితైనా అగ్నిధారలు కురిపించాల్సిందే

నువ్వుంటావా మా జెంటాగా
సూర్యుణ్ణి ఒప్పించి నీమీద చుక్కగా నిలబెట్టుకుంటాం
అన్నారు దాని మొగంలోకి చూపు సూదులు గుచ్చుతూ
విన్నాను దానిగుండెలో పిడుగుపడి పేలిన ఫెళఫెళధ్వనులు

పదవిలేని ప్రజాసేవ పనికిమాలిన దన్నారు పెద్దలంటూ
పెదవ్విరిచి తుర్రుమని ఎగిరి పోయింది మేఘం....

—— ఇలా సాగుతుంది కవిత.

(ఆంధ్రజ్యోతి వారపత్రిక 29-3-82)

దీని తరువాత వెలువడిన మరో కవిత చూడండి.

## గూఢచారి

"నింగిలోకి నేను విసిరిన గూఢచారి ఉపగ్రహానివి నువ్వు
ప్రతి గంటకూ ఓ మబ్బూ! భూమిని ఒకసారి చుట్టి
పంపుతూవుండు నాకక్కడి పరిస్థితుల చిత్రాలు

ప్రేమ పేరుతో ఎవరెవరింకా కాము కవిత్వాలు రాస్తున్నారో
కనిపెట్టి వుండు

పద చిత్రాల కవితా భ్రాంతిలో ప్రజల్ని పట్టించుకోనివారిని
ప్రతి నిముషం పాపంచేస్తూ భక్తి కవితలు రాసేవారిని
పాలకుల్ని పొగడడం పనిగా పదవులు
స్థిరపరుచుకుంటున్న వారిని

రాసిన ప్రతికావ్యం డబ్బు కక్కుర్తికి
అరసికులకు అమ్ముకుంటున్న వారిని

అందరికీ ఫొటోలుతీసి అర్జంటుగా నాకు పంపుతూ వుండు

కోట్లాది పేదల బాధల భారాన్ని
కొలిచి చూపేదిగదా నా కవిత
ఒకపూట వస్తుంది పండిన వాన.
ఓదార్చేదిగదా నా కవిత
అడివిలో అజ్ఞాత వీరుల ఒర్మల
అసలు కారణం గదా నా కవిత —

నా కవితకు వస్తువు కావాలి
అన్నిచోట్ల ఫొటోలు తీసి అర్జంటుగా పంపుతూ వుండు-
ఇక్కడి కంట్రోలు రూముకు — నా మనస్సుకు.

ఇది ఆంధ్రజ్యోతి వారపత్రిక 27-8-82 సంచికలో ప్రచురించబడింది. ఈ కవితల గురించి ఒక వాక్యంలో చెప్పాలంటే- మబ్బు, వాన అనే ప్రతీకల్ని సమకాలిక సమస్యల చిత్రణకు, విశ్లేషణకూ కుందుర్తికంటె ప్రతిభావంతంగా తెలుగు సాహిత్యం మొత్తంలో మరి ఏ ఇతర కవీ ఉపయోగించలేదు అని చెప్పాలి. ఇతర భారతీయ భాషల్లోనూ, ప్రపంచ భాషల్లోనూ ఎవరెవరు ఈ ప్రతీకల్ని ఎలా ఉపయోగించారూ అన్నది నిజంగా పరిశోధించ దగిన గొప్ప అంశం.

ప్రతిభ, క్లుప్తత పోటీ పడుతున్న రోజులివి. మినీకవిత, వాక్య కవిత, పదకవిత, అక్షరకవిత — వగైరాది ప్రయోగాలు జరుగుతున్న రోజులివి. "ప్రయోగాలు చేయడం మరేమీ పనిలేక కాదు. (కొత్తను సృష్టించడానికి కోతివలె చిందులు త్రొక్కనవసరంలేదు." (కుందుర్తి మాటలు)[5] నిప్పుపుల్ల వెలిగించి విద్యుద్దీపమనే గార్ని కుందుర్తి ఏనాడూ హర్షించలేదు. గర్హించారు. తాను మాత్రం చివరి క్షణం వరకూ విద్యుద్దీపంవలె భాసించారు. భాసిస్తూనే వుంటారు.

## చిట్టచివరిగా ఒకటి రెండు విషయాలు

1976లో మూడు 'V' లు అనే పేర విజయనగరం, విశాఖపట్నం, విజయవాడలపై సుధ-మాసపత్రిక (విశాఖ నుండి కొద్ది నెలలు వెలువడి ఆగిపోయింది) లో నా కవిత ప్రచురించబడగా తానూ, సోమసుందర్‌గారూ చూసి ఇది మంచి నగర కవిత అని మెచ్చుకున్నారట. (ఆ మాట సోమసుందర్ నాకు రాశారు) ఎక్కడ మంచి వచన కవిత వచ్చినా మెచ్చే ఆయన తత్త్వంతో నాకు మొదటిసారి పరిచయం అయింది.

ఫ్రీ వెర్స్‌లో ఆయన స్థానం ఎప్పుడూ ఫ్రంట్‌నే. ఎన్నెన్నో ఉత్తమ వచన కవితా గ్రంథాలకు ఆయన బహుమతులిచ్చి ప్రోత్సహించారు. వచన కవితలో కథకు ఆయన ఇచ్చిన స్ఫూర్తి ప్రధానమైనది.

అన్న నగ్నమునితో కలిసి వారిని రెండుసార్లు కలిశాను. చాలా నిరాడంబరమైన వ్యక్తి. నిగర్వమైన వ్యక్తి. సినీమాకు పెసీ నుంచి వచ్చిన 'ఆఫర్'ను ఎలా వదిలేసిందీ చెప్పారు. నేను సంకలిస్తున్న 'అవగాహన'కు వారిని రచన లివ్వవలసిందిగా కోరాను. అలాగే ఇస్తానన్నారు. ఇటీవల అవగాహన (5) కవితా ప్రత్యేక సంచికను (చెరబండరాజుకు అంకితం) వెలువరిస్తున్న సందర్భంలో వారికి ఉత్తరం రాశాను. తనకు అస్వస్థతగా ఉన్నట్టురాసి — "ఎక్స్ - రే"పత్రిక వారి ద్వారా - చెరబండరాజుపై చక్కని వ్యాసం పంపించారు. ఆయన వ్యాసాన్ని అచ్చువేసిన చేత్తోనే ఆయన షష్టిపూర్తికి సంబంధించిన ప్రకటన వేసిన చేత్తోనే, అవగాహన-5 అట్ట లోపలి పేజీలో ఆఖరి క్షణంలో (25-10-82 మధ్యాహ్నం) ఆయన మృతికి సంతాపప్రకటన వేయించాను.[6] నాకే కాదు, వచన కవితాభిమానులెవరికయినా ఇది తట్టుకోలేని బాధాకరమైన అంశం.

కొన్నాళ్ళపాటు మిత్రులు శివారెడ్డిగారి సంపాదకత్వంలో వెలువడిన 'నేకువ'లో కుందుర్తి సుదీర్ఘ వ్యాసం వ్రాశారు. అటువంటి వ్యాసాలు మరికొన్ని పత్రికలలో వ్రాసి వుంటారు. ఎన్నెన్నో అంశాలను ప్రస్తావిస్తూ ఎందరెందరికో ఉత్తరాలు వ్రాసి వుంటారు. 'కుందుర్తి షష్టిపూర్తి సంఘం'వారు ముఖ్యంగా ఈ సామగ్రినంతా కూడగట్టి గ్రంథరూపాన ప్రచురించడం ఎంతో అవసరం. వచన కవితా రంగంలోని ఏకైక 'విద్యుద్దీపం' కుందుర్తి అభిమానులు ఇందు సహకరించాలి. ఇది వారి విద్యుక్త ధర్మం.

(రచనాకాలం : 1-11-82)

## వివరణలు

1. ఇవి పురిపండా వారి వాక్యాలు. ఈ పేరాలోని తదితర వివరాలు తెలుసుకొనగోరేవారు నేను సంకలించిన అవగాహన-2 (79 అక్టోబరు, బుక్స్ అండ్ బుక్స్, విజయనగరం-1) చూడండి.

2. కొద్ది నెలల క్రితం ఆంధ్రపత్రికా (దినపత్రిక) ఆదివారం అనుబంధంలో ప్రచురించబడిన కుందుర్తితో ఇంటర్వ్యూ. సెప్టెంబర్, అక్టోబర్ (82) నెలల్లో ఆంధ్రప్రభ (దినపత్రిక) ఆదివారం అనుబంధాల్లో వచ్చిన చర్చా వ్యాసాలు.

3, 4,5. నగరంలో వాన - కుందుర్తి కవితా సంపుటి (ఫ్రీవర్స్ ఫ్రంట్, హైదరాబాద్, సెప్టెంబర్ 1967). 'ఉరుములూ మెరుపులూ' పేర కుందుర్తి తానే వ్రాసిన పీఠిక. (II III పేజీలు)

6. చెరబండరాజుపై కుందుర్తి వ్యాసం చూ॥ అవగాహన-5 (అక్టోబర్ 82)



# చంద్ర సౌందర్యం

## విలాసం

రాత్రి అనే
కుండలో
పాలెలా పసిగట్టాడో
తూర్పుకుర్రాడు,
చంద్రబింబం అనే
రంధ్రం వేశాడు
సొమ్మేమో వాడిది
సోకు మన వూళ్ళది.

## జనభోజనం

చుక్కల నిప్పు రవ్వలకు
మబ్బులు రాజుకోటం లేదు,
చంద్రుడనే నిప్పుకణికె పడగానే
వెన్నెలమంట రేగింది,
భూగోళ భాండాన్ని
పొయ్యిమీద పెట్టేస్తా,
పొద్దున్నే అందరికీ
వేడికాంతి వడ్డిస్తా.

## $\frac{1}{2} = \frac{2}{1}$

మాంఛి రసికుడే
కాల పురుషుడు కూడా,
సూర్యకాంత
ఒకటో భౌను,
చంద్ర కాంత
రెండో భౌను,
దినానికి
వాడి కిద్దరు కావాలి.

## చంద్ర-లేఖ

డియర్ చంద్రా!
పున్నమిలోనూ
పూర్తిగా నవ్వలేక పోతున్నానని
బాధపడకు!
పశ్చాత్తాపంతో
నీలో మచ్చల్ని
కాల్చేసుకోగలిగితే
నువ్వూ ఓ సూర్యుడివే!

# త్రికరణ శుద్ధి

నిద్రిస్తున్న మేధావుల్లారా!
వణుకుతున్న వక్తల్లారా!
ముడుచుకున్న పిరుల్లారా!
మీచలి వదిలించుకోవాలంటే
అగ్గి ఎక్కడుంటుందో తెలుసా?
రాచుకొచ్చే మనసుల్లో
పొడుచుకొచ్చే మాటల్లో
ఒరుసుకొచ్చే చేతుల్లో.

శ్రీ రావి రంగారావు



శ్రీ సిహెచ్. నరసింహారెడ్డి

# నాయని కవితా యాత్ర
# సౌభద్రుని ప్రణయ యాత్ర

ఇరువదవ శతాబ్దిలో నిర్మాణమైన భావకవితా దివ్య సౌధానికి రాయప్రోలువారు పునాదివేశారు. దేవులపల్లివారు తద్భవననిర్మాణం మహాద్భుతంగా చేశారు. ఆ కాలంలోనే పలువురు కవులు భావ కవితా సౌధాన్ని మరింత పటిష్ఠం చేశారు. వారిలో నాయని సుబ్బారావు అగ్రేసరుడు.

కృష్ణశాస్త్రి ఊహా ప్రేయసి ఊర్వశిని సృష్టించుకొని "దిగిరాను దిగిరాను దివినుండి భువికి" అని గగన పథ విహారంచేశాడు. కానీ నాయని నిజజీవితంలో తన ప్రేయసినే నాయికగా చేసికొని, ఆత్మీయ ప్రణయ యాత్రనే 'సౌభద్రుని ప్రణయ యాత్ర'గా అభివర్ణించి, రస రమ్య కవితాగానం చేశాడు. కృష్ణశాస్త్రి విఫల మనోరథుడై విలపిస్తే, నాయని సఫల మనోరథుడై తృప్తిపడ్డాడు.

'సౌభద్రుని ప్రణయ యాత్ర'లో నాయిక వత్సల. స్వయాన మేనత్తకూతురు. నాయకుడైన సౌభద్రుడు తానే. ఈ కావ్యాన్ని తన ప్రేయసికే అంకితం చేస్తూ

"స్వీకరింపుము ప్రణయదేవీ ! కరాంచ
లములజారిన తులసీదళమ్ము లివియు
నా హృదయ రాగసుధ యందు నాని పెడని
దివ్య సౌరభముల్ ప్రసాదించుకొనుము" అని తన ప్రేమ ఎంత పవిత్రమైందో, ఎంత స్వచ్ఛమైందో వివరించాడు.

తన ప్రేయసి మిన్నున మెరసే చుక్కై, కారుమబ్బుల తెర బాసివచ్చి తన హృదయంలో ప్రకాశించాలని; చిన్నారి మల్లె పూవై మండుటెండల కందిపోకుండా తన చేతిలోనికి వచ్చి వాసించాలని; మలయపవనమై ఉత్తరపు చలిబాధకోర్చి తనమీద ప్రసరించాలని; ఒప్పుల గులాబియై ప్రాకారకంటకహతి సొంపు కోలుపోక తన కన్నులకు విందు చేయాలని; కన్నెపికమై తన చిత్త చూతాన్ని చేరి కమ్మగా పాడాలని నాయని ఆరాటపడ్డాడు.

వత్సల కూడా తన వలపు తలపుల సౌరభాన్ని నాయనికి పంచి ఇచ్చింది. కానీ నేడు వత్సల తండ్రి పేరాసతో తన చెల్లెలికిచ్చిన మాటను త్రోసిరాజన్నాడు. వత్సలకు మరొక సంబంధం నిశ్చయించాడు. కానీ బాల్యంనుంచే భావతో ఏర్పరచుకొన్న వత్సల ప్రణయబంధం ఏమైపోతుంది. పాలబుగ్గల చిన్నారి ప్రాయంలోనే కంఠసీమల విరిదండలు మార్చుకొన్నారు. వత్సల తన తండ్రి ఆశాపాశాలనే తన కుత్తుకకు పురిత్రాడుగా భావించింది.

"ఏమి శాశ్వతమీనామి ప్రేమ యొకడు
దక్క తెలిసియు గగన సౌధముల గట్ట
వలెనె కావడి కుండలు కలిమిలేము
లనెడు వాక్యమ్ము బాటింపడయ్యెనయ్య" అని దుఃఖించింది.

తన చిత్తఫలకంలో ముద్రించుకొన్న బావ నెయ్యపు రూపును చెరపి ముక్కు మొగం తెలియని వానినెట్లా ప్రతిష్ఠించుకొంటుంది.

ఈ విధంగా బాధపడే వత్సలకు నాయని 'ప్రణయాహ్వానం' చూడండి.

"నీకు హారతి యీయ గాంక్షించి నాదు
స్వాంతమను పళ్ళెరమ్మున వలపు గప్పు
రమ్ము వెలిగించి చూతు మార్గమ్ము వంక
నను నిమేషమ్ము నీరాక కమృతమూర్తి" అని ఎదురు చూశాడు.

వసంత ఋతువులో - వెన్నెల రాత్రిలో అందమైన ఆడపిల్లలు ఆడుకొంటున్నారు. తాను చాటునుంచి చూస్తున్నాడు. ఇంతలో తన ప్రణయ దేవత సాక్షాత్కరించింది. ఆమెను కలుసుకోవాలని తపన పడ్డాడు. మాయమాటలు చెప్పి అందర్నీ దూరంగా పంపేశాడు. తన ప్రేయసిని సమీపించి, ఆమె మిసిమిసి నవ్వుల

నవ్వుతుండగా ఒక మల్లెమొగ్గను కోసి జడలో అలంకరించాడు. ఆమె చేతిని తనగుండెపై జేర్చుకొని

"వలపు 'కీ' పూర్తిగా నీయబడిన కతన
గుండె గడియారమెటు కొట్టుకొనునొ చూడ" మన్నాడు.

మూడులోకాల రసోద్దీపనం కలిగించే ప్రణయ రూపిణివి నీవు, నేను నీ చిరునవ్వుల కాంతుల కాసపడే ముగ్ధ బిక్షుకుణ్ణి; పాల సంద్రానివి నీవు, నీ అలల చలువలు కోరే బాల చంద్రుణ్ణి నేను; నిర్మల జ్యోతివి నీవు, ప్రమిదను నేను; ఉపాసనా దేవతవు నీవు, భక్తుణ్ణి నేను; మెఱపు తీగవు నీవు, మబ్బుతునకను నేను-

"నీవు నా జీవన దాత్రివి నేను జీవి
నీవులేకున్న నాలేమియే ధ్రువమ్ము" అన్నాడు.

ఆమెతోనే తన జీవితం. ఆమె ప్రేమ తప్ప తనకేమీ అక్కరలేదు. ఆమె కట్టుకొన్న పట్టు వస్త్రం తానై, ఆమె దేహానికి గగుర్పాటు కలుగజేయాలని; ఆమె దేవునికి హారతిచ్చే కర్పూరం తాను కావాలని; ప్రతి నిముషం ఆమె పీల్చేగాలి తాను కావాలని; ఆమె చిరునవ్వు తరగగా తాను మారాలని భావించి పరవశించిపోయాడు.

ప్రియురాలి విశ్వరూపం సాక్షాత్కరించింది. ప్రథమ దర్శనంలోనే తన కను పాపలలో ఇమిడిన ప్రేయసిని, రెప్ప లదుముకొని నిలుపుకొన్నాడు. కానీ ఆమూర్తి క్రమంగా హృదయమంతా నిండిపోయింది. ఎడతెరపిలేక మండే ప్రణయాగ్నిజ్వాలల్లో తన మనస్సు నవనవానందకరమై తాండవిస్తుంది.

ఇంతటి ప్రణయ స్వరూపిణి దూరమైనప్పుడు విధి చేసిన అకృత్యమని పొగిలిపోతాడు. మధుర స్వప్నంలో తాను మైమరచి వుండగా తన యెదలో చురకత్తి నాటిందెవరనీ ....

"ఎవ్వడే/రాక్షసుడు మనమీద నున్న
యవధి యంతయు దానయై యాక్రమించి
వికట దంష్ట్రాభయంకర వికృత వదన
విషము హాసుండు నన్నిట్లు వెక్కిరించు" నని విధిని ప్రశ్నించాడు.

మనోజ్ఞమైన కార్తీక పూర్ణిమ రోజున బ్రహ్మాండమంతయిన తన ఆత్మలో ప్రియురాలి అమృతమూర్తిని నిలుపుకొని ఎదురు చూస్తున్నాడు. విరహాగ్నిచేత వెచ్చనైన అశ్రుబిందువులే కానుకగా తన కనుకొలకులలో నిలుపుకొన్నాడు.

నాడు శుక్రవారం. త్రిలోకజనని పాదపద్మాలపైన తన ప్రేయసి ఒక పూజాపుష్పమై ప్రణమిల్లి వుంది. తాను కూడా పరవశించి, భక్తితో పుష్పంగా మారిపోయాడు.

"జంట పూపుల అమృత నిశ్వాస సౌర
భమున రోదసి శుక్రవారము నందించె."

ఈ విధంగా ఆ ప్రేయసీ ప్రియులు ఏకమయ్యారు.

నాయని ప్రేమ కందళించి, వికసించి, కళలుదేరి పరిపూర్ణమయింది. నాయని కవితాయాత్ర సౌభద్రుని ప్రణయ యాత్రగా రసికలోక సుసేవ్యమయింది. నిర్మలమై, మధురమై, ఆదర్శమై, నిత్యనూతనమై, సత్యసనాతనమై, ధార్మికమైన పవిత్ర ప్రణయ వృత్తాంతాన్ని మనకందించిన నాయని ధన్యజీవి.



శ్రీ మెట్టు మురళీధర్ రావు

# హరిజన సమస్య - ఆంధ్ర కవిత్వం

మన దేశంలోని ఎన్నో సాంఘిక దురాచారాల్లో 'అస్పృశ్యత' ఒకటి. ఈ దురాచారాన్ని నిర్మూలించడానికి చాలా కాలం నుండి ఎంతోమంది సంస్కర్తలు కృషి చేస్తున్నారు. ఈ శతాబ్దపు ప్రథమార్థం నుండి ప్రభుత్వం కూడా ఈ విషయంలో శ్రద్ధ వహిస్తోంది. ఐనా ఈ అస్పృశ్యతను గూర్చిన పూర్తి సత్ఫలితాలు మనమింకా సాధించలేదనే చెప్పవలసి వస్తుంది.

అస్పృశ్యులుగా, అంటరానివారుగా, పంచములుగా చెలామణి అవుతున్న వీరందరికి గాంధీజీ "హరిజనులు" అని పేరు పెట్టారు. వీరికి రాజకీయ హక్కులకోసం డా. బి.ఆర్. అంబేద్కర్ ఎంతో కృషి చేశాడు.[1] 1947 లోనే అన్ని దేవాలయాల్లోకి హరిజనుల్ని ప్రవేశింపజేసే శాసనము వచ్చింది.[2] అన్ని రాష్ట్రాల్లోను హరిజన సంక్షేమం కోసం వివిధ కార్యక్రమాల్ని చేపట్టారు. మన రాష్ట్రంలోకూడా హరిజన సంక్షేమ శాఖ 1953లో ఏర్పాటయింది.[3]

ఇన్ని జరిగినా, స్వాతంత్ర్యంవచ్చి మూడు దశాబ్దాలు దాటినా హరిజనుల స్థితిగతుల్లో గణనీయమైన మార్పురాలేదు. హరిజనులపై అత్యాచారాలు, హరిజనుల సజీవ దహనాలు[4] జరుగుతున్నట్టు పత్రికల్లో నిత్యం మనం చూస్తూనే ఉన్నాము.

హరిజనులు ఈ స్థితిలో ఉండడానికి కారణాలు ఎన్నో ఉన్నాయి. ముఖ్యంగా సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక రంగాల్లో వారు వెనుకబడి ఉండడమూ, ఆ రంగాల్లో వారిని ముందుకు రానీయకుండా ఒక బలమైన వర్గం ఆటంకంగా ఉండడమూ వారి దీనస్థితికి కారణంగా కనిపిస్తుంది.

హరిజనుల సాంఘిక స్థితి దుర్భరంగా ఉంది. ఇంకా కొన్ని గ్రామాల్లో వారు అంటరాని వారుగానే ఉన్నారు. హరిజనవాడలు ఊరికి చివరగానే ఉన్నాయి. హరిజనేతరుల మట్టి పాత్రలను హరిజనులు తాకకూడదనే నియమమూ, పనిచేసిన హరిజనులు ఉపయోగించిన పాత్రలను హరిజనేతరులు నీళ్ళుజల్లి తీసుకునే పైనమూ ఇప్పటికీ మనకు చాలాచోట్ల కనిపిస్తుంది.

ఆర్థికంగా హరిజనులు చాలా హీనమైన స్థితిలో ఉన్నారు. వారు కూలి నాలి చేసుకుంటూ, పాలేర్లుగా ఉంటూ తమ జీవితాన్ని గడుపుతున్నారు. తమ కడుపు నింపు కోవడానికి వారు తమ పిల్లల శ్రమను కూడా ఉపయోగించుకుంటున్నారంటే వారి స్థితిని మనం ఊహించవచ్చు. యజమాని అప్పుతీర్చలేక కొంతమంది జీవితాంతం పాలేర్లుగా ఉంటున్నారన్న సంగతి మనం వింటున్నాం. ఈ మధ్య ప్రభుత్వం బలహీన వర్గాల వారికి ఇళ్ళు కట్టించే కార్యక్రమం చేపట్టడంవల్ల వారికి ఇళ్ళంటూ ఏర్పడుతున్నా చాలా కుటుంబాలు పూరిగుడిసెల్లోనే ఉంటున్నాయి.

ఇక సాంస్కృతికంగా హరిజనులు ఎంతో వెనుకబడి పోయారు. ఆర్థిక దుస్థితివల్ల వారు ధరించే దుస్తులు, చదువు లేక పోవడంవల్ల వారి భాష, ప్రపంచాన్ని చూడలేకపోవడంవల్ల వారి ఆహార నియమాలు ఇతరులకంటే భిన్నంగా మారిపోయాయి. పిల్లల్ని బడికి పంపడంకన్నా పశుల కాపరిగా ఉంచితేనే వారి జీవితం గడిచే పరిస్థితిలో ఉంది. ప్రభుత్వం హరిజన బాలబాలికల కోసం ఎన్నో హాస్టళ్ళను ప్రారంభించినా అవి వారి సంఖ్యకు సరిపోక పోవడంవల్ల చాలామంది చదువు లేమితోనే ఉన్నారు. ఈ విధంగా విద్య అందరికీ అందుబాటులో లేకుండా పోయింది.

ఈ రకమైన ఎన్నో కారణాలవల్ల వెనుకబడి పోయినహరిజనులు మనదేశంలో అన్ని రాష్ట్రాల్లోనూ ఉన్నారు. ఆంధ్రరాష్ట్రానికి సంబంధించినంతవరకు ఈ హరిజన కులం ఎన్నో ఉప కులాలుగా విభజింపబడింది.[5] ఆ ఉపకులాల వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

I. రాష్ట్రం మొత్తంలోని హరిజనులు :-

1. చాలవాడి
2. చామర్, మోచి లేక ముచ్చి
3. మాదిగ
4. మాల

II. హైదరాబాద్, మహబూబ్‌నగర్, ఆదిలాబాద్, నిజామాబాద్, మెదక్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం, నల్గొండ జిల్లాల లోని హరిజనులు :-

1. అనాముక్
2. అర్య (మాల)
3. అర్వ (మాల)
4. బేడ (బుడ్గ) జంగమ్
5. బైండ్ల
6. బ్యాగర
7. చాంభర్
8. డక్కల్ (డక్కలవారు)
9. ఢోర్
10. ఎల్లమ్మలవారు
11. హోలియ
12. హోలియ దాసరి
13. కొలుపులవాండ్లు
14. మహర్
15. మాలదాసరి
16. మాల హణ్ణు
17. మాల జంగమ్
18. మాల మస్తి
19. మాల సాలె
20. మాల సన్యాసి
21. మాంగ్
22. మాంగ్ గరోడి
23. మన్నె
24. మస్తి
25. మెహతర్
26. మిత అయ్యలవారు
27. సామగర
28. సింధోళ్ళు (చిందోళ్ళు)

III. పైతొమ్మిది జిల్లాలుకాక మిగతా జిల్లాలలోని హరిజనులు:-

1. ఆది - ఆంధ్ర
2. ఆది - ద్రావిడ
3. అరుంధతీయ
4. బెరికి
5. బవురి
6. చాచట్టి
7. చండాల
8. దండాసి
9. దోమ్, దొంబర, పాయిడి లేక పానో
10. ఘాసి హడ్డి లేక రెల్లి చాచ్చంది
11. గొడగాలి
12. గొడారి
13. గోసాని
14. జగ్గలి
15. జాంబువులు
16. మాదాసి కురువ లేక మాదారి కురువ
17. మాలదాసు
18. మాదిగ దాసు మరియు మస్తీన్
19. మాతంగి
20. ముండల
21. పాకి లేక మోతి
22. పంబాడ లేక పంబండ
23. పాములి
24. పంచమ లేక పరయ్
25. రెల్లి
26. సాంబన్
27. సపు
28. తోటి

ఈ విధంగా దాదాపు 60 ఉపకులాలతో హరిజనులుగా పిలువబడుతున్న వీరందరూ గాంధీజీ రాజకీయ ప్రవేశానికి ముందు అస్పృశ్యులు. సమాజంలో వారు అస్పృశ్యులు అని మిగతా వర్గాలవారు భావించినట్లే, వీరు కూడా భావించేవారు. అయితే ఈ అస్పృశ్యతా, వీరు ఈ విధంగా వెలివేయ బడడమూ ఎప్పటి నుండి ఏ విధంగా జరిగింది ? ఎందుకు జరిగింది ? అన్న విషయాల్ని తెలుసుకోవడానికి మన జాతి చరిత్ర వెనుక పేజీల్ని త్రిప్పి చూడాల్సి ఉంటుంది. మన జాతి నాగరిక జీవితాన్నంతా కూలం కషంగా వడబోయ వలసి ఉంటుంది.

వేదకాలం కన్నా ముందుకు వెళ్ళి చూస్తే ఈ అస్పృశ్యులు ఉన్నట్టులేరు. హరప్పా, మొహంజదారోలను కనిపెట్టిన తర్వాత ఆ త్రవ్వకాల్లో మన అతి ప్రాచీన నాగరికత బయల్పడింది. ఈ ఈ నాగరికత ఆర్యులు భారతదేశానికి రావడానికన్నా ముందు దని చరిత్రకారులు భావించారు. ఈ త్రవ్వకాల్లో వెడల్పైన వీధులు, వీధులవెంట పెద్దపెద్ద భవనాలు, ప్రతి ఇంటికి స్నానపు గదులు,

వీధుల అడుగున మురుగు నీటి సౌకర్యాలు, బహిరంగ సరోవరాలు మొదలైనవి ఆనాడు ఉండేవని కనుగొన్నారు. లభించిన సమాచారాన్ని బట్టి ఇది అత్యుత్తమ నాగరికత. ఇంతటి ఉన్నతమైన నాగరికత విలసిల్లిన కాలంలోకూడా అస్పృశ్యతలేదు. అయితే ఆనాటి ప్రజలు పూజారి వర్గం, రాచరిక వర్గం, వర్తకులు, చేతిపని వారు అనే నాలుగు వర్గాలుగా జీవించినట్లు తెలుస్తోంది.7 తర్వాత వృత్తుల మూలంగా ఏర్పడ్డ వర్గాలు ఘనీభవించిపోయి మానవుల మధ్య భేదాలను శాశ్వతం చేశాయి.8 పూర్వకాలంలో గుణకర్మలను బట్టే వర్ణము నిర్ణయింపబడేది కాని జన్మను బట్టి కానే కాదు.9

క్రమ క్రమంగా విజ్ఞాన సంపదభి రుచి కలవారు విప్రులుగాను, పరిపాలన చేపట్టినవారు క్షత్రియులుగాను, మిగిలిన వారంతా వైశ్యులుగాను వ్యవహరించబడ్డారు.10 అంటే మొదట మూడే వర్గాలుండి క్రమంగా వర్తకం చేసేవారు మాత్రమే వైశ్యులై మిగిలిన వారంతా శూద్రులుగా పిలువబడ్డారు. ఈ విధంగా నాలుగవ వర్ణం ఏర్పడింది.11 ఋగ్వేదకాలం నాటికి బ్రహ్మదేవుని ముఖం నుండి బ్రాహ్మణుడు, చేతులనుంచి రాజు, తొడల నుంచి వైశ్యుడు, పాదాలనుండి శూద్రుడు జన్మించినట్లుగా ఒక అభిప్రాయం బలపడింది.

"బ్రాహ్మణోస్య ముఖమాసీ
ద్బాహూ రాజన్యః కృతాః
ఊరూ తదస్యద్వైశ్యః
పద్భ్యాం శూద్రో అజాయత"12

ఐతే ఋగ్వేదకాలం నాటికి ఈ వర్ణ వ్యవస్థ సుప్రతిష్ఠితం కాలేదు. తర్వాత బ్రాహ్మణాల కాలాననే ఈ వ్యవస్థ బలపడింది.13 అంతేతప్ప పంచములనబడే ఈ హరిజనుల గురించిగాని, వారు బ్రహ్మయొక్క ఏ అవయవమునుండి జన్మించారోగాని చెప్పబడలేదు.

బ్రాహ్మణుల తర్వాతనే స్వార్థపరులైన కొంతమంది ఈ ఐదవ కులాన్ని సృష్టించి వారికి అంటరానివారని, చూడరానివారని, చెప్పరానివారని, మాట్లాడరానివారని, ఛండాలురని పేర్లు పెట్టి వారు గ్రామాలకు దూరంగా ఉండాలని ఆనాటి రాజులచేత శాసనాలు చేయించారు.14 ఈ విధంగా స్వార్థపరుల సృష్టేగాని అస్పృశ్యులనే తెగ ఆదినుండి లేదు. స్వార్థం పెరిగిన కొద్దీ ఈ వ్యవస్థ మరింత బలపడిపోయింది.

ఇక్కడ ఒక విషయం గమనించాలి. సమాజంలో చాతుర్వర్ణ వ్యవస్థ ఏర్పడ్డ తర్వాత కులానికన్నా గుణానికే ప్రాధాన్యమిచ్చేవారు. అందుకు నిదర్శనాలనేకం ఉన్నాయి. రామాయణ మహా కావ్యాన్ని వ్రాసిన వాల్మీకి బోయవాడు. భారతంలో కౌశిక మహర్షికి ధర్మోపదేశం చేసిన ధర్మవ్యాధుడు కటికవాడు. రామాయణంలోని గుహుడు, శబరి, భారతంలోని విదురుడు, సంజయుడు మొదలైన వారంతా శూద్రులే. ఐనా వారంతా గుణాలచేతనే ప్రకాశించారు.

ఇట్లే అరుంధతి వంటి ఒకరిద్దరు పంచములు కూడా కులం చేతగాక గుణం చేత ప్రకాశించారు. అంతమాత్రాన పంచములందరూ గౌరవింపబడ్డారని కాదు. వారు ఆ కాలాన కూడా హీనంగానే చూడబడ్డారు. ప్రాచీన తెలుగు కవిత్వాన్ని పరిశీలిస్తే ఈ విషయం కొంత వరకు మనకు అవగత మవుతుంది. వారు ఇతర వర్గాల వారి కన్నా తక్కువ స్థాయిలో ఉండేవారని, కొన్ని సార్లు గుణ కర్మలచేత స్థాయిని మరిచి సమాజం వారిని గౌరవించేదనీ మనకు విదిత మౌతుంది.

అరుంధతి కథను చూడండి. ఆమె ఒక మాలకన్య. పరమ పతివ్రత. సప్తర్షులలో ఒకడైన వసిష్ఠుని భార్య. వసిష్ఠుడు బ్రాహ్మణుడు. అతడు వివాహమాడాలని ఇసుకతో అన్నం వండి పెట్టే స్త్రీ కోసం తిరిగాడు. ఎంత తిరిగినా ఎవరూ దొరకలేదు. చివరికి ఒక మాల పల్లెలో ఒక కన్య ఇసుకలో అన్నం వండి పెట్టింది. ఆ కన్యయే అరుంధతి.15 వివాహ సమయంలో వధూవరులందరికీ అరుంధతిని (నక్షత్రము) చూపిస్తారు. ఇక్కడ హీనకుల సంజాత అయినా అరుంధతి గౌరవింపబడిందనే కథలోని భావాన్ని మనం గమనించాలి.

ఇక విశ్వామిత్రుని కథ. త్రేత ద్వాపర యుగాల సంధి కాలంలో భయంకరమైన కరువు సంభవించింది. విశ్వామిత్రునికి తినడానికి ఏమీ దొరకలేదు. తిండికై వెదుకుతూ విశ్వామిత్రుడు ఒక మాలపల్లెను చేరాడు. అక్కడివారు ఒక కుక్కనుచంపి కొంత మాంసాన్ని తిని నిద్రపోయారు. విశ్వామిత్రుడు అకలి భరించలేక కుక్క మాంసాన్ని భక్షిస్తుండగా ఒక మాలవాడు ముని సత్తములు కుక్క మాంసాన్ని తినవచ్చాయని అడిగాడు. ప్రాణరక్షణ కొరకు తినవచ్చని విశ్వామిత్రుడు చెప్పాడు 16 ఇక్కడ మనం విశ్వామిత్రుడు హీనకులం వారి మధ్యన ఆకలి తీర్చుకున్నాడనే విషయాన్ని గమనించాలి.

హరిశ్చంద్రుడు17 విశ్వామిత్రునికి అప్పుపడ్డాడు. అతడు తన భార్యనమ్మినా అప్పుతీరలేదు. చివరికి వీరబాహుడు అనే మాలకి తానే అమ్ముడు పోయి విశ్వామిత్రుని అప్పుతీర్చాడు.18 ఈ కథలో హరిశ్చంద్రుడు హీనకులజునికి అమ్ముడు పోయాడని గమనించాలి.

స్కాంధ పురాణాంతర్గతమైన సుకుమారుని కథలో సుకుమారుడు రాజ్యం నుండి బహిష్కరించబడి, ఒక ఛండాల కన్యను చూచి[19] ఆమెతో కాపురం చేశాడు. సుకుమారుడు హీనకుల కన్యనే కామించాడని కథలోని భావం.

పాండురంగ మహాత్మ్యములోని నిగమశర్మ బ్రాహ్మణుడై యుండి ఛండాల కన్యతో కాపురం చేశాడు. ఆమె హీనకులజురాలు. ఆముక్తమాల్యదలోని మాలదాసరి కూడా హీనకులజుడే.

ఈ కథల్లో అరుంధతి మాలకన్య. విశ్వామిత్రుడు ఆకలి తీర్చుకున్నది మాలపల్లెలోనే. హరిశ్చంద్రుడు సత్యం కోసం అమ్ముడుపోయింది మాలకే. సుకుమారుడు, నిగమశర్మ అగ్రవర్ణాలవారై కూడా కాపురం చేసింది ఛండాలస్త్రీలతోనే. ఇక మాలదాసరి సాక్షాత్తూ మాలవాడే. కనుక ఆ కాలంలో హీనకులంగా పరిగణింపబడేవారంతా గుణ కర్మలచేత గౌరవింపబడడమో లేక అగ్రవర్ణాలవారికి ఉపయోగపడడమో జరిగిందని స్పష్టమవుతుంది.

క్రమక్రమంగా ఈ వర్గం అగ్రవర్ణాలచేత మరీ చిన్న చూపు చూడబడుతూ వచ్చింది. ఐతే మానవత్వ దృష్టిగల కవులు ఈ విషయాన్ని చాలా కాలం నుండీ ఖండిస్తూ వచ్చారు.

వేమన ఈ విషయాన్ని ఖండిస్తూ ఎన్నో పద్యాలు వ్రాశాడు. మాలని నిందించకూడదని, అందరి శరీరాల్లోనూ ఉన్న రక్తమాంసాలు ఒకటేనని[20] ఆయన భావించాడు. జన్మచేత ఎవడూ మాలవాడు కాడని, మాట తప్పినవాడే మాలవాడని [21] వివరించాడు. మాలలు మాంసం తింటారని ఛీదరించుకునే వాళ్ళను మీరు తినే నెయ్యి మాత్రం కొవ్వుకాదా[22] అని ప్రశ్నించాడు. వేమనదృష్టిలో మాలను ముట్టుకొని నీట మునగడమే మాలకర్మ. పశువులు దిగినా నరపశువులు దిగినా నీరు మురికవుతాయి[23] అంటాడాయన. వేమన హరిజన సమస్యను మానవతా దృష్టితో పరిశీలించిన మహాకవి.

ఆధునిక కాలంలో కూడా ఈ హరిజన సమస్యను ఎంతో మంది సంస్కర్తలు విమర్శించారు. 1828న స్థాపించబడ్డ బ్రహ్మ సమాజం, 1867లో మహారాష్ట్రలో స్థాపించబడ్డ ప్రార్థనా సమాజం, 1875లో స్థాపించబడ్డ ఆర్య సమాజం, 1897లో వివేకానందుడు స్థాపించిన రామకృష్ణ మిషన్, 1886లో మద్రాసులో స్థాపించబడ్డ దివ్యజ్ఞాన సమాజం[24] వీరంతా హిందూ సమాజంలోని మూఢ విశ్వాసాల్ని, దురాచారాల్ని, అస్పృశ్యతను ఖండించారు. ఈ సంస్థల్ని విశ్వసించిన కవులు, రచయితలు గూడా హరిజనుల్ని మానవునిగానే భావించారు.. అస్పృశ్యతను నిందించారు.

ఆధునిక తెలుగు కవుల్లో ఈ హరిజన సమస్యను తీవ్రంగా విమర్శించిన మహానుభావుడు గురజాడ అప్పారావు.

"మలిన దేహుల మాలలనుచును
మలిన చిత్తుల కధిక కులముల
నెలవొసంగిన వర్ణ ధర్మమ
ధర్మ ధర్మంబే."[25]

అంటూ ఆయన నిరసించాడు. మనుష్యుల్లో ఉన్నవి రెండే కులాలని అవి "మంచి", "చెడు" అని అంటాడు గురజాడ.

"మంచి చెడ్డలు మనుజులందున
యెంచి చూడగ రెండె కులములు
మంచి యన్నది మాలయైతే
మాలనే అగుదున్."[26]

గురజాడ ఇక్కడ మాలెతను నాయికగా చిత్రించిన విషయాన్ని మనం గమనించాలి. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు రాజమహేంద్రవరంలో హరిజనుల కొరకు పాఠశాలను నెలకొల్పి హరిజనుల కోసం పాటుపడ్డారు.[27]

గాంధీజీ అస్పృశ్యతానివారణోద్యమాన్ని చేపట్టక ముందు నుండే తెలుగు కవులు ఈ సమస్యను వెలుగులోకి తెచ్చారని డా. ఎం. సుబ్బారెడ్డి 1909లోని ఒక అజ్ఞాత కవి గేయాన్ని [28] పేర్కొన్నాడు. ఆ గేయ మిది :

"అందారు పుట్టేరి హిందమ్మ తల్లికి
అందారు ఒక్కటై ఉందారి సక్కంగ
.... .... .... ....
హిందూలమౌ మమ్ము మందూల మనవద్దు
తమ్ముళ్ళమని మీరు మమ్మూల జూడండి."

అయితే దీనికి ఉద్యమ స్వరూపాన్ని కలిగించింది మాత్రం గాంధీ మహాత్ముడే. "నేను హిందూమతము నశించుటకైన అంగీకరింతుగాని అస్పృశ్యతా దోషము నిలిచియుండుటకు మాత్రము అంగీకరింపజాలను."[29] అని గాంధీజీ స్వయంగా అన్నాడు.

గాంధీజీ హరిజనులను దేవాలయ ప్రవేశం చేయించగానే ఎంతో మంది హరిజన దేవాలయ ప్రవేశాన్ని సమర్థించే గీతాలు, కథలు. నవలలు, నాటికలు వ్రాశారు.

వెంకట పార్వతీశ్వర కవులు "పంచమాభినందనము"లో

"మమత దప్పిన యాతడు మాలగాక
మాటదప్పిన యాతడు మాలగాక

అన్నెమును బున్నె మెరుగని యట్టిమాల
మాలయే ? దేవుమెడ బూల మాలగాక."30

అని చాటారు. బ్రహ్మభట్ట పట్టాభిరామశర్మ "హరిజనులు భరత మాత మెడలోని రత్నమాలలని, తెలుగు స్త్రీల కొప్పులలోని నవ క్రొత్త పూల మాలలు"31 ని వర్ణించాడు.

పురిపండ అప్పలస్వామి "గుడిలోని దైవమా !"32 యనే గీతంలో ఒక హరిజనుడు తన దుస్థితిని దేవునితో మొరపెట్టు కోవడాన్ని వివరించాడు.

"అంటరానివారెవరో కారు, మా వెంటరానివారె" అని మాదవపెద్ది సుందరరామశాస్త్రి: "బ్రాహ్మణ పంచముల్ బలిసి కలిసొచ్చాము"33 అని మంగిపూడి పురుషోత్తమశర్మ కుల భేదాలు లేవని తెలిపారు.

"ఏ మాలవాడు అపులనుగాచి, పాలుపిదికి నీ కర్పిస్తాడో, ఏ మాలవాడు తాను పండించిన పంటను నీ గరిసెల్లో నింపుతాడో, ఎవడు ఒక్క బొట్టుండి నిన్ను పూజిస్తాడో అట్టివానికి నీ ముఖం చూపించవా ?"34అని కాటూరి వెంకటేశ్వరరావు 'గుడిగంటలు'లో ప్రశ్నిస్తాడు.

జాషువా "గబ్బిలం" ఈ సమస్యనే చిత్రించిన మరో కావ్యం. "భారతోర్వరకుం గడగొట్టు బిడ్డడై"న అరుంధతీసుతుడు తన దుస్థితిని భగవంతునికి తెలుపుమని గబ్బిలంతో చెప్పిన సందేశము ఇందలి వృత్తాంతము.

త్రిపురనేని రామస్వామి చౌదరి,35 మంగిపూడి వెంకటశర్మ36 ఇంకా ఎంతోమంది కవులు వర్ణ వ్యవస్థను, అస్పృశ్యతను ఖండిస్తూ కవిత లల్లారు.

ఇక ఉన్నవవారి "మాలపల్లి", బాపిరాజుగారి 'నరుడు' స్వాతంత్ర్యానికి పూర్వం హరిజనోద్ధరణ నుద్దేశించి రచించిన నవలలుకాగా, రంగనాయకమ్మగారి 'బలిపీఠం', ఎన్. ఆర్ నంది గారి 'నైమిశారణ్యం' స్వాతంత్ర్యానంతరం హరిజనోద్ధరణను ప్రచారం చేసిన నవలలుగా కనిపిస్తాయి. ఇంకా కొన్ని నవలల్లో హరిజన సమస్య ప్రధాన సమస్యగా కనిపించకపోయినా మనకు హరిజనోద్ధరణ కాంక్ష కనిపిస్తుంది.

ఈ విధంగా స్వాతంత్ర్యానికి ముందూ, ఆ తర్వాతా తెలుగు రచయిత హరిజనోద్ధరణను ఉద్దేశించినాడనడానికి చాలా నిదర్శనాలున్నాయి. ఎన్నో కవితలు, కథలు, నవలలు, నాటికలు ఈ మహత్తర ఆదర్శం కోసం సృష్టించబడ్డాయి. ఆ సాహిత్యమంతా వెలుగులోకి రావాలి. అప్పుడే "తెలుగు కవి ఉత్తమాదర్శం" కూడా వెలుగులోకి వస్తుంది.

ఈ చిన్న వ్యాసాన్ని నేను స్థూలంగా పరిశీలించి మాత్రమే వ్రాశాను. ఇదొక విహంగ దృష్టి మాత్రమే. ఈ హరిజన సమస్యను చిత్రించిన కవితలు, నవలలు, కథానికలు, నాటకాలుఎన్నో ఉన్నాయి. ఒక్కొక్క ప్రక్రియ ఒక్కొక్క సిద్ధాంత వ్యాసానికి తగినంత పరిధిని కలిగి ఉన్నాయి. అన్వేషకులు, పరిశోధకులు ఈ పని చేయవలసిన అవసరం ఎంతైనా ఉందని నా అభిప్రాయం.

## అధోజ్ఞాపికలు

1. డి. రామలింగం : భారతీయ పునరుజ్జీవనము : పుట 51
2. విజ్ఞాన సర్వస్వము : మూడవ సంపుటము : పుట 1244
3. విజ్ఞాన సర్వస్వము : మూడవ సంపుటము : పుట 1245
4. కరీంనగర్ జిల్లా భీందేవరపల్లి తాలూకాలోని పెరుకపల్లి అనే గ్రామంలో 4-8-1981 నాడు ఒక హరిజనుడు సజీవ దహనం చేయబడ్డట్టు పేపర్లు ప్రకటించాయి.
5. ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్‌వారి 'ఇన్‌స్ట్రక్షన్స్ టు కాండిడేట్స్', పుటలు 21, 22
6. ఏటుకూరి బలరామమూర్తి హరప్పాను మొదట కన్నింగ్ హోమ్ పిదప మార్షల్ అనే వారు; మొహంజదారోను ఆర్. డి. బెనర్జీ కనిపెట్టినట్టు తెలిపారు - మన చరిత్ర, పుట 5
7. ఏటుకూరి బలరామమూర్తి - మన చరిత్ర, పుట 11
8. డా. ఎన్. గోపి-వేమన్న వాదం, పుట 71
9. యలమంచిలి వెంకటప్పయ్య, దేవుళ్ళు ఎవరికొరకు ? పుట-117
10. డా. సి. నారాయణరెడ్డి : ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయము - ప్రయోగము, పుట 17
11. యలమంచిలి వెంకటప్పయ్య : దేవుళ్ళు ఎవరికొరకు?, పు. 34
12. ఋగ్వేదము : దశమమండలము : 90వ సూక్తము భగవద్గీతలోకూడా "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః" అని నాలుగవ అధ్యాయం, జ్ఞానయోగము, 13వ శ్లోకంలో చెప్పబడింది.
13. డా. సి. నారాయణరెడ్డి : ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయము : ప్రయోగము, పుట 18
14. యలమంచిలి వెంకటప్పయ్య : దేవుళ్ళు ఎవరికొరకు ?, పు. 34
15. వేమూరి శ్రీనివాసరావు - పూర్వగాథాలహరి, పుట 25
16. వేమూరి శ్రీనివాసరావు - పూర్వాగాథాలహరి, పుట 422

17. హరిశ్చంద్రుని కాలం క్రీ. పూ. 2542 - ఏటుకూరి బలరామ మూర్తి : మనచరిత్ర, పుట 30

18. వేమూరి శ్రీనివాసరావు : పూర్వగాథాలహరి, పుట 527

19. శ్రీనాథుడు : శివరాత్రి మహాత్మ్యము : తృతీయాశ్వాసము, పద్యము 32

20. మాలవాని నేల మరి మరి నిందింప
ఒడలరక్త మాంస మొకటి గాదె
వానిలోన వెలుగు వాని కులంబేది
విశ్వదాభిరామ వినురవేమ.

21. మాల మాలగాదు మహిమీద నేప్రొద్దు
మాట తిరుగువాడు మాలగాక
వాని మాల యన్నవాడెపో పెను మాల
విశ్వదాభిరామ వినురవేమ.

22. మాల మాంసముదిన మహిమీద జనులెల్ల
క్రొవ్వు తావలేవో కోర్కెదీర
కులములన్ని ఒక్క కులముగా దెలియుడీ
విశ్వదాభిరామ వినురవేమ.

23. మాలవాని నంటి మరి నీళ్ళ మునిగేరు
మాల కర్మచేత మాలడయ్యె
ఏల తెలియలేరొ ఈ నరపశువులు
విశ్వదాభిరామ వినురవేమ.

24. డి. రామలింగం : భారతీయ పునరుజ్జీవనము : పుటలు 41, 42, 43, 46, 47

25. గురజాడ : ముత్యాలసరాలు - లవణరాజుకల, పుట 88

26. గురజాడ : ముత్యాల సరాలు - లవణరాజుకల, పుట 89

27. విజ్ఞాన సర్వస్వము : మూడవ సంపుటము : పుట 1243

28. సాహిత్య వివేచన : ఫ్రీడమ్ ప్రెస్ : మద్రాసు 1974, పు. 82

29. భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర : తృతీయభాగము పు. 166

30. పంచమాభినందనము : కావ్య కుసుమావళి : ప్రథమభాగము, ద్వితీయ సంపుటి

31. మాలలు, ఆంధ్రపత్రిక, 1920- ఉగాది సంచిక

32. గుడిలోని దైవమా!, ఆంధ్రభూమి, 1933-జూన్ సంచిక

33. పొలిపాట : కోయిల పాటలులో నుండి

34. గుడిగంటలు : కాటూరి వెంకటేశ్వరరావు

35. సూత పురాణం

36. నిరుద్ధ భారతము

శ్రీ చివుకుల అనంతపద్మనాభ శాస్త్రి

# ఎఱెయప్పొరుని అంకాలమ్మగూడూరు శిలాశాసనము★

ఆంధ్రదేశ చరిత్రలో 6-7వ శతాబ్దములు ఎంతో ప్రాముఖ్యాన్ని చేరుకున్నాయి. అంతవరకు స్వస్థానీయులైన వివిధ రాజ వంశముల వారు ఆంధ్ర సామ్రాజ్యము నేలుతుండగా, కర్ణాటక రాజ్య వర్ధనులును, బాదామిచాళుక్య వంశీయులు ఆంధ్రదేశము లో నడుగిడిన శతాబ్దమది. ఆ వంశీయులలో పేర్కొనదగినవాడు రెండవ పులకేశి. పరమేశ్వర బిరుదాంకితుడు. ఆంధ్రదేశమును స్వభుజ బల కీర్తులతో నాక్రమించి, సహోదరుడైన కుబ్జ విష్ణువర్ధ నుని యువరాజుగా నియమించి, తూర్పు చాళుక్య రాజ్య విస్తరణకు నాంది పలికినవాడు. కౌశికీవర ప్రసాదలబ్ధుడు, మాతృగణ పరిపా లితుడునైన రెండవ పులకేశికి సంబంధించిన కొన్ని తామ్రపట్టి కలు, శిలా శాసనములు బయల్పడినవి. శిలాశాసనములలో కొన్ని కర్ణాటక రాష్ట్రములో బయల్పడగా, ఇంతవరకు రెండు మాత్రమే ఆంధ్రప్రదేశ్‌లో లభ్యమయినవి. ఒకటి కన్నడ శాసనము. అది అనంతపూర్ జిల్లాలోని పెదవడుగూరు గ్రామములో కలదు.[9] ప్రస్తుత శిలాశాసనము రెండవది ఇది పూర్తిగా తెలుగున వ్రాయ బడినది.

ఈ శిలాశాసనము కడపజిల్లా, పులివెందుల తాలూకాలోని అంకాలమ్మ గూడూరు గ్రామములోని శ్రీ రామిరెడ్డిగారికి చెందిన 'శెనక్కాయల చేను' దక్షిణ సరిహద్దు గట్టున పడియున్నది.[10] శాసన స్తంభము నలుచదరముగా యుండి, స్తంభమునకు మూడు వైపుల శాసనము అందముగా చెక్కియున్నది. మొదటి రెండు వైపుల మూడు పంక్తులలోను, మూడవవైపు రెండు పంక్తులలోను శాసనము చెక్కియున్నది. అన్నివైపుల కలిసి, మొత్తము మీద శాసనము 8 పంక్తులలోగలదు. నాలుగు, ఆరు పంక్తులలో మొదటి కొన్ని అక్షరములు కొంచెం పెద్దవిగా నున్నను, మొత్తము మీద అన్ని అక్షరములు చూపరులను ఆకట్టుకొనును. స్తంభము మొదటి వైపు కుడిచివర భగ్నమగుట వలన, ఒకటి, రెండు పంక్తుల చివరి అక్షరములు లేవు. అవి కుండలీకరణముల యందు పూరింపబడినవి.

కాల నిర్ణయము చేయుటకు ఈ శాసనమందు 'తేదీ'లు లేవు. అందువలన లిపి పోలికలనుబట్టియు, ఈ కాలమునకు సంబంధించిన శిలాశాసనములను బట్టియు, ఇది సుమారు 7వ శతాబ్దమునకు చెందినదిగా నిర్ణయించవచ్చును.

శాసనలిపిని పరిశీలించిన కొన్ని విశేషములు గోచరించు చున్నవి. అందులో ముఖ్యముగా 'క' అక్షరము, శకట రేఫాక్షర ములు, కొంత పరిణామమును సూచించుచున్నవి. ఈ శాసనములో 'క' అక్షరము రెండు రకములుగా చెక్కబడినది. (1) తలకట్టు



అధోజ్ఞాపికలు 1 – 8

మామూలుగా కాకుండ, అక్షరముపైన ఇరుప్రైపుల బాణమువలె వంగి, క్రింద భాగమునకు రెండుప్రైపుల తాకుచున్నవి.[1] ఇక రెండవ రకమునందు, అక్షరము యొక్క క్రింది భాగమున కుడి ప్రైపు కొద్దిగా ఉబ్బు కనిపించుచున్నది.[2]

శకటరేఫ మామూలుగానూ, ఒత్తక్షరముగాను ఉపయోగింప బడెను. మామూలుగా నుపయోగించు సందర్భమున ఇది నాలుగు రకములుగా గలవు. మొదటి రకమున రెండు సున్నాలు అతి దగ్గరగానుండి, మధ్యగీతచే ఖండింపబడుట వలన, నాలుగు సమవృత్తములుగానున్నది.[3] రెండవరకమున, రెండు అర్ధవృత్తములు మధ్య గీతచే కలుపబడి యున్నను క్రింద భాగము చిన్నచురకవలె కలుప బడి యున్నది.[4] ఇక మూడవరకమున రెండు వృత్తముల క్రింది భాగము ఒకదాని కొకటి కలుపబడి, మధ్యగీతచే రెండు వృత్తముల సమభాగము చేయబడెను. పై అర్ధవృత్తములు రెండును, గుండ్రముగా నుండక, లోపలివైపు వంగి యున్నవి.[5] నాలుగవ రకము మామూలుగానే యున్నది.

శకటరేఫ ఒత్తక్షరముగా వాడినపుడు గూడ మూడు రకములుగా వాడబడినది. మొదటి అక్షరము సున్నను నాలుగు సమ భాగములుగ చేసినట్లును,[6] రెండవ అక్షరము సున్నను నాలుగు అసమ భాగములుగను,[7] మూడవ అక్షరము మూడు అసమ భాగములుగను[8] చేయబడి యున్నవి.

'శ' కార రూపము గూడ గమనింపదగినది. ఇది రెండు అర్ధవృత్తము క్రింద భాగములు కలిసి యున్నట్లున్నవి. మధ్యగీత లేదు. అందువలన శకట రేఫాక్షరమునకు, దీనికిగల తేడా తెలియ నగును. బహుశ మధ్యగీత లేకపోవుట వలన, ఇది శకటరేఫకు ముందు రూపము అయి వుండవచ్చును. ఈ లిపి పరిణామములను బట్టియు, సమకాలమునకు చెందిన శాసనలిపిలను బట్టి, ఈ శాసనము పైన చెప్పిన కాలమునకు చెందినదిగా నిర్ణయించవచ్చును. ఒకే శాసనము ఇన్ని లిపి రూపములుండుట చాల అరుదు. ఇన్ని రూపములు బహుశ బాణరాజుల శాసనములలో కాననగును.[11]

శాసన భాషయందు కొన్ని ప్రయోగములు గమనింప దగినవి. 'నూఱుఅఱుభట్టు' అనుపదమునందు 'నూఱు' అనునది విచారింతము. 'నూఱు'లో ఱ తరువాత కాలమున 'ట'గా మార్పు చెంది నూఱు -నూటగా మార్పుచెంది యుండవచ్చును. 'అఱుభట్టు' లోని చివరిదైనట్టు, ష్టుకు రూపాంతరము. అటులనే, వేప్రు - వేపురుకును, త్రికృ - త్రివిక్రమ శబ్దమునకును, చెబ్బశర్వ శబ్దమునకు చెందిన మార్పులు.

శాసనము స్వస్తి వాచకముతో ప్రారంభమయి, ప్రిధ్వీ వల్లభ, మహారాజాధి రాజ పరమేశ్వర [భటా] రకు ఎఱెయెప్పోరు పెమ్మాణపాడి పరిపాలిస్తుండగాను, తిమ్మ .... (అను వ్యక్తి ?) తకొళకంబు ఏలుతుండగాను, అతని 'పాళ' తండిరాముల కుచెన్ని ఏలుతుండెడివాడు. ఇతను కాశ్యప గోత్రుడయిన చబెశమ్మకు గ్రామదత్తి ఇచ్చెను. దీనికి వెల్గచుపాఱు, భట్టారకున్నును, నూఱు అఱుభట్టును సాక్షులు. దీనిని రేచేలు (అసునతడు) రక్షిస్తూ ఉండును (తాగిసివాన్ను). ఆ తరువాత శాసనము మామూలుగా వారణాసిలో వేయి అవులను చంపిన పాపాన బోదురు అను వాక్యముతో పూర్తి అయినది.

ఈ శాసనము బాదామి చాళుక్య శాసనములలో ముఖ్యమైనది. (1) రెండవ పులకేశి శిలాశాసనములలో (ఇప్పటి వరకు దొరికిన) మొట్టమొదటిగా పూర్తిగా తెలుగులో వ్రాసిన దిదియే. (2) కడప జిల్లాలో రెండవ పులకేశి శిలాశాసనమిదియే. (3) అనఖిషిక్త పేరుతో గల శాసనములలో నిది రెండవది, మొదటిది అనంతపూర్ జిల్లాలోని పెదవడుగూరు శిలాశాసనము. దానిలో 'ఎఱియతి అడిగళ్' అని పేరు గలదు. ఈ రెండు శాసనములలోగల రాజ బిరుదములలో తేడా కలదు. పెదవడుగూరు శాసనములో ఇతను "సత్యాశ్రయ శ్రీ ప్రిధ్వీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర పరమ భటారకు"నిగా వర్ణింపబడినాడు.[12] కానీ ప్రస్తుత శాసనములో శ్రీ ప్రిధ్వీ వల్లభ మహా రాజాధిరాజ పరమేశ్వర భటారకునిగానే పిలువబడినాడు. దీనిలో సత్యాశ్రయ బిరుదము లేకపోవుట వలన, బహుశ నిది పెదవడుగూరు శాసనము కన్న ముందుదే కావచ్చును. రెండవ పులకేశికి ఎఱెయప్ప, ఎఱెయప్పోరు, ఎఱియతఅడిగళ్ పేర్లు గలవని సర్వులకు విదితమే. దీనిని బట్టి ఈ శాసనము రెండవ పులకేశికి చెందినదిగా భావించవచ్చును.

అయితే ఇది ఎపుడు, ఏసందర్భమున వేయించి ఉండవచ్చు అన్న ప్రశ్న ఉదయించవచ్చు. ప్రస్తుతము భారతీయ పురాతత్త్వశాఖలో 'ఛీఫ్ ఎపిగ్రఫిస్ట్' గా పనిచేస్తున్న డా॥ కె. వి. రమేష్‌గారు రెండవ పులకేశి గురించిరాస్తూ 'తన పినతండ్రియైన మంగలేశుడు, తనకు వ్యతిరేకి అయినపుడు, రెండవపులకేశి బాణరాజ్యమునకు వలస పోయినాడు. అచట బాణరాజు సాదరముగా నాహ్వానించి తగినసహాయము చేయుటవలన, పినతండ్రిని వధించి బాదామి చాళుక్య సింహాసన మధిష్టించెను' అని చెప్పినారు. ప్రస్తుత శాసనములో 'ఎఱెయెప్పోరు పెమ్మాణపాడి పరిపాలిస్తుండగా' అని చెప్పుటవలన బహుశ పులకేశి ఆ ప్రాంతమును తన యేలుబడి క్రింద తెచ్చుకొనెను అని తెలియుచున్నది. అంతేగాక బాణరాజులు, బాదామి చాళుక్యుల స్నేహ సౌభ్రాత్వము గూడ తెలియుచున్నది. అందువలన, పులకేశి బాణరాజుల వద్ద

నున్నపుడు కొన్ని దానములుచేసి యుండుట తటస్థించి యుండ వచ్చును. అందులో ఈ శాసనము ఒక్కటి అయి వుంటుంది. ఇది మహారాజ పదవి నొందిన తరువాత చెక్కించిన శిలాశాసనమయి వుండవచ్చును" అన్నారు.

శాసనములోగల గ్రామనామములలో కొన్నిటిని మాత్రమే గుర్తించుటకు వీలగుచున్నది. పెమ్మాణపాడు - కడప - చిత్తూరు జిల్లాల ప్రాంతము. పెమ్మాణపాడు-పెరుంబాణపాడు - పెర్బాణ పాడి గాను తరువాతి కాలపు శాసనములందు కనిపించును. తకోళాళంబు సిద్ధవటం తాలుకాలోని తక్కోళగా గుర్తించవచ్చును. కుచ్చెన్ని అనునది గుర్తింపబడుట వీలుకాలేదు.[13]

## శాసన పాఠము

### మొదటి వైపు

1 స్వస్తి [॥ *] శ్రీ పృథ్వీవల్లభ మహారాజాధిరాజ
పరమేశ్వర [భటా]. —

2 రకు ఎఱెయపోత్తరు పెమ్మాణపాడి
ఏళవారి కళ తిమ్మ....

3 తకోళాళంబేళ పాళ తండిరాయుకు
కుచ్చన్ని ఏ -

### రెండవ వైపు

4 కుచు కాస్యా (శ్య) ప గోత్రస్య త్రిక్కబాలు
చబె శమ్మాకు

5 గ్రామదత్తి ఇచ్చిరి [॥ *] దే (దీ) నికి సాక్షి
వెళ్గచ్చు పాలు భట్టారకున్ను

6 నలు అరుభస్త్రు [॥ *] తాగిన వాస్త్రు
రాచేకు [॥ *]

### మూడవ వైపు

7 దే (దీ) నికి వక్రింబు వచ్చు వాస్త్రు బారణాసి
వేగ్రు పాలును వే గవిలు

8 వేసేబువృష్ట ఐచ్చినవాస్త్రిగు [॥ *]

### అధోజ్ఞాపికలు

* ఈ శాసనము ప్రచురించుటకు అనుమతించిన ఛీఫ్ ఎపిగ్రాఫిస్ట్, ఆర్కియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా, మైసూరు వారికి కృతజ్ఞతలు

9 దక్షిణ భారత శాసన సంపుటి, నెం. 9, సంఖ్య-45

10 శాసనమును చూపించిన అంకాళమ్మ గూడూరు వైస్ ప్రెసిడెంటు శ్రీ లక్ష్మిరెడ్డిగారికిని, శ్రీ రామిరెడ్డిగారికిని కృతజ్ఞతలు.

11 స్టడీస్ ఇన్ ఇండియన్ ఎపిగ్రఫి, వాల్యూం నెం. II, పే. 160-61

12 ద॥ భా॥ శా॥ నెం. 9, సంఖ్య 45

13 డా॥ కె. వి. రమేష్, 'పులకేశి II - హిస్ కెరియర్ అండ్ పర్సనాలిటీ' - ది చాలుక్యాస్ అఫ్ బాదామి - (సం) ఎం. ఎస్. నాగరాజారావు (1978), పే. 56-57

14 1982 ఫిబ్రవరిలో జరిగిన 8వ ఎపిగ్రాఫికల్ సొసైటి అఫ్ ఇండియానందు నేనుచదివిన ఆంగ్లవ్యాసమున కనువాదము ఇది.



# కలగూరగంప

## కలువకొలను కైఫియతు

ఈ గ్రామం ప్రస్తుతం పాలమూరిజిల్లా కొల్లాపురం తాలూకాలో ఉంది. ఇక్కడి కోట మిక్కిలి ప్రాచీనమయింది. మరియు పెద్దది. దానిని గోన వంశ ప్రభువు సింహ పద్మావతీదేవి భర్తయైన జయలక్ష్మీపతిరాయడు కట్టించినాడని ఈ గ్రామపు కైఫియతు తెలుపుతుంది.

గ్రామం కంటె మొదలిక్కడ ఒక 'పెద్దకొలను' ఉండెనట. దానిలో బంగారు వన్నె కలువ పూయు చుండెనట. అది చూచి జయలక్ష్మీపతిరాయడు అను గోనరెడ్డి దానికి ఉత్తరంగా శివాలయం మరియు నందిగుడి, దక్షిణంగా ముకుందస్వామి ఆలయం మరియు ఆంజనేయునిగుడి గట్టించి పిమ్మట తనకొలకు ఒక మేడ దానిచుట్టు కోట గట్టించి ఈ గ్రామానికి "కైరవ కాసాపురం" అని పేరు పెట్టెనట.

జయలక్ష్మిరాయడు దీనినేగాక వర్థమానపురం, పెద్ద పూడూరు, చిన్న పూడూరు మరియు నంది వనపర్తిని పాలిస్తు అక్కడ గూడ కోటలు గట్టించినాడట. అందుకు దాఖలాగా ఆ గ్రామాలలో కోట పేటలు వేరువేరుగా ఉన్నవని, కోటలలో సందు లున్నవని చెప్పుదురుకాని యితడెప్పటి వాడో తెలియదు.

ఈ గ్రామంలో అతి ప్రాచీనమైన శాసనాలున్నవి గనుక ఇది చాళుక్యల ఆరంభంనాటికే ఒకపట్టణంగా ఉన్నట్టు తెలుస్తుంది. కాకతీయుల కాలంలో దీన్ని చెఱుకు రెడ్లు పాలించినారు. క్రీ॥ శ. 1321-28 సంవత్సరాలలో దీనిని చెఱకు పోలయరెడ్డి పాలించినట్టు ఇక్కడి శాసనాలను బట్టి తెలుస్తుంది. పోలయతండ్రి ఇక్కడి దేవయ్య. దేవయ్యతండ్రి విశ్వనాధుడు. అతడు వేయించిన శాసన మొకటి అమరాబాదులో ఉన్నది. దేవయ్యకు బొల్లయరెడ్డి పోలయ రెడ్డి అని యిద్దరు కుమారు లుండిరి. వారిలో బొల్లయరెడ్డి అమరాబాదు సీమను, పోలయరెడ్డి కలువకొలను కోటను పాలించిరి.

తెలంగాణంలో పాలమూరి జిల్లాలోని గంగాపురం ప్రసిద్ధ మయింది. అక్కడ చెన్నకేశవుని ప్రతిష్ఠించిన వాడు హొమ్మళి రాయలని పరిశోధకుల మతం. హొమ్మళిరాయల కొడుకు మాయాపురీశ్వరు . అతడు తండ్రి చెన్నకేశవుని ప్రతిష్టించిన గంగాపురాన్నే పాలించినాడని శ్రీ విరూపాక్ష శ్రీరామ తామ్ర శాసనాలు పరిష్కరించిన వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు జెప్పిరి. మాయాపురీశ్వరుని కొడుకు తాత పిన్నమరాజు. అతడు అరవీటి వంశానికి మూలపురుషుడు. పిన్నమరాజు ఒక చెఱుకు రాజును గెలిచి అతని సప్తాంగాన్ని హరించినట్లు దోనేరుకోనేరు నాధుని బాలభాగవతంలో ఉంది కాని ఆ చెఱకు రాజు ఎవరో దానిలో పేరు జెప్పలేదు. పిన్నమరాజు కాలానికి సరిపోయినవారు మరియు అతని ప్రాంతంలో ఉన్నవారు ఇక్కడి చెఱకు రెడ్లే గనుక అతడు వీరిలోనే ఒకరిని జయించి వారి సప్తాంగాన్ని హరించి ఉంటాడు.

తాత పిన్నమరాజు కొడుకు సోమదేవరాజు. అతని శాసనాలు "ఏక దివస ఘటకైక ఘటీ హఠాహృత కోటరాచూరు, సాతానికోట, కందనవోలు, యాతగిరి, కలువకొలను మొసలి మడుగు, గంగనేని కొండాభిదాన సప్తదుర్గవర్తి" అని పొగడినవి. అతని యొక్క ఈ యేకదిన సప్తదుర్గ విజయాన్ని ద్విపద బాలభాగవతం, నరపతి విజయం, శ్రీ విరూపాక్ష, శ్రీరామ శాసనాలు గూడ ఏక కంఠంగా చెప్పినవి. సోమదేవరాజు క్రీ. శ. 1310-47 నడుమ ఉన్నట్లు చారిత్రికుల అభిప్రాయం, కలువకొలనులో క్రీ. శ. 1321-28 సంవత్సరాలలో చెఱకు పోలయరెడ్డి వేయించిన శాసనాలున్నవి కాబట్టి సోమదేవరాజు యితనినే జయించి ఉంటాడేమో !

ఈ కోటతో పాటు సోమదేవరాజు ఆనాడు జయించిన రాచూరు ఈనాడొక జిల్లా కేంద్రం. కందనవోలు ఇప్పటి కర్నూలు జిల్లా కేంద్రం. సాతానికోట, మొసలి మడుగు అలంపురం తాలూకాలో ఉన్నవి. యాతగిరి నల్లగొండ జిల్లాలో ఉంది. ఇవన్నీ యించు మించు ఆనాడు ఒకే దారిపై ఉన్న గ్రామాలు.

ఈ గ్రామం కైఫియతు ఇక్కడి నంది గుడి కోట నాశనమైన పిమ్మట పానుగంటి దొరలు ఆ కోటకు తూర్పున క్రొత్తగా ఈశ్వర, చెన్నకేశవ ప్రతిష్ఠలు జేసి ఇపుడున్న గ్రామాన్ని స్థాపించి దానికి "కలువ కొలను" అని పేరు బెట్టినట్లు చెబుతుంది. వారీ గ్రామాన్ని శా. శ. 1252లో స్థాపించిరట. ఇక్కడ క్రీ. శ. 1328 నాటి పోలయరెడ్డి శాసనమున్నది గనుక అతడున్నకోట సోమదేవరాజు దండయాత్రలో నాశనంకాగా పానుగంటి ప్రభువులీ క్రొత్త గ్రామాన్ని స్థాపించి ఉండవచ్చు. వారు అశ్వలాయన సూత్రులట.

పానుగల్లును క్రీ. శ. 142'లో గడియంకభీమ బిరుదాంచితుడైన "దేవనారాయణుడు" అనే కాశ్మీర బ్రాహ్మణుడు పాలించినట్టు ప్రస్తుతం అక్కడ ఉండే ఒక శాసనాన్ని బట్టి తెలుస్తుంది. దానిలో అతడు దానిని శ్రీశైల పశ్చిమ ద్వారమని గూడ పేర్కొన్నాడు. అతడు భారద్వాజస గోత్రుడు. బహుశః ఇతడు పైవారికి చెందిన వాడే కావచ్చు.

పానుగంటివారు కలువకొలనును క్రీ. శ 1432 వరకు పాలించిరి. అపుడు వారికి సూగూరు (వనపర్తి) జటప్రోలు(కొల్లాపురం) వారు సహాయంగా ఉండిరట. ఈ వంశంలో నారాయణరావుగారి పౌత్రులు దేవరాజుగారి పుత్రులు శేషా చలపతిరావుగారు పాలించుచుండగా పెద్ద కందనవోలు మరియు ఆ చుట్టుపట్లగల పట్టణాలపై తురకల పత్తిడి ఎక్కువై వారు పానుగంటి వారికి గూడ మేము మీ స్వాతంత్ర్యాన్ని అంగీకరింపము కాబట్టి మాకు కప్పం కట్టవలెనని తాఖీదు పంపిరి. అది చూచి వారు తురకలకు సామంతులుగా ఉండుటకు ఇష్టపడక మైసూరు వెళ్ళి అక్కడి ప్రభువును మా జమా బందీ మీరుతీసుకొని సహాయం చేయవలెనని అర్థించిరి.

మైసూరు వారు కన్నడులు. పానుగంటివారు వారితో సంప్రదింపులు చేస్తున్న సంగతి తెలిసి గోలకొండ కుతుబ్‌షాహీ ప్రభువులు వారిని సకుటుంబంగా చెరబట్టుకొని పోయి ఖైదు చేసిరి. ఇక ఆ పిమ్మట ఏమి జరిగింది తెలియదు కాని యిక్కడ వారి ప్రభుత్వం స్తంభించి పోయెను.

పానుగంటి వారిని కుతుబ్‌షాహీలు చెరబట్టుకొని వెళ్ళేటపుడు వారి కుటుంబం నుండి ఒక వ్యక్తి ఏలాగో తప్పించుకొని వెళ్ళి పునా జేరెనట. ఇపుడతని వంశమక్కడ "పానుగంటివారు" అనే పేరుతో ఉన్నదట. గత శతాబ్దమున ఆ వంశమున పెద్ద డాక్టరుండెనట.

పైవిధంగా యిక్కడ పానుగంటి వారి ప్రభుత్వం కూలిపోయిన పిమ్మట దీన్ని కుతుబ్‌షాహీల ఆధీనంలో కొంతకాలం దేశముఖులు, దేశాయీలు, దేశపాండ్యాలు గుత్తాలు తీసికొన్నారు. పిమ్మట పానుగంటి దొరలమనే పేరుతో "ఎత్తం"లో ఒక వంశం తలెత్తి ఈ గ్రామాన్ని తీసుకొని ఒకకోట గట్టుకొని పాలించ మొదలు పెట్టిరి.

"ఎత్తం" ఈ ప్రాంతంలో మరొక ప్రాచీన గ్రామం. అది శ. వ. 910 నాటి శంకరసుయొక్క అగస్త్యేశ్వర శాసనంలో వడ్డవాని సీమలోనిదిగా "తొంబది నాటిగా" "ఎత్తపియ 90" అని పేర్కొనబడింది. ఎత్తం నుండి ఇక్కడి కోటను అహోబలరావు, వెంకట శ్రీనివాసరావు, వెంకట కృష్ణారావు, పురుషోత్తమరావు, ధరణీపతిరావు, వెంకట గోపాలరావు, వెంకట నరసింహారావు, శ్రీనివాసరావు అనే ఎనమండుగురు దొరలు పాలించిరి.

ఎత్తం దొరలపై చివరి దినాలలో వనపర్తి, గోపాలపేట, మరియు కొల్లాపురం ప్రభువులు కలిసి దండెత్తి ఓడించి వారి గ్రామాలను తాము పంచుకొన్నారు.

ఎత్తం ప్రభువుల పరిపాలన ముగిసిన పిమ్మట దీన్ని సన్ 1268లో ప్రాగటూరు నివాసియైన "యిద్దుల్ ఖాన్" అనే నిజాం ప్రభువుగారి సేనాని తమరాజుగారితో "తన్ఖా జాగీరుగా" పొందెను. అతడీ గ్రామంతోపాటు మరి 3 గ్రామాలు గూడ పొంది ఉండెను.

ఆ వంశీయులు గులాం హైదర్‌ఖాన్, మహమ్మద్ అమీన్ ఖాన్, సర్ పరాజ్ అలీఖాన్ అనే వారు దీనినిపాలించినారు. మనకు స్వాతంత్ర్యం వచ్చేవరకు ఈ గ్రామం వారి జాగీరుగానే ఉన్నది.

ఈ విధంగా ఈ గ్రామం ఈ ప్రాంతంలో "ఆనాటి అగ్రహారము ఈ నాటికి ఖండ్రికాయె, ఈ నామాయెన్" అన్నట్టుగా ఒక రాజ్యానికి రాజధాని స్థితినుండి రాజ్యంలోని జాగీరు వరకు అన్ని దశలు అనుభవించి వివిధ పరిపాలనలు రుచిచూచి నిలిచింది కనుక ఇక్కడ అన్ని విధాల అవశేషాలు కనిపిస్తవి.

ఇక్కడ గ్రామంలోని శివాలయంలో ఉండే నంది మిక్కిలి సుందరంగా ఉండేది. దాన్ని పాలమూరులోని పిల్లల మర్రికి తీసుకువెళ్ళినారు. ఇటీవల అట్టిదే మరియొక నంది బయటపడగా గ్రామస్థులు దానిని మరల పూడ్చినారట. కోట అడుగున మరొక శాసనం గూడ బయట పడిందట. దానిపై గూడ గ్రామస్థులు మట్టి పోసి కప్పిరట.

ఇట్టి ప్రాచీన గ్రామాలు తెలంగాణంలో చాలా ఉన్నవి గాబట్టి వాటి చారిత్రికులు తిరిగి పరిశీలించ వలసిన అవసరం ఇప్పుడెంతైనా ఉంది.

ఈ గ్రామంలో "నారాయణ దాసు వారు" అనే విశ్వబ్రాహ్మణులున్నారు. వారు పంచానన వంశీయులకు జెందిన వీరభోజన పీఠానికి చెందిన సభాపతులు. పదునాల్గు తరాల నుండి ఇక్కడ ఉన్నారు. వారి దగ్గర నిజాముల్ముల్క్ అసఫ్జాహసన్ గారు హి 1196లో వీర భోజన పీఠానికి భూదానం చేసి యిచ్చిన సన్నదు ఉండేది. దానిని సన్ 1292లో అక్కడి జాగీర్దారు గులాం హైదర్‌ఖాన్ గారు తీసికొన్నాడు

ఈ వ్యాసానికి మాకు వారు తమ సన్నదు నుండి వాసి పెట్టుకున్న విషయాలు ఉపకరించినవి.

**శ్రీ కే. కిశోరుబాబు, శ్రీ కే. అశోకుబాబు**

# అక్బర్‌షా రచించిన సంస్కృత శృంగార మంజరి

నాయికా నాయకులు, రసాలంకారాలు, గుణదోషాలు, రీతి వృత్తులు, ధ్వనిభేదాలు మొదలైనవి అలంకార శాస్త్రంలో చర్చింప బడే అంశాలు. ఆలంకారికుల్లో కొందరీ విషయాల నన్నింటినీ తమ గ్రంథాల్లో చర్చిస్తే మరికొందరు వీటిలో ఏదో ఒక విషయాన్ని మాత్రమే గ్రహించి కూలంకషంగా చర్చించినారు. కావ్య శాస్త్ర విషయాల్లో ఏకదేశమైన నాయికా నాయక విభాగాన్ని తలస్పర్శిగా చర్చించిన సంస్కృత లక్షణ గ్రంథమే శృంగార మంజరి।

దీని కర్త అక్బర్‌షా. పదిహేడవ శతాబ్దికి చెందినవాడు. పూర్తిపేరు సయ్యద్ అక్బర్‌షా హుసేనీ. ఈతనికి 'బడే సాహెబ్' అనే వైభవ సూచకమైన మరోపేరు కూడా ఉన్నట్లు శృంగార మంజరిలోని ఈ క్రింది శ్లోకంవల్ల తెలుస్తుంది.

శ్రీ శాహరాజ పుత్రోఽప్యక్బరశాహో మహద్వంద్యః
యస్య బడేసాహెబ్ ఇతి నామ మహావైభవైకపదమ్ (అవతారిక)

శృంగార మంజరి అవతారికలో అక్బర్‌షా తన వంశ వృక్షంతోపాటు తనను గురించిన వివరాలనుకూడా పొందుపరచి నాడు. బందేనవాబ్ హజరత్ అక్బర్‌షా వంశంలో ముఖ్యుడట. ఈతని వంశంలోని శాహరాజుకు శాహరాజు, షానఫెజరుల్లా, అక్బర్‌షా అని ముగ్గురు కుమారులు. వీరిలో రెండవవాడైన షాన ఫెజరుల్లాకు షారాజు అనే కుమారుడు, అతనికి బడేసాహెబ్, మీర్ సాహెబ్, షా సాహెబ్ అని ముగ్గురు కుమారులు. వీళ్ళలో పెద్దవాడైన బడేసాహెబ్ శృంగార మంజరీకర్త. ఈతడు – తప శ్శక్తి, తేజస్విత, యశస్విత, ప్రజ్ఞ, ధర్మం మొదలైన గుణాల్లో తనకెవ్వరూ సాటిలేరనీ, తాను గొప్ప విద్వాంసుడననీ, అనిర్వచ నీయ గుణ సంపన్నుడననీ ఎంతో ఆత్మవిశ్వాసంతో చెప్పుకున్నాడు. చూడండి:

"కః కిల తపసా మహసా
యశసా జ్ఞానేన ధర్మేణ
అభవద్భవిష్యతి జగతి
బడేసాహేబేన సమః" (9 శ్లో.)

"యేషాం జ్యేష్ఠః శ్రీమాన్
విద్వాన్ మతిమాంశ్చకాస్తి విమలగుణః (శ్లో. 11)
అకబరమవచో గోచర
గుణమపి యథామతి ప్రశంసంతి" (శ్లో. 14)

అంతేకాక అకవర (అక్బర్) అనే తనపేరు "అ-క-వర" అనే పదచ్ఛేదంతో బ్రహ్మ, విష్ణువులను అతిక్రమించిన వాడనే అర్థాన్ని సూచిస్తుందనీ, 'బడేసాహెబ్' అనే తన రెండో పేరు మహేశ్వరత్వానికి సూచకమనీ అక్బర్‌షా ఎంత ధీమాతో చెప్పు కుంటాడో పరిశీలించండి.

"కో విష్ణుః కో బ్రహ్మ
తాభ్యాం శ్రేష్ఠస్తతోఽప్యకవరోఽయమ్
ప్రథయతి మహేశ్వరత్వం
యస్య బడేసాహెబితి నామాభ్యామ్" (13 శ్లో.)

అక్బర్‌షా తండ్రియైన షారాజు, గోలకొండను పాలించిన అబుల్ హసన్ తానాషాకు రాజగురువుగా ఉన్నవాడు. తండ్రి తరు వాత ఆ రాజగౌరవం అక్బర్‌షాకు ప్రాప్తించి ఉండవచ్చు కను కనే ఒక చోట "స్వయమక బరేణ భూభృన్మణి రంజితాంఘ్రిక మలేన" అని తనను గురించి చెప్పుకుంటాడు.

అక్బర్‌షా తొలుత తెలుగులో రచించిన శృంగార మంజరికి ఇది తానే సంతరించుకున్న సంస్కృతానువాదమని అవతారికలోని క్రింది శ్లోకాలవల్ల తెలుస్తుంది.

"తేనాంధ్రభాషయాఽయం రచితః శృంగారమంజరీ గ్రంథః
స్వయమకబరేణ భూభృన్ముకుటమణి రంజితాంఘ్రికమలేన" (15 శ్లో.)

"తద్విరచితాంధ్రభాషా కలితాం శృంగారమంజరీ చ్ఛాయామ్
సేవధ్వం సురవాణీ రచితాం రసతోషతారసిక భృంగాః" (16 శ్లో.)

దీన్నిబట్టి అక్బర్‌షా సంస్కృతంలోనే కాక తెలుగులో కూడా మంచి కవి పండితుడై విరాజిల్లి ఉంటాడని ఊహించవచ్చు. కాని అతని తెలుగు శృంగార మంజరి మన కింతవరకూ లభ్యం కాలేదు.

శృంగారమంజరిలో ప్రకరణ విభాగమేమీ కానరాకపోయినా ఇందులో చర్చింపబడ్డ విషయాలను బట్టి దీన్ని నాయికా విభాగం, నాయకవిభాగం, దూతీవిభాగం, రసవిభాగం–అని నాలుగు విభాగా లుగా విభజించవచ్చు. నాయికా నాయకభేదాలు, దూతీభేదాలు అతి విపులంగానూ, రసవిషయం సంక్షిప్తంగానూ చర్చింప బడ్డవి. నాయికా నాయకభేదాలను విపులంగా చర్చించిన గ్రంథాల్లో ప్రధాన మైన భానుదత్తుని రసమంజరి శృంగారమంజరికి ఆధార గ్రంథంగా తోస్తుంది. ఐనా చాలా చోట్ల అక్బర్‌షా రసమంజరీకారుని

# ఈ సంక్రాంతికి మీ యింట
# ఆప్కో పండించు
# రంగుల పంట



శోభాయమానమైన సంక్రాంతి రంగులను, ఆప్కో మీ కోసం రమ్యమైన నమూనాల్లో,
మృదువైన నిండు నీలి, అస్తమించు రవి అరుణ కాంతి, స్వచ్ఛమైన ఆకుపచ్చ,
తళుకులీను రాగి రంగులలో సృష్టించింది. ఈ సంక్రాంతికి కళ్లు మిరుమిట్లుగొలిపే
షర్టింగులు, డ్రెస్ మెటీరియల్స్, చీరెలు, రెడీమేడ్స్ ఇంకా గృహోపకరణములగు వస్త్ర
సమూదాయాలనెన్నింటినో మీకు సమర్పిస్తోంది. సంక్రాంతికి ఆప్కో షాపుకి వస్తారు కదూ!

**ఇంత అద్భుతమైన ఈ పండుగ కానుక**
**14 జనవరి '83 వరకు మాత్రమే!**

**ఆప్కో చేనేతలు**

KIRON/APCO/831

అభిప్రాయాలను ఖండించినాడు. కాని రసమంజరీ వ్యాఖ్యయైన 'ఆమోదా'న్ని మాత్రం పెక్కుచోట్ల ప్రామాణికంగా గ్రహించినాడు. రసమంజరీకారుడైన భానుదత్తుణ్ణి 'రసమంజరీ కారః' (పు. 19) అని ఏకవచనంలోనూ, ఆమోదవ్యాఖ్యాతయైన గురజాల శాయి పండితుణ్ణి 'ఆమోదకారాః' (పు. 19) అని బహువచనంలోనూ పేర్కొవడం అక్బర్‌షాకు ఆమోదకారునిపై ఉన్న గౌరవభావాన్ని సూచిస్తుంది.

రసమంజరి, ఆమోదం, పరిమళం, శృంగార తిలకం, రసిక ప్రియ, రసార్ణవం, ప్రతాప రుద్రీయం, సుందర శృంగారం, నరస కావ్యం, దశరూపకం, విలాస రత్నాకరం, కావ్య పరీక్ష, కావ్య ప్రకాశం మొదలైన లక్షణ గ్రంథాలనెన్నింటినో పరిశీలించి తాను శృంగార మంజరీ గ్రంథాన్ని సంతరించినట్లుగ అక్బర్‌షా గ్రంథారంభంలో చెప్పుకున్నాడు. పై గ్రంథాల్లో పేర్కొబడ్డ 'నరస కావ్యం' నరస భూపాలీయం కావచ్చు. సుందరశృంగారం, రసికప్రియ అనేవి హిందీ లక్షణ గ్రంథాలు.

అక్బర్‌షా రచనా విధానం విశిష్టమైంది. ప్రాచీనాలంకారికులు చెప్పిన అభిప్రాయాలను యథాతథంగా గ్రహించలేదు అక్బర్‌షా. ఈతడు ప్రాచీనులు చెప్పిన లక్షణాల్లో అయుక్తమైన వాటిని పరిత్యజించి యుక్తమైన వాటిని మాత్రమే గ్రహిస్తూ, పూర్వగ్రంథాల్లో లక్షణాలు లేని వాటికి లక్షణాలను సంతరిస్తూ, ఉదాహృతులు లేనివాటికి ఉదాహరణలు చూపుతూ, వివరంగా చెప్పవలసిన చోట వివరిస్తూ, సంక్షిప్తంగా చెప్పవలసినచోట సంక్షేపిస్తూ, పూర్వులు నామకరణం చేయని చోట్ల నామకరణం చేస్తూ, అయుక్త నామకరణం ఉన్నచోట్ల యుక్త నామకరణం చేస్తూ శృంగారమంజరిని రచించినాడు. ఈ విషయాన్ని తానే గ్రంథంలో స్పష్టంగా చెప్పుకున్నాడు. వీటిలో ఒకటి రెండింటిని మాత్రం పరిశీలిద్దాం.

విరహోత్కంఠితా లక్షణాన్ని వివరించే సందర్భంలో శృంగార మంజరీకారుడు రసమంజరి, సాహిత్య రత్నాకరం, నాట్య శాస్త్రం, ప్రతాపరుద్రీయం, నాయక భూషణం, ఆమోదం, మొదలైన గ్రంథాల్లో చెప్పబడ్డ విరహోత్కంఠితా లక్షణాల్లోని దోషాలను చూపుతూ "నివాస ఏవ కార్యాంతర వ్యాసంగ ప్రయుక్త ప్రియ విరహవతీ విరహోత్కంఠితా" (పుట 19)అని స్వయంగా కొత్త లక్షణాన్ని నిర్వచిస్తాడు. ఇట్లా ప్రాచీనులు చెప్పిన లక్షణాలను తోసిపుచ్చి అక్బర్‌షా కొత్తగా నిర్వచించిన లక్షణాలెన్నో శృంగార మంజరిలో కనిపిస్తవి.

అనుశయాన అనే పరకీయా నాయికా భేదానికి ప్రాచీనాలంకార గ్రంథాల్లో భేదత్రయం ఉన్నట్లుగ చెప్పబడ్డా ఆ భేదాలు అనామకంగానే ఉన్నాయి. శృంగార మంజరిలో వీటికి విఘటిత సంకేత, అప్రాప్త భావి సంకేత, శంకిత సంకేత జారగమన అనే నూతన నామకరణం చేయబడింది. అక్బర్‌షా ఈ విషయాన్ని ఇట్లా స్వయంగా చెప్పుకున్నాడు.

"ప్రాచీనాఖిల గ్రంథేషు అను శయానా భేదత్రయ స్యాపి నామ కల్పనం నాస్తి, అస్మాభిర్నామాని కల్ప్యంతే"

అంతేకాక పెక్కుచోట్ల పూర్వ గ్రంథాల్లో లేని వివరణ కనిపిస్తుంది. నాయికా భేదాల్లోనూ, దూతీ భేదాల్లోనూ ప్రతిభేదానికి ఉత్తమా, మధ్యమా, అధమా అనే భేదత్రయం కల్పించడం, దూతీ భేదాల్లో విక్రేత్రీ, శంకితా అనే భేదాలను అవాంతర భేద సహితంగా నిర్దేశించడం మొదలైన వాటిని ఇందుకు ఉదాహరణంగా చెప్పవచ్చు.

అక్బర్‌షా అలంకార శాస్త్ర విషయాలను సునిశిత ప్రజ్ఞతో విశ్లేషించిన పండితుడు, విమర్శకుడు మాత్రమే కాదు. చక్కని కవిత్వాన్ని చెప్పగల ప్రతిభాశాలి కూడా. గ్రంథారంభంలోని ఈ క్రింది గద్య భాగాన్ని పరిశీలిస్తే ఈ విషయం అవగతమౌతుంది.

"చతురబ్ధి పరివేష్టిత సర్వం సహేశనుత శౌర్య ధైర్య మనోహర లావణ్య సంగీత లలిత సాహిత్య భావజ్ఞతా సద్భక్త్యాంచిత్య కలిత సులతాన్ అబుల్ హసన్ క్షోణీశమకుట తట దేదీప్యమాన రుచిరతర రత్నకిరణ నీరాజిత కల్పతరు కిసలయ సదృశ చరణ గురురాజ శాహరాజభక్తి మాత్ర సద్గుణ గరిష్ఠ పరిమిత హిత వాక్య పాండిత్య యుక్త స్వమత పరమత సంపన్న సిద్ధాంత నిరంతర సంస్థాపనాఖిల నవరసాలంకార నవ్యగుణైక కవన ధౌరేయతా కలిత సన్నిధాన శ్రుతి స్వరస్థాన రాగాంగగాన క్రియా స్థాయి గమక ప్రబంధ ధాతుగాయన గుణ తతానద్ధ సుషిర ఘనగాత్ర భేద క్రియాగ్రహ జాతిమార్గ తాళ దేశికాతాల దేశికా తాల తత్వజ్ఞ నిధి పాఠికాశ్రిత కవి బంధుమిత్ర బడే సాహెబాక్బర్ శాహః శృంగార మంజరీ గ్రంథరాజం రుచిరం విరచయతి."

కేవలం లక్ష్యలక్షణ ప్రదర్శనైక పరమైన గ్రంథంగా కాక ప్రాచీన లక్షణ గ్రంథాల నెన్నింటినో అవలోడనం చేసి శృంగార మంజరిని ఒక విమర్శనాత్మకమైన లక్షణ గ్రంథంగా సంతరించి సాహిత్య శాస్త్రానికి సేవచేసిన అక్బర్‌షా చిరస్మరణీయుడు.

సంస్కృత శృంగారమంజరికి మూలమైన అక్బర్‌షా "ఆంధ్రశృంగార మంజరి" లభిస్తే అది తెలుగులోని అలంకార శాస్త్రానికి ఒక అమూల్యాలంకార మవుతుందనడంలో అతిశయోక్తి లేదు.

1. శృంగార రసమంజరి - సంపాదకులు డా॥ వి. రాఘవన్. 1951లో హైదరాబాదు ప్రభుత్వంవారి పురావస్తు శాఖవారు ప్రచురించినది.

డా॥ ఆర్. శ్రీహరి

# శాస్త్ర నిఘంటువులు - ఆవశ్యకత

ప్రస్తుతయుగంలో అన్ని రంగాలలో వైజ్ఞానిక విప్లవం జరుగుతోంది. శాస్త్రీయ, సాంకేతిక పరిజ్ఞానం ప్రతినిత్యం విపరీతంగా పెరిగిపోతోంది. ఈ పెరుగుతున్న విజ్ఞానం అనేక పత్రికలలో వ్యాసాల రూపంలోను, గ్రంథాలలోను వెలువడుతోంది. ఇట్లా ప్రచురితమవుతున్న సాహిత్యం ఇంగ్లీష్ భాషలోనే కాకుండా, అనేక ఇతర ప్రపంచ భాషలలో కూడా వస్తోంది. ప్రపంచ శాస్త్రీయ, వైజ్ఞానిక సాహిత్యంలో సుమారు 40 శాతం మాత్రమే ఇంగ్లీష్ భాషలో లభ్యమవుతోంది. మిగిలిన 60 శాతం జర్మన్, ఫ్రెంచ్, రష్యన్, జపనీస్, స్పానిష్, చైనీస్, స్వీడిష్, ఇటాలియన్ పోలిష్, హంగేరియన్, డేనిష్, నార్వీజియన్, జెక్, రామేనియన్, డచ్, ఫినిష్ పోర్చుగీస్, బల్గేరియన్ మొదలైన భాషలలో వస్తోంది. భారతదేశంవంటి అభివృద్ధి చెందుతున్న దేశానికి ఒక్క ఇంగ్లీష్ భాషలో ఉన్న శాస్త్ర, సాంకేతిక ప్రచురణలతో సంతృప్తి పడితే వేగంగా పురోగమిస్తున్న ఇతర దేశాలతో సమాన స్థాయిని అందుకోవడం సాధ్యంకాదు. ఈ పరిస్థితిని ఇంకా క్లిష్టతరం చేయడానికా అన్నట్లు మనదేశంలో అధికారికంగా జాతీయ భాషలుగా గుర్తింపు పొందినవి 15 భాషలున్నాయి. ఇన్ని భాషలలో శాస్త్ర విజ్ఞానాన్ని బోధించడమంటే చాలా జటిల సమస్యలు ఎదురవుతాయి. ఇందుకు కావలసిన ప్రధాన అవశ్యకాలలో నిఘంటువులు ఒకటి. విదేశీ భాషలనుంచి భారతీయ భాషలలోకి అనువదించడానికి, ఒక భారతీయ భాషనుంచి ఇంకోదానిలోకి అనువదించడానికి కూడా పనికివచ్చే నిఘంటువులు కావాలి.

రష్యాలో బాగా అభివృద్ధి చెందిన భాషలు డజనుకి పైనే వున్నాయి. ఇవికాక మాండలికాలకు లెక్కలేదు. వీటి లిపులు వేరు. మూలాలువేరు. భాషాలక్షణాలు వేరు. అయినప్పటికి వారు ఏకభాష, ద్విభాష, బహుభాష నిఘంటువులను తయారుచేసుకుని శాస్త్రవిజ్ఞాన బోధన సమస్యను పరిష్కారం చేసుకున్నారు. ఇదే విధంగా జపాను ఇస్రేల్, ఇండోనేషియా, టర్కీ, ఇతర అభివృద్ధి చెందుతున్న దేశాలలో కూడా వారివారి జాతీయ భాషలను అభివృద్ధి చేసుకోవడానికి కృషి జరిగింది; జరుగుతోంది.

భారతీయభాషలలో ఆధునిక వైజ్ఞానిక అవసరాలకు అనువైన సాధారణ నిఘంటువులు లేవనే చెప్పాలి. ఇప్పుడున్న నిఘంటువులన్నీ కేవలం సాహిత్య దృష్టితో తయారుచేసినవే కాని శాస్త్ర రచయితలకు, అనువాదకులకు ఉపయోగపడేవి కావు. ఇందుకు భిన్నంగా ఇంగ్లీష్, ఫ్రెంచ్, జర్మన్, రష్యన్ వంటి భాషలలో అనేకరకాల సాధారణ, సాంకేతిక, వైజ్ఞానిక నిఘంటువులు సులువుగా దొరుకుతాయి. సాధారణశాస్త్ర నిఘంటువులే కాకుండా, వృక్షశాస్త్రము, రసాయన శాస్త్రము, భౌతికశాస్త్రము, భూవిజ్ఞాన శాస్త్రంవంటి వేరువేరు శాస్త్రాలకు ప్రత్యేక నిఘంటువులున్నాయి. మళ్ళీ ఒక్కొక్క శాస్త్రంలో వివిధభాగాలకు ప్రత్యేక నిఘంటువులున్నాయి. జన్యుశాస్త్రము, కేంద్రక భౌతిక శాస్త్రము, కర్బనరసాయన శాస్త్రము, శిలాశాస్త్రము, వంటి శాస్త్ర విభాగాలకు ప్రత్యేక నిఘంటువులున్నాయి.

ప్రధాన యూరోపియన్ భాషలకు భారతీయ భాషలకు ద్విభాష నిఘంటువుల ఆవశ్యకతను అర్థంచేసుకోవటానికి పెద్దగా కష్టపడనవసరంలేదు. రష్యన్‌లు ఈ విషయాన్ని ఏనాడో గుర్తించారు. వారు మనదేశంలో వివిధ రాష్ట్రాలనుంచి భాషా నిపుణులను ఎంపికచేసి రష్యన్‌కు - ప్రధాన భారతీయభాషలకు నిఘంటువులను తయారు చేస్తారు. వారు ఇటీవల ప్రచురించిన రష్యన్ - తెలుగు నిఘంటువు, ఇతర రష్యన్ నిఘంటువులు ప్రస్తుత అవసరాలు తీర్చడానికి చాలా అనువుగావున్నాయి. ఇదేవిధంగా జర్మనీలో మాక్స్‌హ్యూబర్ వెర్‌లాగ్ అనే సంస్థవారు జర్మన్‌కు - భారతీయ భాషలకు మధ్య అనేక పారిభాషిక పదకోశాలను ప్రచురించారు. వీటిలో కిందివి పేర్కొనవచ్చు.

1. జర్మన్—ఇంగ్లీష్—తమిళం—తెలుగు—కన్నడం

2. జర్మన్—ఇంగ్లీష్—హిందీ—మరాఠీ

3. జర్మన్—ఇంగ్లీష్—బెంగాలి—ఉర్దూ

వీటన్నిటిలో జర్మన్ మూలభాషగాను; ఇతరభాషలు లక్ష్యభాషలుగానువున్నాయి. వీటిలో ప్రతి ఒక్కభాషను మూలభాషగాచేసి దానినుంచి జర్మన్ లక్ష్యభాషగా వుండేటట్లు వ్యతిరేక దిశలో నిఘంటువులు తయారుచేస్తే భారతీయ విద్యార్థులకు చాలా ఉపయుక్తంగా ఉంటాయి. యూరోపియన్ భాషలకు - హిందీకి మధ్య ద్విభాష

నిఘంటువులను తయారు చేయవలసిన అవశ్యకతను భారత ప్రభుత్వంవారు ఇటీవలే గుర్తించి, జర్మన్-హిందీ, హిందీ-జర్మన్ నిఘంటువులను తయారుచేసే పథకాన్ని 1977లో చేపట్టారు.

## విద్యార్థుల అవసరాలు

శాస్త్రపరిశోధకులకు, సామాన్య పాఠకులకే కాకుండా విద్యార్థుల అవసరాలు తీర్చడానికి కూడా నిఘంటువులు కావాలి. ప్రస్తుతం మనదేశంలో వివిధ స్థాయిలలో బోధనా మాధ్యమాలుగా వివిధ భాషలను ఉపయోగిస్తున్నారు. ఈ పరిస్థితిలో కొంతమంది విద్యార్థులకు ఏదో ఒక దశలో ఒక మాధ్యమం నుంచి ఇంకో మాధ్యమానికి మారవలసిన అవసరం రావచ్చు. నిఘంటువులు, ఇతర గ్రంథాలు లేకపోవడంవల్ల ఈ మార్పు కష్టతరమవుతుంది. ఏ రెండు భారతీయ భాషలమధ్య మార్పుకావాలన్నా, ఏ భారతీయ భాషనుంచి ఇంగ్లీష్ మాధ్యమానికి మారాలన్నా ఇదే పరిస్థితి వర్తిస్తుంది. కళాశాల స్థాయిలో ఒక భారతీయ భాషనుంచి ఇంగ్లీష్ మాధ్యమానికి మారాలనుకొన్న విద్యార్థికి ఇంగ్లీష్ — భారతీయ భాష నిఘంటువే కాకుండా భారతీయ భాష - ఇంగ్లీష్ నిఘంటువు కూడా కావాలి. ప్రస్తుతం ఇటువంటి నిఘంటువులేవీ ఉపయుక్తమైనవి లేవు.

పాఠ్యగ్రంథ రచయితలు కొన్ని సందర్భాలలో పెద్దఎత్తున నూతన కల్పనలు చేస్తూవుంటారు. అందువల్ల ఇప్పుడు అందుబాటులో ఉన్న పాఠ్యగ్రంథాలను ఆధారంగా చేసుకొని సాంకేతిక నిఘంటువులను ఇంగ్లీష్ - భారతీయ భాషకు తయారు చేయవలసివుంటుంది. అంతే కాకుండా వివిధ పాఠ్యాంశాలలో పాఠ్యగ్రంథాల ఆధారంగా ఇంగ్లీష్ - భారతీయ భాషకు ద్విదిశాత్మక నిఘంటువులు కూడా కావాలి.

## పాఠ్యగ్రంథ రచయితల అవసరాలు

భారత ప్రభుత్వము, వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు వేరు వేరు శాస్త్రరంగాలలో ఇంగ్లీష్ — భారతీయ భాష దిశలో పారిభాషిక పద కోశాలను ప్రచురించారు. వీటిలో చాలావరకు నామవాచకాలు, కొన్ని క్రియలు చేర్చడం జరిగింది. కళాశాలస్థాయి పాఠ్యగ్రంథాల రచనలో ఎదురయ్యే భావనాత్మక సమస్యలను సాధ్యమైనంత వరకు ఇవి పరిష్కరిస్తాయి. కాని పాఠ్యగ్రంథ రచయితకు ఇవి చాలవు. ఉదాహరణకు జీవశాస్త్రంలో రిప్రొడక్షన్ అనే మాటకు రిప్రొడ్యూస్, రిప్రొడ్యూసింగ్, రిప్రొడ్యూస్డ్, రిప్రొడక్టివ్ మొదలైన వ్యాకరణ వైవిధ్యాలుంటాయి. వీటిని వివిధ రచయితలు విభిన్న విధాలుగా అనువదిస్తారు. సాధారణంగా వీరు సమానార్థకమైన ఒకే మాటను వాడరు; పొడవాటి సమాసాలు వాడతారు. రచయిత వాడిన పదము సిఫార్సు చేసిన, సరి అయిన పదమా కాదా తేల్చుకోవాలంటే భారతీయ భాష — ఇంగ్లీష్ పారిభాషిక పద కోశంగాని, నిఘంటువుగాని అవసరమవుతుంది.

## ప్రాథమిక నిర్వచనాత్మక నిఘంటువులు

శాస్త్ర నిఘంటువుల తయారీలో మొదటి మెట్టుగా భారత ప్రభుత్వం 1963లో వృక్షశాస్త్రం, భౌతికశాస్త్రం, రసాయనశాస్త్రం మొదలైన వాటిలో వేరు వేరుగా హిందీలో ప్రాథమిక నిర్వచనాత్మక నిఘంటువులను తయారు చేసే పథకాన్ని చేపట్టారు. వృక్ష శాస్త్ర నిఘంటువును ఉదాహరణగా తీసుకుంటే దానిలో 112 పేజీలున్నాయి. ఇది 1967లో ప్రచురితమయింది. దీనిలో సుమారు 1800 పదాలు చేర్చారు. ప్రతి పదానికి మొదట హిందీ రూపము, తరవాత ఇంగ్లీష్‌లో దాని సమానార్థకం వుంటాయి. ఆ పదానికి హిందీలో నిర్వచనం వుంటుంది. కొన్ని సందర్భాలలో క్లుప్తంగా విశదీకరణ కూడా వుంటుంది. కొన్ని పదాలు కూడా చేర్చారు. పదాలు చాలా వరకు నామవాచకాలు మాత్రమే. కొన్ని మొక్కల పేర్లుకూడా చేర్చారు. ఈ నిఘంటువు ఇంటర్మీడియట్ తరగతి స్థాయిలో వుంది కాని అదీ సంపూర్ణంగా లేదు. రసాయన శాస్త్ర నిఘంటువులో ప్రఖ్యాత రసాయన శాస్త్రవేత్తలను గురించి, వారి చిత్రాలతోసహా చేర్చారు. ఏ భారతీయ భాషలోనైనా శాస్త్ర నిఘంటువును ప్రచురించడంలో ఇదే తొలి ప్రయత్నమని చెప్పవచ్చు.

ఇదే ప్రాతిపదిక మీద డిగ్రీ స్థాయి విద్యార్థుల కోసం వివిధ మానవీయ, వైజ్ఞానిక శాస్త్ర విభాగాలలో వేరు వేరుగా నిఘంటువులను తయారు చేసే పథకాన్ని తెలుగు అకాడమీ వారు నిర్వహిస్తున్నారు. ఏమైనప్పటికీ ఈ రంగంలో మనదేశంలో ఇంకా చేయవలసింది ఎంతైనా వుంది. ఈ కంప్యూటర్ల యుగంలో, బహు భాషా బహుదిశాత్మక నిఘంటువులను ఇతర దేశాలవారు తయారు చేస్తుండగా మనం ఇంకా విస్తృతమైన ప్రయోజనాత్మకమైన శాస్త్ర నిఘంటువులను భారతీయ భాషలలో వెలువరించడంలో ఏ మాత్రం కాలయాపన చేయడానికి వీలులేదు.

డా॥ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి

# లేఖలు

## బౌద్ధానికి తర్కమున్నదా?

శ్రీ రేబల్లి వేంకటేశ్వర్లు బౌద్ధ మతము హిందూ మతమునకు భిన్నమైనదా? అని చర్చించినారు (సెప్టెంబరు, 1982 భారతి). పైగా "నేటి తార్కికులకు, శాస్త్ర వేత్తలకు కూడ బౌద్ధ మతము అనుసరణీయమైనది" అని కూడ అనగలిగినారు. తర్కంలో బౌద్ధమతము ఎంత వరకూ నిలుస్తుందనేదే నా ప్రశ్న. హిందూమతమని లేదు. సనాతన ధర్మమని మాత్రమే ఉన్నది. దానిని గుర్తించవలె. సనాతనధర్మంకన్నా బౌద్ధ మతము గొప్పదని చెప్పుటకు శాస్త్రసమ్మతమైన ఆధారము లేమీ లేవు.

బౌద్ధ మతము ఒక వ్యక్తి ద్వారా రూపొందినది. సనాతన ధర్మము ఎందరో మహామహుల, తపోధనుల, యోగీశ్వర మునిపుంగవుల తరతరాల అనుభవ వైభవముగా రూపొందినది. ఈ దృష్ట్యా బౌద్ధమతమేకాదు, క్రైస్తవ మతము, మహమ్మదీయ మతము, జైనమతము — ఈ విధమైన ఒకేఒక వ్యక్తిని ఆధారంగా చేసుకొని రూపొందిన మతాలన్నీ కూడ సనాతన ధర్మం కన్నా తక్కువ స్థాయిలోనే ఉంటాయి. ఇది తిరుగులేని సత్యము!

బౌద్ధ మతము, ఉపనిషత్తులను మించినది అని వ్యాఖ్య. ముఖ్యంగా వేదసమ్మతమైన యజ్ఞయాగాదులను కుల భేదములను ఖండించుటలో - బౌద్ధం ప్రశస్తమైనదనే అర్థాన్ని స్ఫురింప జేయడం జరిగింది. ఇది ఎంతవరకు నిజం? ఉపనిషత్తులు సనాతన ధర్మం క్రిందికి రాదా? గీత వేదసారం కాదా? జంతు బలిని, క్షుద్ర దేవతోపాసనను, సనాతన ధర్మము సమర్థించినట్లు ఎక్కడున్నది? మతం మత్తులో సనాతన ధర్మం పేరిట వెలసిన కొన్ని దురాచారములు, మూఢ నమ్మకములు వేద ప్రామాణ్యమును కించపరచవచ్చునేమో! యదార్థవాదానికి పట్టం కడితే వేదాల వైశిష్ట్యము, భారతీయ ధర్మ సౌందర్యము స్పష్టంగా తెలిసొస్తాయి.

బౌద్ధ మతం వేద ప్రామాణ్యాన్ని అంగీకరించదు. దేవుని గురించి చర్చ లేదు. పుట్టుక, చావు - రెండింటి మధ్య జరిగే ప్రాపంచిక జీవితం పైననే చర్చ ఉన్నది. ఈ చర్చంతా సనాతన ధర్మంలో ఎంతో చక్కగా, మరింత విపులంగా విశదీకరించబడి ఉంది. కర్మ, పునర్జన్మ, మోక్షం - ఇవన్నీ బౌద్ధంలోనూ, సనాతన ధర్మంలోనూ ఉన్నాయి. ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే బౌద్ధం అసంపూర్ణమని, ఉన్న కాస్త వివరణా సనాతన ధర్మం నుంచి దొంగిలించబడ్డదేనని! అందుకేనేమో వాల్మీకి రామాయణంలో బుద్ధుణ్ణి రాముడు 'దొంగ' అంటాడు. ఈ భాగం ప్రక్షిప్తమైందంటారు కొందరు. బుద్ధుణ్ణి దేవుణ్ణి చేసింది మన తెలివి తక్కువ తనమే. అయితే ఒక విషయం మాత్రం ఒప్పుకొని తీరాలి. ప్రపంచంలో ఏ ఇతర మత ప్రవక్తకూ లేనంత శాంతి ప్రియత్వము, ప్రేమ, క్షమా గుణము, మనోనైర్మల్యము బుద్ధునికున్నాయి. బౌద్ధంలో క్రమశిక్షణ పేరిట నిర్బంధముంది. సనాతన ధర్మం స్వేచ్ఛను ప్రసాదిస్తుంది. గీత ఒక్కటి చాలు సమస్తం తెలియ జెప్పడానికి!

బౌద్ధధర్మంఏర్పడడమే అసందర్భంగా కనిపిస్తుంది ఒక వృద్ధుని, ఒక వ్యాధిగ్రస్తుని, ఒక శవాన్ని చూచి - సర్వసుఖాలూ త్యజించి గౌతముడు బుద్ధుడౌతాడు. ప్రకృతిసహజాలైన చావు పుట్టుకలు, రోగాలు, రొచ్చులు- వీటిని చూచి సన్యసించడమనేది ఎంత మాత్రం సమర్థించదగినదో ఆలోచించవలసినది. అంతే సరియైన తర్కం లేకుండానే, ఒక్క మాటలో జీవితంపట్లపూర్తి అవగాహన లేకుండానే బౌద్ధం మొదలైందని అనుకోవచ్చు. ఒక నదీ వివాదం మూలంగా బుద్ధుడు సన్యసించినాడని డాక్టర్ అంబేద్కర్ భావించడం మరీ అర్థరహితం!

ఒక మనిషి మూలాన ఏర్పడిన మతాలకు, కాల క్రమేణా పరిణతి చెందిన మతాలకు భేదం తప్పకుండా ఉంటుంది. దేనికైతే ఎక్కువ అనుభవం ఉంటుందో, దానికే ఎక్కువ విచక్షణ ఉంటుంది. ఇది సర్వజన సమ్మతమే. ఈ రకంగా ఆలోచించినా సనాతన ధర్మానిదే పైచేయి అవుతుంది.

నాకు అన్ని మతాలు పరిహార్యాలు. ఈ మతాలకు ఎంత బిరాన స్వస్తి చెబితే అంతమంచిది. నా దృష్టిలో మతం అంటే పద్ధతి. చీకటి నుంచి వెలుగులోనికి, కష్టం లోంచి సుఖంలోనికి నడచుకొంటూ వెళ్ళేందుకు వీలుగా, మనిషికి తగినగుండెధైర్యాన్ని, ఆత్మబలాన్ని, నిగ్రహాన్ని, నిబ్బరాన్ని అందించగలిగేది - ఏ మతమైనా సరే అనుసరించదగ్గదే! నిర్దుష్టమైన వ్యక్తిత్వమే నాకు తెలిసిన మతం!

[ శ్రీ సర్దేశాయి తిరుమలరావుగారికి కృతజ్ఞతలతో ]

డాక్టర్ గుమ్మనూరు రమేష్ బాబు

తిరుపతి

# బౌద్ధ తామ్ర కరండము

1982 అక్టోబరు మాసమున 'భారతి' మాస పత్రికలో ప్రచురింపబడిన శ్రీ ముసునూరి సాంబశివరామ మూర్తిగారి వ్యాసం చదివితిని. లోగడ భారతి మాస పత్రికలలోను 1973 ఆగష్టు, 1971 డిశంబరు మరియు 1980 జూన్ 30వ తేది ఆంధ్ర దినపత్రికలో ప్రచురితమైన వారి వ్యాసములు చూడక పోయినా విషయము సంగ్రహముగా బోధపడింది. వారి చారిత్రక తృష్ణకు జోహార్లు. ముందుగా శ్రీ సాంబశివరామ మూర్తిగారు గమనించవలసిన విషయం ఒకటున్నది. అవైదిక మతములు బౌద్ధ మతము ఒకటే గాదు. జైనమతము గూడా. వారి వ్యాసము (1982, అక్టోబరు భారతి) పరికించగా వారి విషయావగాహనలో లోపమున్నట్లు తోస్తుంది. ఏలయన 'సిరిపోడి పూన్డి' తామ్ర శాసనంలోని "జినయ సీమము మూర్తట్టు దొంక కడ పొలము" (నేను శాసన పాఠము చూడలేదు) వాక్యములో జినయ పదము గౌతమ బుద్ధునికి అన్వయించుట తగదు. జైన మత ప్రచారకులు తీర్థంకరులు. వారినే 'జినులు' అనుట లోక విదితము. కావున 'దుళ్ళ' గ్రామము జైన క్షేత్రం కావచ్చును. జైన మతంలో 'హిందూ దేవతలకు వినాయకునితో సహా ప్రముఖ స్థానం ఇవ్వబడింది. ఇక ఏడిద గ్రామములోను, గుమ్మనేరువద్దను బౌద్ధ విగ్రహాలున్నట్లు తెల్పిరి. కాని అవి జైన విగ్రహాలు కావచ్చును. నేను 1981 సంవత్సరాది ప్రత్యేక సంచికలో 'వర్ధమాన మహావీరునిపై వ్యాసము ప్రకటించి యుంటిని. అందు బౌద్ధ, జైన విగ్రహాలను గుర్తించుటకు వివరణ ఇవ్వబడినది. అది చూచిన మీకే బోధపడకలదు. ఇక బౌద్ధ తామ్ర కరండము చిత్రము పరికించుటకు వీలు లేకుండా భారతిలో ప్రచురితమైనది. కావున శ్రీ సాంబశివరామ మూర్తిగారు విలాసము తెలిపిన వారిని కలుసుకొని ప్రత్యక్షంగా పై స్థలాలను జూడవలయునని నా కోరిక. అసలు వారు, భారతిలో ప్రకటించిన తరువాత 'పురావస్తు పరిశోధనశాఖ, డైరెక్టరు, హైదరాబాదు'కు తెలిపిన అసలు విషయం యిప్పటికే తెలిసెడిది. కావున శ్రీ సాంబశివరామమూర్తిగారు యీ క్రింది నొసగిన నా విలాసమునకు వ్రాసిన, విషయం పూర్తిగా తెల్సుకొనుటకు వీలగును.

డా|| ఘంటా జవహర్‌లాల్

పురావస్తు శాఖ

విద్యుత్‌నగర్, విశాఖపట్టణము - 530 024.



# సమైక్యత,
# కల్పించి పనిచేయడం -
# మన ధ్యేయం

* ఆంధ్రప్రదేశ్ పవిత్ర దేవాలయాలకు, మసీదులకు, గురుద్వారాలకు, చర్చిలకు నిలయం.

* ఇక్కడ ప్రజలు మత పరమైన అన్ని పండుగలను సమైక్యంగా జరుపుకుంటారు.

* మన రాష్ట్రంలో కుల, మత విచక్షణ లేకుండా జాతరలు, మేలాలలో ప్రజలందరూ పాల్గొంటారు.

* ఈ సమైక్యతను, సంఘీభావాన్ని యిదే విధంగా కొనసాగిస్తూ అందరి సంక్షేమానికి కలిసికట్టుగా కృషిచేద్దాం.

---

D I P R No. 32174 / Advt. / I / C 3 / 81–82.

# గ్రంథ విమర్శలు

## శ్రీ ఆంజనేయ చరిత్ర

[(పరాశర సంహితాంతర్గతము) సంస్కృత మూలముతో సహా ఆంధ్రతాత్పర్యము. తాత్పర్యకర్త - సాహిత్య విద్యా ప్రవీణ, భాషా ప్రవీణ, వైద్య విద్వాన్, శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రి, ఎం. ఏ. & ఎం. ఏ., పి. ఓ. ఎల్. క్రౌన్ సైజు మొదటి పుస్తకం పుటలు 560. వెల రూ. 12-00. రెండవ పుస్తకం 561-702 పుటలు. వెల 5 రూ. మూడవ పుస్తకము పుటలు 703-801. వెల 5 రూ. ప్రకాశకులు - శ్రీ హనుమత్సేవా సమితి, సత్యనారాయణ పురం, విజయవాడ - 520 011.]

అవతారమూర్తీ, ఆదర్శ మహాపురుషుడూ, భగవత్స్వరూపుడూ అయిన శ్రీరాముడు ఎంతో మంది భక్తులకు ఆరాధ్య దైవం. ఆయన దేవాలయాలు దేశమందంతటా ఎన్నో ఉన్నవి. భగవంతునివలెనే భగవద్భక్తులు కూడా అందరికీ ఆరాధ్యులే. కాని భగవంతునికిఉన్న ప్రాధాన్యం వారికి ఉండదు. సాధారణంగా వారిని పూజించేవారూ తక్కువే. వారికి దేవాలయాలు ఎక్కడో కాని కానరావు. కాని, ఆంజనేయుని విషయంమాత్రం దానికి భిన్నంగా కానవస్తుంది. అతడు శ్రీరాముని భక్తులలో అగ్రగణ్యుడు. అతని స్వామియైన శ్రీరామునికి ఉన్నంత ప్రాముఖ్యం అతనికీ ఉన్నది. హనుమంతుని దేవాలయాలు కూడా దేశమంతటా విరివిగా ఉన్నవి. హనుమదుపాసకులు అద్భుతశక్తులు సంపాదించడం కూడా కానవస్తున్నది. అందువల్ల అతని చరిత్రను తెలుసుకొనవలెననే కుతూహలం ఉంటుంది.

హనుమంతునిగురించిన గాథలు చాలా ఉన్నవి. వాల్మీకంలో చెప్పబడని విషయాలను అభిజ్ఞులు చెపుతూ ఉంటారు. వివిధ గ్రంథాలలో విభిన్న రీతుల ఆ గాథలు కానవస్తాయి. కొన్నిటికి ఆకరాలు దొరకవు.

హనుమద్భక్తులు సంఘాలుగాఏర్పడి భజనల మూలంగానూ, ప్రబోధాల మూలంగాను, గ్రంథ ప్రచురణ మూలంగానూ భక్తి ప్రచారం చెయ్యడం ఒక సంప్రదాయం. విజయవాడ - సత్యనారాయణపురంలోని శ్రీ హనుమత్సేవా సమితివారు గ్రంథ ప్రకటనను కూడా హనుమద్భక్తి సాధనంగా స్వీకరించారు. శ్రీ ఆంజనేయ చరిత్రలోని 3 వ పుస్తకంలో ప్రకాశకుల మాటగా లక్ష్మణరావు గారు చెప్పిన మాటనుబట్టి యిదివరకు తొమ్మిది పారిజాతాలు వెలువడినట్లు, ఇది పదవ పారిజాతమైనట్లు తెలుస్తున్నది. పయిసేవా సమితివారు ప్రామాణికమైన ఆంజనేయ చరిత్రను ప్రకటింప దలచగా, వారికి వ్రాత ప్రతులలో శిథిలావస్థలో ఉన్న పరాశర సంహిత లభించినది. అది ఎన్ని అధ్యాయములు (పటలములు) ఉన్నదో తెలియదు. కాని అందులోని 16వ పటలం మొదలుకొని 50 పటలం చివరి వరకు శ్రీ ఆంజనేయ వృత్తాంతం ఉన్నది. సంస్కృతంలో శ్లోకరూపంలో ఉన్న ఆ గ్రంథ భాగాన్ని తెలుగు తాత్పర్యంతో ప్రకటించి, దీనికి "శ్రీ ఆంజనేయ చరిత్ర" అని పేరుపెట్టారు. సంస్కృతాంధ్రాది భాషల్లో విద్వాంసులైన అన్నదానం చిదంబరశాస్త్రిగారు తాత్పర్య కర్తలు. ఇందులో మొదటి పుస్తకం పెద్దది. అందులో 40 పటలాలవరకూ - అంటే 25 పటలాలు ఉన్నవి. మిగిలిన రెండు పుస్తకాలలోను ఐదేసి పటలాలున్నవి.

ఈ గ్రంథంలో ఆంజనేయుని చరిత్రతోపాటు, దానికి సంబంధించిన యితర చరిత్రలు కూడా ఉన్నవి. ప్రారంభంలో అష్టాక్షరీ మంత్ర ప్రభావం, హనుమన్మాలా మంత్ర విషయం, హనుమన్మంత్ర పునశ్చరణ, వివరణ మున్నగు విషయాలు ఉన్నవి.

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతోను, ఉదారుల విరాళాలతోను గ్రంథం ముద్రించబడింది. ముద్రణ చక్కగా ఉన్నది.

తాత్పర్యం సులభశైలిలో అందరికీ సుబోధంగా కూర్చబడి ఉన్నది. మూలాన్ని విడిచి కేవలం తాత్పర్యాన్నే తీసుకుంటే ఇది ఒక వచన కావ్యంగానే కానవస్తుంది. అందులో మూలాభిప్రాయం చక్కగా వివరించబడి ఉన్నది. మచ్చునకు క్రింది విషయం చూడవచ్చు.

మూలం -

శ్లో॥ ఇతి మత్వా మహాశూరో
పవనేహిమత్తాన,
ప్రవృద్ధేతు కపిశ్రేష్ఠే
దుర్దమం తస్యవాలధిమ్,
దదంశ తీవ్ర రదనః
త్రిశూలా కృతి రోమవాన్,

తాత్పర్యం —

అని తలచి గొప్పబలవంతుడగు హనుమంతుడు ఋతుపవనము లేర్పడినప్పుడు హిమవంతుడు పెరుగునట్లు పెరుగగా, పొంద శక్యముకాని యాతని తోకను పట్టుకొని తీక్ష్ణమగు దంతములు కల ఆ త్రిశూల రోముడు కొరికెను. వెంట్రుకలే త్రిశూలము వంటివైన, ఇక దంతముల రీతి యెంతటి తీవ్రమో తెలియుటకై "త్రిశూలాకృతి రోమవాన్" అని సార్థకముగా ప్రయోగింపబడినది. [పుటలు 238-239]

పయి తాత్పర్యాన్ని బట్టి శ్లోక, పద ప్రయోగాల సార్థక్యం కూడా తెలుపబడుతున్నట్లు గ్రహించవచ్చును.

సంస్కృత మూలంలోని ఆంజనేయ చరిత్రను సులభంగా గ్రహించుటకు ఈ గ్రంథం బాగా ఉపయోగపడుతుంది.

# కొండేపూడి సుబ్బారావుగారి పద్య రచనలు

కొండేపూడి సుబ్బారావుగారు అర్థశాస్త్రం ప్రధానవిషయంగా తీసుకుని ఆంగ్ల విద్యలో పట్టభద్రులై బాధ్యతాయుతమైన డిఫెన్సు అకౌంట్స్ విభాగంలో ఉద్యోగం నిర్వహిస్తున్నా గ్రంథరచనను సాగించడం, సారస్వతంపై ఆయనకు గల అభిమానానికీ, సహజ కవితాశక్తికీ దృష్టాంతం. ఆయన చాలా గ్రంథాలు రచించారు. గ్రంథ సమీక్షకు పంపబడిన అయిదు పద్యకృతులు ఇక్కడ పరిశీలింపబడుతున్నవి.

## శ్రీమద్రామాయణము

[క్రౌనుసైజు 290 పుటలు. వెల 12-00. ప్రతులు లభించు చోటు: రచయిత, 47-10-5, ద్వారకానగరు, విశాఖపట్టణం-16]

శ్రీమద్రామాయణ వైశిష్ట్యాన్ని గురించి ఎరుగని వారు లేరు. ప్రాచీన సంప్రదాయాన్ననుసరించిన విద్వత్కవులందరూ స్తోత్రరూపంగానో, శతక రూపంగానో, గద్య, పద్య కావ్యముల రూపకంగానో, దృశ్యరూపకంగానో రామాయణ కథను వర్ణిస్తూనే ఉంటారు. గద్యకావ్యాలకంటె పద్యకావ్యాలు శ్రావ్యంగా చదివి వినిపించడానికి అనుకూలంగా ఉంటాయి. కాని పద్యకావ్యాలు అందరికీ అర్థంకావు. దీనిని గ్రహించే, జన సామాన్యానికి సులభంగా అర్థమయే ద్విపదలలో రంగనాథ రామాయణం, కట్టా వరదరాజు రామాయణం మున్నగు రామాయణాలు వెలువడినవి. అవి చాలా పెద్ద గ్రంథాలు. వాటిని పూర్తిగా చదవడానికీ, వినడానికీ చాలా కాలం పడుతుంది. అందువల్ల, ఆ పద్ధతిలోనే స్వల్పకాలంలో రామాయణం పూర్తిగా తెలుసుకొనుట కనుకూలంగా ద్విపదలో సులభశైలిని ఇందులో యుద్ధకాండాంతం వరకూ కథ సంగ్రహించబడింది. రచయిత తమ రసవత్కవిత్వాన్ని ప్రదర్శించి 'కవి శేఖర, కవిభూషణ' బిరుదాలు సంపాదించినవారు. కాబట్టి వీరి రచన రసవంతంగా ఉంటుట సహజమే; మచ్చునకు —

"ఆ ముద్దులేడిని అవనిజ యరసి, రాముని వేగమె రమ్మని పిలిచి,
వన్నె వన్నెల లేడి బంగారు లేడి, కన్నెచూపుల నీలికన్నుల లేడి,
అరసి తే శ్రీరామ ! అది మన ముందు, తిరుగాడుచున్నది మురువు లొప్పంగ,
చూడలే దిటువంటి లేడి నెప్పుడును, వేడుకగా దీని పెంచెద నిచట
పారిపోవుచునుండె పట్టి తేతెమ్ము, శ్రీరామ ! తెమ్మంచు సీత ప్రార్థించె" (పుటలు 137-138)

## శ్రీ ఉత్తర రామాయణము

[క్రౌను సైజు 127 పుటలు. వెల 5 రూ. ప్రతులకు రచయితకు విశాఖపట్నం వ్రాయవలెను.]

రామాయణంలోని ఉత్తరకాండ కథను ప్రత్యేకగ్రంథంగా రచించినవారిలో నిర్వచనోత్తర రామాయణాన్ని రచించిన కవిబ్రహ్మ తిక్కన, ఉత్తరరామాయణాన్ని వ్రాసిన కంకంటిపాపరాజు ప్రసిద్ధులు. వారి రచనలు పద్యకావ్యాలుగా ఉండుటవల్ల, సులభంగా విషయం తెలుసుకొనుట కనుకూలంగా రచయిత శ్రీమద్రామాయణంవలెనే ఈ ఉత్తరరామాయణాన్ని కూడా ద్విపదలో రచించారు. శైలి చాల సులభపద్ధతిలోనే ఉన్నది. దీనికి వేరే ఉదాహరణను చూపనక్కర లేదు. ఇందలి కథాంశాన్ని సులభంగా తెలుసుకొనుటకు గ్రంథాదిని యుద్ధకాండం చివరి వరకూ గల కథ చాలా సంగ్రహంగా ద్విపదలోనే ఇయ్యబడినది. ఎక్కువ భాషాజ్ఞానం లేనివారు కూడా చదువుకొని గాని, వినిగాని సులభంగా అర్థం చేసుకొని ఆనందించగలరు.

## శ్రీ మహాభారతము

[క్రౌన్‌సైజు 141 పుటలు. వెల 5 రూ. ప్రతులకు గ్రంథకర్తకు వ్రాయవలెను.]

మన పురాణేతిహాస గ్రంథాలలో మహాభారతం చాలా పెద్ద గ్రంథం. ఈ విషయం దాని పేరులోనే సూచించబడి ఉన్నది.

అష్టాదశ పర్వాత్మకమైన ఆ గ్రంథాన్ని రచయిత చాలా సంగ్రహించి 141 పుటలలో ఇమిడ్చారు. ఇది మంజరీ ద్విపదలో వ్రాయబడింది. విషయ విభాగమేగాని, యిందులో పర్వవిభాగంలేదు. ఆ విషయాలు అరవైకి పైగా ఉన్నవి. భారతకథను గ్రహించడానికి ఈ గ్రంథం బాగా ఉపయోగిస్తుంది. రచన సులభ పద్ధతిలో జరిగినందున అందరూ అర్థం చేసికొనగలరు. శైలికి ఉదాహరణ –

"అరుదెంచి కృష్ణుడు హస్తినాపురికి, ముదమార బసచేసి విదురుని యింట,
కురువృద్ధులను జూచి కుశలమ్ము లడిగి, కొడుకుల క్షేమమ్ము కుంతికి దెలిపి,
మరునాడె చనుదెంచి నరపతి సభకు, ధృతరాష్ట్ర నరపతి సుతులను బిలిచి,
పేరోలగంబున పెద్దలతోడ, కృష్ణుండు వెంటనే ప్రియ భాషణముల,
ధృతరాష్ట్ర నృపతి తత్సుతులును వినగ, ధర్మజు వాక్యముల్ తప్పక నుడివి." [పుటలు 84–85]

ఇది కృష్ణుని రాయబారపుఘట్టంలోనిది. రచన సాధారణంగా ఉన్నది.

## శ్రీ మ ద్భా గ వ త ము

[క్రౌన్‌సైజు 311 పుటలు. వెల 12 రూ. ప్రతులు గ్రంథకర్తవద్ద లభించగలవు.]

శ్రీ మద్భాగవతాన్ని కూడా కొండేపూడి సుబ్బారావుగారు మంజరీ ద్విపదలోనే రచించారు. బృహద్గ్రంథమైన మహాభారతాన్ని చాలా సంగ్రహంగా రచించినా, ఈ భాగవతాన్ని మాత్రం అంతకంటె ఎక్కువ పుటలలో సమకూర్చారు. ఇందులో కథాంశం స్కంధాల విభాగంతో సంస్కృత భాగవతాన్ని అనుసరించే చెప్పబడింది.

రచన చాలా సులభశైలిలో జరిగింది. మచ్చునకు–

"గోపకుల్ జట్లుగా గూడి వేడుకగ, యమున యొడ్డునజేరి యాడుచుండంగ,
అచ్చోటికి ప్రలంబుడను రాక్షసుండు, బాలుడై యాటలో పాల్గొనవచ్చి,
బలరాము బుజములపై నెక్కి పెద్ద, బరువుగా నగుచును బాధించుచుండ,
బలరాముడును వాని వంచన నెఱిగి, ఒక గ్రుద్దుతో వాని యుక్కడగించె" (పుట 201)

## శ్రీ వేంకటేశ్వర కర్ణామృతము

[పద్యకావ్యము. క్రౌన్‌సైజు 80 పుటలు. వెల 3 రూ. లు. ప్రతులు విశాఖపట్టణంలోని గ్రంథకర్తవద్ద లభించును.]

సుబ్బారావుగారి భారత, భాగవత, రామాయణాలు ద్విపదలలో ఉన్నా ఈ పుస్తకం మాత్రం వృత్తాలలో రచించబడింది. ఇందులో ఏడు ఆశ్వాసాలున్నవి. రామకర్ణామృతం, కృష్ణకర్ణామృతం ఇంతవరకు ప్రసిద్ధంగా ఉన్నవి. ఆ విధంగానే ఇది శ్రీ వేంకటేశ్వరుని మహిమలను వర్ణిస్తూఉన్నది. ప్రథమాశ్వాసంలో శ్రీ వేంకటేశ్వర – ఆవిర్భావం, కల్యాణాష్టకాలు, దండకం, దివ్యదర్శనం ఉన్నవి. ద్వితీయాశ్వాసంలో శ్రీ విష్ణుస్వరూపం, దశావతారాలు వర్ణించబడినవి. మూడవ ఆశ్వాసం మొదలుకొని ఏడవ ఆశ్వాసం వరకు క్రమంగా స్వాయంభు వాదుల వివిధ సేవలు, తిరుపతి యాత్రానుభవం, స్తోత్రపాఠం, ఆత్మార్పణం, ఫలశ్రుతి అనే అంశాలు వర్ణించబడినవి. శైలి సులభంగా ఉన్నది –

ఉదా – "అవనిని ధర్మహాని యుదయమ్మయినప్పుడు నీవె సత్కృపన్
భువి నుదయించి దుష్టజనముల్ దునుమాడుచు సర్వవేళలం
దవిరళ దీక్షతోడ సజనావళికాపద బాపి ధర్మమీ
యవనిని నిల్పజాలిన దయాన్విత మూర్తివి వేంకటేశ్వరా!"
(పుట 21 ప. 73)

ఈ పుస్తకాలకన్నిటికీ ఒకే మాదిరి భూమిక కానవస్తున్నది. ఈ పుస్తక సముదాయాన్ని ముద్రించుటకు తిరుమల తిరుపతి దేవస్థానము వారి ఆర్థిక సహాయం కొంత లభించినది. కొన్ని పుస్తకాలలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి యొక్కయు, అమ్మవారి యొక్కయు వర్ణచిత్రాలు చేర్పబడియున్నవి. పుస్తకముల ఆకృతి, ముద్రణ చక్కగా ఉన్నవి. ఇవి అందరి ఆదరాన్ని పొందగలవని భావిస్తున్నాను.

శ్రీ బులుసు వేంకట రమణయ్య

## సర్దార్ జమలాపురం కేశవరావు

[రచన: శ్రీ హీరాలాల్ మోరియా. ప్రచురణ: సర్దార్ జమలాపురం కేశవరావు మెమోరియల్ కమిటీ, ఖమ్మం. వెల: రూ. 30]

నిజాంనిరంకుశ పరిపాలననుండి హైదరాబాదు సంస్థానానికి విమోచనం కలిగించిన నాయకులలో స్వామి రామనంద తీర్థ

గర్వాత చెప్పుకోవలసిన నాయకుడు జమలాపురం కేశవరావుగారు (1904-1953). ఆయన ఎంత గొప్ప నాయకుడో తెలుసుకోవాలంటే హైదరాబాదు రాజకీయ చరిత్రను పరిశీలించవలసి ఉంటుంది. పండిత జవహరలాలు నెహ్రూ ఆయనను ఒకమారు "దక్కన్ ప్రజల సర్దారు" అని సంబోధించారు. ఆంధ్రప్రదేశ్‌కు ముఖ్య మంత్రిగా కొంతకాలం సమర్థవంతంగా పనిచేసిన శ్రీ జలగం వెంగళరావుగారు "ఆనాడు మేమంతా ఆయన నాయకత్వంలోనే ఉద్యమాన్ని కొనసాగించాము" అన్నారు.

కేశవరావుగారు ఖమ్మంజిల్లా (అప్పుడది వరంగలుజిల్లా) మధిర తాలూకా ఎర్రుపాలెం గ్రామంలో జన్మించారు. నిజాం కాలేజీలో చదువుతూవట్టభద్రులు కాకమునుపేస్వాతంత్ర్యోద్యమంచే ఆకర్షితులై హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు ఉద్యమంలో చేరి, ప్రజానీకంలో ఎంతో చైతన్యం కలిగించి, సత్యాగ్రహియై కారాగార వాస క్లేశాన్ని అనుభవించి హైదరాబాదు విముక్తికి పాటు పడ్డారు. అయితే కేశవరావుగారు త్యాగం చేయడమే కాని, స్వాతంత్ర్యంవల్ల వచ్చిన రాజకీయ పదవులను అనుభవించిన వారుకారు. అప్పటి రాజకీయ పరిస్థితులు అటువంటివి. ఆయన జీవించిన కాలం కూడా చాలా తక్కువ. యాభై ఏళ్ళలోపువయస్సులోనే ఆయన దివంగతులైనారు.

అట్టి స్వాతంత్ర్య యోధుని చరిత్రను, ఆయన నాయకత్వం క్రింద హైదరాబాదు స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న ఒకానొక స్వాతంత్ర్య సమర యోధుడు శ్రీ హీరాలాల్ రచించడంవల్ల అటు కేశవరావుగారి జీవిత విశేషాలూ, ఇటు హైదరాబాదు రాజకీయ చరిత్రా వాస్తవికంగా ఈ గ్రంథం రూపంలో నమోదు కావడానికి అవకాశం కలిగింది. గ్రంథకర్త ఈరాజకీయ జీవితచరిత్రను అత్యంత ఉత్తేజకరంగా రచించడంలో కృతకృత్యులైనారని చెప్పవలసి ఉన్నది.

సాధారణంగా రాజకీయ జీవిత చరిత్రలు వ్రాయబడే విధంగానే ఈ చరిత్ర కూడా కాలక్రమాను సారంగా సాగడమేకాక దేశచరిత్రకూడా ఇందులో ప్రస్తావించబడింది. అయితే తెలంగాణా ప్రాంతంలో ఆ కాలంలో దేశచరిత్రను గూర్చి వ్రాయాలంటే తగు ఆధారాలు లభ్యం కానందువల్ల రచన చేయడం కష్టం. కారణమేమిటీ అంటే నైజాములో ఆ కాలంలో అన్నిటిపైనా, ఆంక్షలే. సభ జరుపుకోవాలంటే, సభలో వక్తలు మాట్లాడిన విశేషాలను పత్రికలకు వ్రాసి పంపాలంటే, ఆ పత్రికలు ప్రచురించాలంటే ఎన్ని అవరోధాలో! అయినప్పటికీ ఈ గ్రంథ రచయిత ఎన్నో వివరాలు సేకరింపగలిగారు. ఉదాహరణకు హైదరాబాదులోని పురాతన గ్రంథాలయాలలో ఒకటైన బాల సరస్వతి గ్రంథాలయానికి దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ప్రారంభోత్సవం జరిపినట్లు తెలిపారు. ఆ రోజులలో తెలంగాణాలో గ్రంథాలయోద్యమంద్వారా చదువు వచ్చిన ప్రజలలో ఎంతో రాజకీయ చైతన్యం కలిగింపబడింది. అట్లే నిజాం రాష్ట్రాంధ్ర మహాసభలు ఈ ప్రాంతంలో కలుగజేసిన జాగృతిని గూర్చి కూడ వ్రాశారు. ఆ తర్వాత స్టేట్ కాంగ్రెసు ఆవిర్భవించింది. ఇది అంతా ఒక మహాగాథ. దానిని స్వయంగా చూచిన రచయిత మాత్రమే ఆనాటి రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక చరిత్రను చెప్పగలడు. ఈగ్రంథంలో చెప్పుకోదగిన మరొకవిశేషమేమిటంటే అనేక విషయాలపై కేశవరావుగారు చేసిన ప్రసంగాలను రచయిత అంశములవారీగా ఉటంకించారు. పలు సమస్యలపై వారి దృక్పథాన్ని విశదీకరించారు. ప్రకాశం పంతులుగారితో కేశవరావుగారికి గల సామ్యం చెప్పారు. ధైర్యంలో, త్యాగంలో, దేశసేవాతత్పరతలో ఇద్దరూ సమానులే.

ఈ గ్రంథంలోని అధ్యాయాలను మరికొంత క్రమంలో పెట్టడానికి వీలున్నది. అయితే రచయిత తమకు తెలిసిన విషయాలన్నిటినీ గ్రంథస్థం చేయడానికి చూపిన శ్రద్ధ ఎడిటింగ్‌లో చూపలేదు. పుస్తకం అచ్చువేయడంలోనూ కొంత తొందరపాటు కానవస్తున్నది. అచ్చు అయిన పుస్తకంలో కొన్నిచోట్ల కలంతో తేదీలను సవరించారు. వాక్యాలనుకూడా సవరించారు. అయితే పుస్తకాన్ని తప్పుల తడకగా పాఠకులకు అందచేయడంకన్న కలంతో సవరించి ఇవ్వడం చాలావరకు మేలే. ఏమైనప్పటికీ ఆంధ్ర స్వాతంత్ర్య యోధులలో అగ్రగణ్యుడని చెప్పదగిన జమలాపురం కేశవరావుగారి జీవిత చరిత్రను ఇట్లా ప్రకటించడం ప్రశంసనీయమైనకార్యమే. హైదరాబాదు సంస్థాన స్వాతంత్ర్యోద్యమ చరిత్రను వ్రాయదలచుకున్న వారికి ఈ గ్రంథం చాలా ఉపకరిస్తుంది.

డి. రా

# గట్టి గింజలు (కథల సంపుటి)

[కర్త : వై. సి. వి. రెడ్డి. ప్రతులకు : వై. సి. వి. రెడ్డి సి. పి. ఐ. ఆఫీసు, కడప - 516 001. వెల : పదిరూపాయలు పేజీలు : 165]

ఇది ఇరవై యొక్క కథల సంపుటి. కథలన్నీ రాయలసీమ పల్లె వాతావరణాన్ని కళ్ళముందు నిలబెడతాయి. పల్లె జీవితాలను పరిశీలించితేనేగాని, కొన్ని సందర్భాల్లో అనుభవించితేగాని వ్రాయలేరనిపించే కథలు యివి. ఈ కథలు కల్పనగా గోచరించవు

అప్పులు, వడ్డీలు, వాటితో సంసారాలు శిథిలమైపోవడాలు, కూలీలు అప్పులు తెచ్చుకొని, అప్పులు ఇచ్చిన వారికి వడ్డీకింద జీవితాంతం చాకిరీ చేయడాలు, ఎక్కువ కథల్లో చోటు చేసుకున్న ప్రధానాంశాలు. చిత్తశుద్ధితో రాసినవే అనిపించినా, ఒకే విషయానికి సంబంధించిన కథలను ఏరివేసి సంపుటి వెలువరించివుంటే, మరింత హుందాగా వుండేది.

'మంచివాళ్ళు' కథ సంపుటిలో మొదటిది. సముచిత స్థానంలో వుంది. 'నేను' అనే పాత్రకు, పనీపాటా చేసుకుని బ్రతుకు కష్టంగా వెళ్లబుచ్చే గంగమ్మకి సహాయం చెయ్యాలన్న కోరిక వుంటుంది. కథ చివర్లో ఆ మాటే అంటే, 'అందరూ నన్ను మోసం చేసినారు, మోసాల్తో, దగాల్తో విసుగెత్తి పోయినాను బాబూ - మమ్మల్నిలా పనిపాటలు చేసుకోనివ్వండి, అంతే చాలు' అంటుంది. మంచితనం అనేది వున్నదంటే నమ్మలేని స్థాయికి చేరుకుంది ఆమె.

'బంగారు సొమ్ములు' చివరి కథ. చిన్నతనంలో సరోజ కోరితే, ముక్కుపుడక, చెవులకు బుట్టలు చేయిస్తుంది తల్లి, తన చెవుల కమ్మలు చెడగొట్టి. సరోజ పెరిగి పెద్దదవుతుంది. తల్లిదండ్రులు ఆమెకు ఏ సొమ్ములూ చేయించలేని పరిస్థితిలో వుంటారు. ఎట్లాగో ఆమె పెళ్ళి జరిపిస్తారు. తాళిబొట్టు గొలుసు పెట్టలేక పోతారు. ఆమె సంసారంలో పడ్డ తర్వాత, తిండీ, గుడ్డకు లోటు లేకపోయినా, తాళిబొట్టు గొలుసు చేయించుకోలేక పోతుంది. భర్త లాలనవుంది, ఆడదానికి అది చాలు, సొమ్ములెందుకు ? అని సర్దుకు పోతుంది. ఒక ఆడపిల్ల, ఇద్దరు మొగపిల్లలు పుడతారు. పిల్లల్ని చదివించడమే ధ్యేయంగా పెట్టుకుంటారు. అమ్మాయికి మంచి సంబంధం వస్తుంది. భూమి అమ్మి, కూతురికి పెట్టవలసిన సొమ్ములు పెట్టి, పెళ్ళి చేస్తుంది. మగపిల్లలు, ఉద్యోగాలు సంపాదించుకొని, పెళ్ళిళ్ళు చేసుకుంటారు. సరోజకు ఏ లోటూలేదు, తాళిబొట్టు గొలుసు తప్ప. అమ్మలేదు. భర్త చేయించలేడు. పిల్లల డబ్బుతో తాళిబొట్టు చేయించుకోవాలని, ఆమెకుగానీ, భర్తకుగానీ, ఇష్టంలేదు. ఆమె ఓర్పే ఆమెకు విలువైన సొమ్ము. గుణాల్నే సొమ్ములుగా మార్చుకున్నది. హృదయానికి హత్తుకునే కథ.

కొన్ని కథలు, స్త్రీ పేరుతో మొదలవటం ఒక విశేషంగా కనిపిస్తుంది. గడిసె దక్కింది, చావకూడని అందం, లోకం ఓడి పోయింది, పరువూ ప్రతిష్టలు మొదలైనవి, స్త్రీలగురించి వ్రాసినవి.

'దీనికంతెక్కడా.......' 'ఐదురూపాయలు' ప్రత్యేకంగా చెప్పుకోవలసిన మంచి కథలు.

సంపుటికి 'ముందు బాట' దాశరథి రంగాచార్య రాసారు. ఆయన చెప్పినట్టు "ఈనాటి కథాసాహిత్యంతో అలసిన మనసుకు 'గంట్టి గింజలు' పిల్ల తెమ్మెర లాంటివి."

## తెలంగాణా పోరాటు కథలు
(కథా సంకలనం)

[ప్రచురణ : జన సాహితీ సాంస్కృతిక సమాఖ్య (ఆంధ్రప్రదేశ్). పేజీలు 214. వెల: ఆరు రూపాయలు. ప్రతులకు : మైత్రి బుక్ హౌస్, లబ్బీపేట, విజయవాడ - 10.]

ఈ సకలనంలో ఇరవై మూడు కథలున్నాయి. కథలన్నిటిలో వస్తువు - తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం. దాదాపు కథలన్నీ, అప్పటి నైజాం వ్యవస్థలో జాగీర్దారులు, దేశ్‌ముఖ్‌లు, చేసిన దౌర్జన్యాలు, రజాకార్ల పైశాచిక దాడులు మొదలైన జరిగిన సంఘటనలను ఆధారం చేసుకుని వ్రాసినవి.

వాసిరెడ్డి నవీన్‌గారు ఈ కథల వెనుక చరిత్ర ఇట్లాచెప్పారు :

'నైజాం రాష్ట్రంలో ప్రజలు మాట్లాడ కూడదు, చదవ కూడదు, అదేమని ప్రశ్నించ కూడదు. వాయిబాసిసలు. ఒక్కొక్క దేశముఖ్‌కి, జాగిర్దార్‌కి వేలాది ఎకరాల పొలం, పదుల సంఖ్యలో సొంత గ్రామాలు ఉంటాయి. ఆ గ్రామాల ప్రజలను పీల్చి పిప్పి చేసే పన్నులను, లెవీలను వసూలు చేసుకుని, దేశముఖ్‌లు తమ ఖజానాకు తరలించుకు పోవచ్చు. కొంత నిజాంకి చెల్లించాలి. దేశముఖ్ ఇంట్లో ఏ చిన్నకార్యం జరిగినా, దాని ఖర్చు యావత్తు ప్రజలే భరించాలి. ఉదా: దొరవారింట్లో పెండ్లికోసం ఖర్చంతా షాదీపట్టి పేరు మీద ప్రజలనుంచే వసూలు చేసేవారు. దొరల గడీల్లో వందలాది నౌకర్లు వెట్టి చాకిరీ చెయ్యాలి ... .... దొరవారి దర్జాకు, ఠీవికి నిదర్శనంగా వారి 'కచ్చడం' (గూడు బండి) ముందు ఓ వెట్టివాడు ఎన్నిమైళ్ళ దూరమైనా, పరుగెత్తుతూ వుండ వలసిందే. ప్రతి విషయానికీ పన్నులు మామూలే. సమర్తపన్ను, పెళ్ళిపన్ను, చావుపన్ను ఇలా .... దొరగారు కోరుకున్న స్త్రీ ఏ స్థితిలో వున్నా ఆ రోజు రాత్రి గడీకి చేరుకోవలసిందే. ఇది ఇలా వుండగా అస్తమానమూ తణిఖీకి వచ్చే అధికారులకు వెట్టి చాకిరీ, వారి విందు భోజనాలు (కోళ్ళు, మేకలు) వారికోసం కన్నెపిల్లల బలి .... మామూలు విషయాలే. రైతులు వ్యవసాయ కూలీలుగా, వెట్టివాళ్ళుగా మారటానికి ఎన్నో రోజులు పట్టదు. వాళ్ళ జీవితాలు దొరల పొలాల్లోనే పండి పోతాయి. ఇదీ ఆనాటి తెలంగాణా స్థూల స్వరూపం. పౌరుషమున్న ఏ జాతయినా, స్వేచ్ఛకోరే ఏ ప్రజలయినా ఏం చేస్తారో తెలంగాణా ప్రజలూ అదే చేసారు.

ఈ దశలో కొన్ని కథలు వచ్చాయి. తెలంగాణా రచయితలతోపాటు, ఆంధ్రప్రాంత రచయితలూ వున్నారు. 'ఈ కథలను

చదివేటప్పుడు వీటిలో శైలీ, శిల్పం కోసం వెతకవద్దు, అది ప్రధానం కాదు.'

ఈ కథల చరిత్ర గురించి వ్యాఖ్యానం పాఠకుడిని ఆకర్షిస్తుంది. శైలీ, శిల్పం వున్న కథలూ వున్నాయి ఇందులో. చరిత్రను తెలుసుకోవాలన్న కుతూహలం వున్న ప్రతి పాఠకుడూ చదవవలసిన కథల సంకలనం యిది.

బాబు

# ఆంధ్ర రఘువంశము

(1, 2-భాగములు)

[శ్రీ ఆలమూరు వెంకటాచలము. వెల : ఒకొక్క భాగం 10 రూ. ప్రతులకు : నవోదయ పబ్లిషర్స్, విజయవాడ – 2]

కాళిదాస కృతికి భావానువాదముగా శ్రీ వెంకటాచలంగారు చెప్పారు కనుక అనువాదం గురించి ఇక ప్రశ్నలేదు.

పెద్దగురు పెద్దలు ముచ్చటగా మెచ్చుకున్నారు కూడా. వాల్మీకి వాసులను విడిచి సంస్కృత వాఙ్మయములో సమగ్ర కవితారీతుల చర లో అగ్రతాంబూలం పొందదగిన మహనీయుడు కాళిదాసు – అంటే ఎవ్వరూ కాదన లేరని నా అభిప్రాయం.

'రఘువంశకారం నరాకృతిం ప్రాహురజస్య నారీమ్' –

అని కావ్యకంఠ గణపతి ముని తమ ఉమా సహస్రములో అన్నారంటే ఆశ్చర్యంలేదు.

'కాళిదాస గిరాం సారం కాళిదాసస్సరస్వతీ
చతుర్ముఖోనవా సాక్షాద్విదుః, నాన్యేతు మా దృశః'

అని ప్రశంసించాడు పదవాక్యప్రమాణ పారావార పారీణుడు.

ఈనాడు కాళిదాసుకి ఎవ్వరూ ఏదో 'సర్టిఫికెట్టు' ఇంతకన్న ఇవ్వనక్కరలేదు. వాగర్థ ప్రతిపత్తి ఆ మహాకవి పుట్టు తొడవు. అలాటికవి 'నభూతో నభవిష్యతి ! .... ....'

వాల్మీకి రామాయణంలో చెప్పిన రాజుల నందరనూ అటు త్రోసి వైవస్వతుని పేరు చెప్పి దిలీపునితో ఆరంభించి రఘువును కావ్య నాయకుణ్ణి చేసి తన కావ్యనామం సార్థకం చేసుకున్నాడు కాళిదాసు.

అల్పాక్షరముల ననల్పార్థ రచనచేసి చూపిన కవి కాళిదాస అనుష్టుప్పులు చెప్పినా పెద్దవృత్తాలు చెప్పినా ఏ హిమగిరి శృంగా వేదవేదాంగ వేత్తల సభలో అధ్యక్ష స్థానములో ఉన్న ఏ మహా వరేణ్యుడో చెప్తున్నట్టు ఉంటాయా వాక్కులు. వాటిని తెలుగులో తెలుగులోనేకాదు ఏ దేశ భాషలోనూ అంత నింపుగా నింపు చెప్పడం సాధ్యం కాదని ఏబదేండ్లలో రచనానుభవంకల నేను కుంటాను. భవతు....

రఘువంశం తెలుగులో గద్యరూపంగానూ పద్యరూప గానూ పలుమంది పెద్దల చేతుల్లో అవతరించింది. ప్రకృత కృ శ్రీ వెంకటాచలంగారి భావానుకృతి....

'శక్తిః కవిత్వ బీజం హిప్రాక్తనీ సంస్కృియామతా'– అన్నారు ఆలంకారికులు – ఆ నిర్ణయం వెంకటాచలంగారి కృతిక ఆకృతి ధరించింది. చక్కని చిక్కని పదబంధం....

కేవలం పద్యమేకాక గద్యంకూడా చేపట్టి వెంకటాచల గారు కృతార్థులైనారు.

'వసిష్ఠధేనో రనుయాయిన తమావర్తమానం వనిత
వనాంతా
పపే నిమేషాలస పక్ష్మ పంక్తిః ఉపోషితాభ్యామివ లోచ
భ్యాం'

దీనికి చక్కని కందం మాకందంలాగా హృదయానందంగా ఉ చూడండి :

'వనిత పయస్విని వెనుకొని
వనవాటికనుండి తిరిగివచ్చు నిజేశున్
కనియె; కనుఱెప్ప వేయక
తనువెల్లను కన్నులుగ సుదక్షిణ నెమ్మిన్'—

తనువెల్లను కన్నులుగ చూసింది. సొంపైన తెనుగు పలుకుబ 'నెమ్మి' అనే పదం నింపుగా పోషించింది. అన్నం అంతా చూడనక్కరలేదు. స్వతంత్ర కావ్యంలాగే ఉంది పొడి మాట లేక....

అచ్చుకి తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయం కూ సార్థకమయింది.

ఈలాగే మిగతా కావ్యాలుకూడా వెంకటాచలం చేతుల్లోంచి వస్తాయని ఆశిస్తూ ఎదురు చూద్దాం.

# శ్రీ అద్వైత శాంకరి

[రచయిత: శ్రీ వంగర కాశీవిశ్వేశ్వర వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి. ప్రతులకు : రచయిత, ఐ. టి. సి. లిమిటెడ్, ఐ. యల్. టి. డి. డివిజన్, పి. బి. నెం. 20, రాజమండ్రి-1. మూల్యము : రు. 4-00]

శాంకరిని స్తుతిస్తూ వ్రాసిన శతకం ఇది. సంస్కృతం, తెలుగు రచయిత చేతిలో సమశైలిలో తూగాయి. అకుంఠితమైన నడకగలవే వృత్తాలన్నీ.

పరమేశ్వరి స్వరూప స్వభావాలను అరటిపండు వలిచి చేత పెట్టినట్లు అమాత్రం ఈ మాత్రం చదువుకున్న వారంతా సులభంగా అర్థం చేసుకునేట్టు చెప్పడములో రచయిత ఆత్మీయత కృతార్థ మయింది.

తాత్త్విక విషయం అనగానే తలపట్టుకుంటారు చాలామంది. సరిగా చెప్పలేక తలపట్టుదాకా వెళతారు చదువుకున్నా మనుకునే కొందరు ధీవరులు. ఈ శతక రచయిత శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఆలాటి కోవకి చెందని సుధీవరులని నేను అనుకున్నాను.

స్వశక్తిని తెలుసుకోలేని వ్యక్తి పరాశక్తి నెలా తెలుసు కుంటాడు? అనేది నేటి మాటకాదు, ఇది బూటకంకాదు. సాంకేతిక పదాలేవో వల్లించి ముఖపిథానంచేసి భుజాలెగరవెయ్యడానికిన్నీ ఉన్నదాని ఉన్నట్టు ఇంపుగా నింపుగా చెప్పడానికిన్నీ చాలా తేడా ఉంటుంది. శాస్త్రిగారు తాత్త్విక విషయం ఏదైనా సులభావ బోధంగా చెప్పగల ఆత్మవిద్యా పాండిత్యం కలవారని యీ చిన్నారి కృతి చెప్తూంది. ఉదాహరణకి ఒక పద్యం :

> 'ఉన్నది ఒక్కటేయగుట
> నూహలు చేసిన రెండు నుండునే?
> కన్న ప్రపంచ మంతయును
> కన్పడు నద్దములోని బింబమే
> తిన్నగ తన్ను భాగనిన
> తీరున బ్రహ్మములోని విశ్వమున్
> క్రన్నన వేఱ చూచుటది
> జ్ఞానవిహీనత కాదె; శాంకరీ!

తన బాధలు కొడుకు తల్లితో దీనంగా చెప్పుకుంటున్నట్టున్నాయి కొన్ని పద్యాలు. మరి ఆ తల్లి కరుణించక ఏమి చేస్తుంది? లలితా సహస్రం ఇత్యాదులలోంచి కూడా కొన్ని భావాలూ పదాలూ దీనిలో రూపొంది యీ శతకాన్ని భక్తిభావ బంధురం చేశాయి. పర మేశ్వరికి సంబంధించి శ్రీచక్రం, శ్రీ రాజరాజేశ్వరి, శ్రీ గాయత్రి, శ్రీ దుర్గ, శ్రీ అన్నపూర్ణ చిత్రపటాలు – అది శంకరుల చిత్రపటం ఈ కృతికి దివ్యాకృతి కలిగించాయి. ఆస్తికతకు జోహారులర్పించే సుమనస్కులందరూ సంభావించదగిన కావ్యమిది.

ముద్రణకు తిరుపతి దేవస్థానంవారి ఆర్థిక సహాయం సార్థక మయింది.

# యాదవ చంద్రిక

[రచన : శ్రీ మల్యాల దేవిప్రసాద్ యాదవ్. ప్రతులకు : తెలుగుభూమి, గాంధీభవన్, హైదరాబాద్-1. వెల: రూ. 3 లు.]

భారతం, హరివంశం మొదలైన గ్రంథాలనాధారంగా చేసు కుని యాదవ చరిత్రను చెప్పే వచన గ్రంథం ఇది.

యదు వంశమునందు పుట్టినవారు యాదవులు. దీనినెవ్వరూ కాదనలేరు. వీరు గోపులు, గొల్లలు ఎలాగయినారనే ప్రశ్నకు ఈ రచన సరియైన సమాధానమిస్తుంది.

అవతార పురుషుడు కృష్ణుడు యాదవుడే. అయితే యాదవు లకు సుక్షత్రియ జాతితో సంబంధ బాంధవ్యాలు ఎలా కలిగాయి? అని ప్రశ్నిస్తే యాదవులు (అనాటి కృష్ణాదులు) క్షత్రియులే అని నిశ్శంకంగా చెప్పవచ్చును.

కాలక్రమేణ యాదవులు వృత్తిరీత్యా గొల్లలుగా చరిత్ర లోకి వచ్చారనేది నిర్వివాదాంశముగా యీ చిన్ని గద్య రచన సప్రమాణంగా చెప్తూంది.

ఈ 'యాదవ చంద్రిక'లో తెలంగాణా నకు సంబంధించిన విషయాలు కొన్ని ఆంధ్ర ప్రాంతీయులు తెలుసుకోవలసేవి ఉన్నాయి.

'గొల్లకొండయ్య-గోలకొండయ్య-దుర్గం' అనే శీర్షికనుబట్టి వ్రాసిన విషయములో గోల్కొండ చరిత్ర తెలుస్తుంది. అలాగే దక్షిణాపథంలోని యాదవులు – యాదవరాజ్యాలు – యాదవుల కుల దేవత – ఇత్యాది శీర్షికల క్రిందనున్న విషయం యాదవుల విశిష్టతను, చరిత్ర ప్రసిద్ధిని తెలుపుతుంది.

పొన్నిగంటి తెలగన్న యయాతి చరిత్రను వ్రాసిన కవి యాదవుడని దీనిలో ఉపపత్తి చూపారు. అది చదివితే 'అవును కాబోలు!' అని అనిపిస్తుంది. కాని ఆ కవి 'వియోగి' అని నేనను కుంటాను.

శాసనాలనుకూడా ముందుంచుకుని యీ గ్రంథం రచించిన రచయిత చారిత్రిక కృషి మెచ్చదగినదే. ప్రాత్రపతి ముచ్చటగా అచ్చయేసరికి ఆయన లేకపోయాడు. అదే శోచనీయం.

# శ్రీ మాతృ పూజ, అమర సందేశం, జీవన కాంతి

[ప్రతులకు : శ్రీ విశ్వశాంతి జ్యోతి ప్రచారసమితి జ్యోతి స్థాన్ - శాంతిగిరి, దివ్యద్వార్, పెద్దాపురం - 533 437 తూ. గో. జిల్లా ప్రతుల వెల వరుసగా రు. 2-50, రు. 2-00, రు. 8-00]

1. 'మాతృదేవోభవ - అనే సనాతనోక్తి ఆధారంగా వ్రాసినది శ్రీ మాతృపూజ.

తల్లిని మించిన దైవములేదు - అనేది ప్రాథమిక పాఠశాలల్లో పిల్లలకు చెప్తూ ఉంటారు. కాని పెద్దకాగానే 'తల్లివిషమాయె పెండ్లాము బెల్లమాయె' అనే గీతానికి ఉదాహరణగా. కొందరు తయారవుతూ ఉంటారు. 'తల్లి'అనేవ్యక్తి పశుపక్ష్యాదులలో కూడా పూజ్యస్థానం పొందుతుంది. తల్లిని ఎందుకు గౌరవించాలి? దానివల్ల వచ్చే ఫలితం ఏమిటి? అనే ప్రశ్నలకు ఈ చిన్ని పొత్తం చక్కని సమాధానాలు చెప్తుంది. అమ్మా! అనే మాట నోట రావడంలో ఉన్న విశేషం ఈ గ్రంథంవల్ల తెలుస్తుంది.

శ్రీమాత = పరాశక్తి : పరాశక్తికి రూపాంతరం తల్లి అనే ఆత్మజ్ఞానం కలిగిననాడు సృష్టికి సత్ఫలం కలుగుతుంది. శ్రీ మాతృ పూజావిధానం అనే ప్రకరణం తల్లిని పూజించే పద్ధతిని 108 నామాలతో సహా చెప్పి తల్లియందు భక్తి ప్రపత్తులను కలిగిస్తుంది.

అందరూ చదవవలసేదే. విశేషించి నేటి యువతరం ఓపికగా చదివి తెలుసుకుని తమ నడవడిని దిద్దుకోడానికి పఠనీయ గ్రంథమని చెప్పదగిన పవిత్ర రచన.

2. జ్యోతిర్మయ ప్రభువారి అమర సందేశము.

"దైవము తేజస్స్వరూపుడనియు, అతని ప్రతిరూపమే 'జ్యోతి' అనియు, ఆ తేజస్సును దర్శించువారే ముక్తిని పొందుదురని భారత ఋషులు, నిర్వాణము పొందుదురని బౌద్ధ ఋషులు, నిత్యజీవము పొందుదురని క్రైస్తవ ఋషులు, నిజాత్ అనుభవింతురని మహమ్మదీయ ఋషులు- ఏకైక సత్యమునే ప్రకటించిరి."-

ఆలయములలో ఉన్నవిగ్రహ స్వరూపములెన్ని విధములైయున్నను ఆలయములో వెలుగుచున్న 'జ్యోతి' స్వరూపము ఏకైక స్వరూపమై వెలుగుచుండునని గ్రహించుటయే 'జ్ఞానము'-

దానధర్మాలు - వాని కర్తృత్వ పథం, ఫలితాలు, విద్య, విజ్ఞానం -

ప్రాణముండగనే మేల్కొనుము - జ్ఞానముండగనే గ్రహించుకొనుము, శక్తియుండగనే సాధించుము-వంటి వాక్యాలు ఈ సందేశకృతి యొక్క స్వరూప స్వభావాలను వెల్లడిస్తాయి. అన్నీ మంచి మాటలేమరి. వాటిని అర్థం చేసుకుని నేటి మానవుడు ఆచరణ యందుంచుకుంటే తరిస్తాడు.

3. జీవన కాంతి

ఈ గ్రంథం సృష్ట్యాదిగా ఉత్పత్తి, ఆది మానవులు, వారి జీవితాలు, ఆహారవిధానాలు, శాకాహార విశిష్టత,

'అహింస పరమ ధర్మః' అనే ప్రధాన వాక్యాన్ని దేశవిదేశ మతప్రవక్తలు వ్యాఖ్యానించి బలపరచడం, ముఖ్యంగా ఏసు ప్రభువు నిర్ణయం, మహమ్మద్ నిర్వచనం - మాంసాహార నిషేధం - ఇలాటి ఉత్తమ విషయాలను వివరించి చక్కని తెలుగులో చెప్పిన మంచి గ్రంథం.

దీనిలో మూడు భాగాలున్నాయి. బుద్ధి జ్ఞాన వివేకములు భీష్మాదులు చెప్పిన అహింసాపద్ధతి, బుద్ధుడు, మహావీరుడు శ్రీకృష్ణుడు, ఏసుక్రీస్తు జ్ఞానోపదేశములు, రజోగుణ, తమోగుణాలు - వాని ఉత్పత్తికి కారణాలు - ఇలాటి విషయాలను సులభపద్ధతిన యీ గ్రంథం బోధిస్తుంది.

శాకాహారం ప్రాముఖ్యం ముఖ్యంగా తెలుసుకోవలసేది.
'సర్వజీవులను సమానమైన దయార్ద్ర హృదయముతో ప్రేమించుచు నిర్మల మనస్తత్వము కలిగి జీవించువారే దివ్య పురుషులు' - అనే యీ వాక్యం ఈ గ్రంథంయొక్క పేరును సార్థకం చేస్తుంది.

నిత్య జీవితములో ఇలాటి గ్రంథాలు సంస్కృతం ఇతర భాషలూ రానివారికి అవశ్యం పఠనీయములని నొక్కి చెప్పవచ్చు. విశ్వశాంతి జ్యోతి ప్రచార సమితివారు మంచి గ్రంథాలను ప్రచురిస్తున్నారనీ, వీటివల్ల ఆధునిక సమాజములో మానవత్వాని ప్రాచీనమైన ఉత్తమ జ్ఞానసిద్ధి కలుగు తుందనీ నా అభిప్రాయం

## శ్రీమద్దక్షిణకైలాస

(గిరిప్రదక్షిణ మహాకావ్యము)

[రచన: శ్రీ చెలకుపల్లి జమదగ్ని శర్మ. ప్రతులకు: రచయిత పేర, శ్రీరామ నగరం కాలనీ, పానగల్లు, శ్రీ కాళహస్తి, చిత్తూరుజిల్లా. మూల్యము: 30 రూపాయలు.]

అరు పదములు, రెండువేల నాలుగు వందల నాలుగు పద్యాలుగల మహాకావ్యం. ఆరవ పదమందు అక్కరలు. విద్యున్మాలయున్నగు కొన్ని అపరిచిత వృత్తాలూ దండకం ఉన్నాయి.

వసిష్ఠుడు, రాముడు ప్రధాన పాత్రలు. వసిష్ఠుడు రామునకు చెప్తూన్నట్టు కథ నడిచింది. ప్రధాన కథ దక్షిణ కైలాసం అని విఖ్యాతమైన శ్రీ కాళహస్తి క్షేత్రమహిమ. అలాగే గిరి ప్రదక్షిణ విశిష్టత...

నావద్ద శ్రీకాళహస్తి స్థలపురాణం ఒకటి ఉంది. దాని యందు ప్రధానపాత్రలు రోమశ భరద్వాజులు. జమదగ్నిశర్మగారి యీ మహాకావ్య రచనకు ఆధారమేదో మరి!.... భరద్వాజమహర్షి అడుగుతూంటే రోమశ మునీంద్రుడు చెపుతూనట్టు ఉన్న స్థల పురాణం వేదవ్యాస ప్రోక్తమైన శివపురాణంలోని శివరహస్యాంతర్గతం అని ఉంది. 90 అధ్యాయాలు, 9430 శ్లోకాలూగల గ్రంథమది. దానియందున్ను, శర్మగారి యీ కావ్యమునందున్ను చాలా కథలు సమంగానే ఉన్నాయి. నత్కీరుని కథ స్థలపురాణములోలేదు. అది హాలాస్య మాహాత్మ్యములో ఉంది. తెనుగున ధూర్జటి కావ్యములో ఉంది. ప్రాచీన పౌరాణిక కథా కథనాన్ని గురించి అవున, కాదనేవి ఇలాగే ఉంటాయి. శర్మగారి గ్రంథములో ఉన్న విషయాలు కొన్ని అందులేవు.

జమదగ్నిశర్మగారి రచనా విధానం ప్రణవపూర్వక పంచాక్షరమనువును ఆరు పదాలుగా గ్రహించి ఆద్యక్షరముతో ఆయాపదాల ఆద్యక్షర వృత్త రచన చేసినట్టు గ్రాహ్యం. కనుక ఇది తన్మంత్ర సమ్మతమై సర్వజన సమారాధ్యం అవడములో ప్రత్యాఖ్యానం ఉండదని నా అభిప్రాయం.

కన్నప్ప కథతో గ్రంథవిషయం పూర్తి అవుతుంది. శ్రీ కాళహస్తి క్షేత్రానికి సంబంధించిన ప్రధాన కథలు సాలెపురుగు పాము, ఏనుగు - అనే జీవులకు సంబంధించినవి. ఇవి చాలమంది తెలిసినవే. అయితే వాటి తొలి పుట్టువులను గూర్చి చాలామంది తెలియదు. అవి తెలుసుకోవలెగదా మరి.

అలాగే నీల మొదలైన వారికి ఆ క్షేత్రం ముక్తినిచ్చిన అక్షయ పాత్రం అయినది కూడా తెలుసుకోడానికి యీ గ్రంథం ఉపకరిస్తుంది.

విసువెత్తించే వర్ణనలు లేవు. నిరర్థకములైన పదాలు కానరావు. భక్తికీ, అమాయికతకూ ఇందలి అక్షరాలు రూపుదిద్దాయని దృఢభక్తి విశ్వాసాలతో చెప్తున్నాను. ఉదాహరణకి ఒక్కటే ఒక్కటి పద్యం ఎత్తిచూపుతున్నాను. తెరచినంతనే కనిపించినది. ఎంచి తీసినది కాదు.

> శివలింగంబును సిల్పి తన్నిమిట
> నర్చింపం దగునన్నివు నీ
> భవ మద్దేవు దయా విశేషమున
> సాఫల్యంబు నందున్ ఘటో
> ద్భవ ముఖ్యాశ్రిత మంత్రి రాజమిది నీ
> వాగ్బంధమున్ ద్రెంచి నీ
> భవ బంధంబుల దుంచి వైచునిక
> విశ్వాసంబునన్ నిల్వుమా!"

మూగభీముని కథలోది ఇది. శర్మగారి కవితారీతిలో ఏ సూరనామాత్యుడో, రామభద్రుడో, రామకృష్ణుడో కనిపిస్తారు.

ఈ మహాకావ్యం చక్కగా పుస్తక రూపం పొందడానికి అర్థికంగా చేయూత ఇచ్చిన తిరుపతి దేవస్థానంవారు, శ్రీ బి. వి. ఎస్. ఎస్. మణిగారున్నూ ప్రశంసనీయులు.

అలాగే అతి సుందరంగా ముద్రించిన క్రాంతిప్రెస్ - మదరాసు వారున్నూ అభినందనీయులు.

శ్రీ యామిజాల పద్మనాభస్వామి

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 61247.